# కథాకేళి

తెలుగు కథల
సమాహారం

ఆగస్ట్, 2006

సంపుటి:1 సంచిక:5

వెల: రు. 8/-



C1




A hot property at Maheswaram - Shamshabad

Plan your dream home with us at Aananda, a well designed layout for one and all to build their luxurious, comfortable and spacious homes with a friendly and cultured neibourhood. On the biggest crossroad of future, the road connecting the Bangalore national highway and the Srisailam state highway.





# ప్రతి అవసరానికీ...ఎన్నెన్నో...

ది బ్యూటీ .................... రు. 99/-
ఒబెసిటి .................... రు. 99/-
వ్యక్తిత్వ వికాసం .......... రు. 99/-
ది మేజిక్ .................... రు. 99/-
ఉపనిషద్దర్శనము ....... రు. 99/-
మనో వికాసం .......... రు. 99/-
సంఖ్యాశాస్త్రం ............ రు. 99/-
కనకదుర్గమ్మ వైభవం . రు. 99/-
ది ఎంబ్రాయిడరీ ......... రు. 99/-
(2 సి.డి.లు)
తెలుగులో రైమ్స్
పిల్లల పాటలు - (4 భాగాలు)
(ఒక్కొక్కటి) వీడియో రు.99/-
ఆడియో రు.49/-

యోగా ఫర్ డయాబెటిక్స్ .. రు. 99/-
సుమతి పద్యావళి (2 భాగాలు) ...............
(ఒక్కొక్కటి) వీడియో రు.99/-
ఆడియో రు.49/-
కంప్యూటర్ హార్డ్‌వేర్........ రు. 149/-
ఫ్యాబ్రిక్ పెయింటింగ్ (2 CDs) రు. 149/-
యోగా టుడే ఒక్కొక్కటి రు. 99/-
(తెలుగు/ENGLISH)
వేమన నీతి పద్యాలు (2 భాగాలు)
(ఒక్కొక్కటి) వీడియో రు.99/-
ఆడియో రు.49/-
TEMPLES OF INDIA........ రు. 99/-
ENGLISH (Runs on PC only)
విక్రమాదిత్య..................... రు. 99/-
మానస సరోవర యాత్ర ... రు. 99/-

మొదటిసారిగా
పూర్తి ఏనిమేటెడ్
వీడియో CD లు
6, 7, 8, 9, 10
తరగతులకు
తెలుగు/ఇంగ్లీష్‌లలో
(స్టేట్ సిలబస్)

**Physics & Chem.**
(Each Class) 199/-
**Biology**
(Each Class) 199/-
**Maths**
(Each Class) 249/-

## Rhymes & Stories

Kids Ryhms VCD .......................................... 99
ABC - VCD 2 CDs .......................................... 149
నీతి కథలు .......................................... 99
పంచతంత్ర కథలు .......................................... 99
English Learing (Level 1 to 8) Each Level .............. 80
బాల వినోదం (నీతి కథలు) VCD .... PC/VCD/DVD .... 149
ఎందరో మహానుభావులు VCD. ..... PC/VCD/DVD .... 149
రామయాణం తెలుగు యానిమేషన్. . PC/VCD/DVD .... 199
బాలశిక్ష . . ................ PC/VCD/DVD .... 199
CBSE Class 1 to 12 Each CD - Each Subject ..... 299
AP State Inter Maths (Eng/Tel I/II Year) ................ 399
AP State Inter Physics (Eng/Tel I/II Year) ............ 399
AP State Inter Chemistry (Eng/Tel I/II Year) ......... 399
Images & Cliparts each categery Two CD ........... 299

## Language Skills

Cafe English 6 CD's Set ..................................... 750
English Made Easy for Kids 8 CD's Set .............. 496
500 Essential Buisiness Letters .......................... 199
Crossword Generator ........................................ 199

## Competitive Exams & Tests

- BITSAT • GRE • TOFFEL • IELTS • PMT ... Each 499
- CAT • Civil Services - Prelims - General Studies
- Combined Defence Services Examination • AIEEE
- IIT - Join Entrance Examination .................. Each 300
- Personal IQ Test .............................................. 199
- Brain Teasers • Call Centre Training ............ Each 399

## TUTORS:

- Learning C • Learning C++ • Photoshop CS • Java
- Flash MX • Illustrator CS • Corel Draw 12 ........... 149
- 3D Studio Max • Maya .............................. Each 199
- Windows XP + Office XP + Fundamentals ........... 499

**MEDICAL:** .......................................... Each Rs. 499/-
• Respiratory Diseases • The Emergence of Medical Science • Fabric of the Human Body • Control Your Health • 100 General Health Disorders • The Human Disease • Human Body • Respiratory System • Hematology & Immune System
• Human Anatomy & Physiology ......................... 1500

**MANAGEMENT:** .......................................... Each Rs 495/-
• Business Management • Performance Management • Ethics in Business • Executive Business Reports • Decision Making • Time Management • Negotiation Skills • Humor at work • Effective Communication • Successful Marketing for Executives • Presentation and Public Speaking • Business Correspondence • Peoples Skills for Executives • Making Meeting work • Customer Service • Telephone Skills • Team Building • Creative Thinking • Interviewing Skills

**GAME CDs from Rs. 99/- onwards**

**తెలుగులో కంప్యూటర్ జాతకం**
కేవలం రు.50/-
పేరు, పుట్టిన తేది, సమయం, పుట్టిన ఊరు వివరాలు వ్రాసి రు.50/- + పోస్టేజి/కొరియర్ నిమిత్తం రు.20/- కలిపి మొత్తం రు.70/- ఎం.ఓ. చేయండి.
పూర్తి ప్రెడిక్షన్స్‌తో 50 పేజీల ప్రింటవుట్స్ | పాస్‌వేర్ ధర రు.250/-

★ మీకు కావలసిన C.D. ల ధరను, పోస్టేజి / కొరియర్ ఛార్జీలు నిమిత్తం రు. 25/- లను M.O./DD ద్వారా క్రింది చిరునామాకి పంపించండి.
★ మీ పూర్తి చిరునామాతో బాటు మీ ఫోన్/మొబైల్ నంబరు, ఇ-మెయిల్ అడ్రస్ కూడా వ్రాయండి.

**PC VCD DVD**




# 8, Surya Apartments, Revenue Colony,
Mogalrajapuram, Vijayawada-10.
Ph: 0866-6666677 www.sphoorthi.com

# రచనలకు స్వాగతం

రచయితలకు ప్రోత్సాహం

'కథాకేళి'లో ప్రచురణకు రచనలు పంపేవారు క్రింది విషయాలు గమనించవలసిందిగా మనవి.

- ★ సరదాగా చదువుకోవడానికి ఉపయోగపడుతూనే ఎంతో కొంత సమాజహితం కోరే కథలకు, హాస్యకథలకూ అధిక ప్రాధాన్యత ఇవ్వబడుతుంది.
- ★ కథ సైజుపై ఎలాంటి నియమాలూ లేనప్పటికీ చిన్న కథలకు ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వడం జరుగుతుంది.
- ★ రచనల ఒరిజినల్ వ్రాత ప్రతులు మాత్రమే పంపించాలి. జెరాక్స్ కాపీలు అనుమతించబడవు.
- ★ రచనలు అరఠావు లేదా ఎ4 సైజు పేపరుపై వ్రాసి, వీలైనంత వరకూ కొట్టివేతలు, దిద్దివేతలూ లేకుండా ఉండాలి.
- ★ నచ్చిన కథకు అవసరమైన మార్పులు చేసుకునే హక్కు మాకు ఉంటుంది
- ★ ప్రచురించిన ప్రతి కథకూ పారితోషికం ఇవ్వడమే గాక ఆ నెల నుంచి సంవత్సరం పాటు పత్రికను ఉచితంగా పంపిస్తాం.
- ★ కార్టూన్లు, జోక్స్ నిరభ్యంతరంగా పంపవచ్చు (కార్టూన్స్ 11x7 సైజుకి వచ్చేలా ఉండాలి.)
- ★ పుస్తక సమీక్షల నిమిత్తం కొత్తగా విడుదలైన పుస్తకాలు మాత్రమే (రెండు కాపీలు) పంపాలి.
- ★ సాహిత్య కార్యక్రమాల వార్తలు, ఫొటోలు కూడా పంపవచ్చు.

సంపుటి : 1
సంచిక : 5

ఆగస్ట్, 2006

ఎడిటర్: యం. నాగకుమారి

కథాకేళి

మాస పత్రిక

# జూదం

ఈ మాటంటే చాలామందికి కంపరం పుడుతుంది. కాపురాలు కూలిపోతాయని భయం కలుగుతుంది. క్లబ్బుల్లో పేకాటలు... క్రికెట్ వంటి సంబరాలలో బెట్టింగ్‌లు... పండగలకీ పబ్బాలకీ కోడిపందాలు... గుండాటలు... వగైరా... వగైరా...

క్లబ్బుల్లో పేకాటలు ఆడేవారు సంఖ్యాపరంగా చాలా చాలా తక్కువ. క్రికెట్ వంటి సరదాలూ ఏడాదికోసారో... రెండుసార్లో... ఇక కోడి పందాలు వగైరాలు సంక్రాంతి సీజన్‌లోనే...

క్లబ్బుల్లో కూర్చుని సీక్రెట్‌గా పేకాట ఆడుకుంటున్న వారిని పెద్దపెద్ద పోలీసాఫీసర్లు దగ్గరుండి పట్టుకుంటూంటారు అప్పుడప్పుడూ... క్రికెట్‌పై పందాలు కాసారా? ఖబడ్దార్... అంటూ హెచ్చరిస్తూంటారు ఆ హడావిడి ఉన్న సమయాల్లో... ఇకపోతే సంక్రాంతి పండగ హడావిడిలో పోలీసులు ఇంట్లో పండగ చేసుకోకుండా పల్లెటూర్ల బాట పట్టి తాము పరిగెడుతూ ప్రజల్ని పరిగెట్టిస్తూంటారు చేలగట్ల వెంబడి...

బాగానే ఉంది... ప్రజలు దురలవాట్లు పాలబడకుండా ఎవరివంతు బాధ్యతలు వారు నిర్వహిస్తున్నారు. మరి ఇప్పుడు ఇంటింటా వ్యాపించిపోయిన జూదం గురించి ఎందుకు ఎవరికీ పట్టదు? అసలది జూదంలానే కన్పించడం లేదా? అదేనండీ... SMS ల హడావిడి గురించి నేను చెప్పేది... ఏ టి.వి. ఛానల్ చూసినా, ఏ ప్రోగ్రామ్ పెట్టినా – పంపేయండి... SMS లు... గెలిచేసుకోండి... బంగారం, పట్టుచీరలు... ఇంకా ఎన్నో... ఎన్నో...

చిన్న పిల్లల నుంచి వృద్ధుల వరకూ అందరినీ ఊరించి, కోట్లు దండుకొంటున్న ఈ కార్యక్రమాలు 'జూదం' జాబితాలోకి రావా? "మీ పేరు కరెక్ట్‌గా చెప్పగలిగితే బహుమతి మీకే" వంటి పిచ్చి ప్రశ్నలకు SMS ల ద్వారా సమాధానం ఇమ్మనికోరుతూ వచ్చే ఆహ్వానాల మతలబు ఏమిటి?

చేతిలో సెల్‌ఫోన్ ఉన్న వారంతా ఆలోచించండి...
నాయకులారా! అధికారులారా! మీరంతా మళ్ళీ మళ్ళీ ఆలోచించండి.

---

ముఖచిత్రం: "క్విట్ ఇండియా" చిత్రకారుడు: ఉదయ్
కథలకు చిత్రాలు: పాణి, ఉదయ్, మారుతి, ఏ.వి.యమ్, సత్యమూర్తి, కొచ్చెర్ల, గిరిధర్

Printed, Published and Owned by M. Rama Rao on behalf of CRESCENT PUBLICATIONS and Printed at Ratna Printing Works, 28-19-29, Janda Street, Arundel Pet, Vijayawada-520 002. A.P. and Published at 29-25-43A, Vemuri Vari Street, Suryarao Pet, Vijayawada-520 002. A.P.
Editor: M. NAGAKUMARI, 29-25-43A, Vemuri Vari Street, Suryarao Pet, Vijayawada - 520 002, A.P.



# పాఠక స్పందన

కథల కోసమే ఒక మాసపత్రికను ప్రారంభించడం అభినందనీయం. సాహితీవేత్తల ప్రశంసల్ని, పాఠకుల ఆదరణనూ పత్రిక చూరగొంటోంది. మంచి కథలను ప్రచురిస్తున్నారు. డాక్టర్ మలయశ్రీగారి 'సన్మానం' కథ సమాజంపై సినిమా ప్రభావం ఏ విధంగా ఉంటుందో తెలియజేయడమేగాక, రచయితలకు, నిర్మాతలకు కనువిప్పు కలిగించేలా ఉంది. చంద్రగిరి కోట గురించి అనేక విషయాలు అందించారు.

– డా॥ ఎ. మంజులత, వైస్‌ఛాన్సలర్,
పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం

'కథాకేళి' – బుక్‌షాపులో చూడగానే మరో ఆలోచన లేకుండా తీసుకున్న పుస్తకం. ఆదికవి నన్నయ ముఖచిత్రం ఉదయించిన శోభలతో ముద్దుగా ఉంది. ఓ కథ పేరు 'ముద్దు' – ముచ్చటేసింది. సైజు, ప్రింట్ ఫాంట్ రమణీయంగా ఉంది.

– రాంపా, హైదరాబాద్

## మీ అభిప్రాయం చెప్పండి - పత్రిక ఉచితంగా పొందండి!

'కథాకేళి' 5వ సంచిక ఇప్పుడు మీ చేతుల్లో ఉంది. ఇంతవరకూ వెలువడిన సంచికలపై మీ అభిప్రాయాలు తెలియజేయవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాం. మీ అభిప్రాయాలను నిర్మొహమాటంగా తెలియజేస్తే మీ సూచనల మేరకు కథల ఎంపిక జరిపి, ప్రతినెలా నిత్యనూతనమైన పత్రికగా 'కథాకేళి'ని మీ చేతుల్లో ఉంచడానికి కృషి చేస్తాం. పత్రిక పూర్తిగా చదివిన తరువాత కొద్ది నిమిషాలు దీని కోసం కేటాయించి, ఒక పోస్ట్‌కార్డ్‌పై మీ మీ అభిప్రాయాలు తెలియజేయవలసిందిగా కోరుచున్నాం.

మంచి సూచనలను ఈ శీర్షికన ప్రచురించడమేకాక ఆ నెల పత్రికను ఉచితంగా పంపిస్తాం.

– ఎడిటర్

'కథాకేళి' క్రమక్రమంగా ఎదుగుతోంది. ఈసారి కథలకు వేసిన బొమ్మల స్థాయి, క్వాలిటీ బాగున్నాయి. కార్టూన్లు కూడా బాగున్నాయి. సంపాదకీయాలు కొంచెమే అయినా ఆలోచనాత్మకంగా ఉంటున్నాయి. 'ఆదికవి నన్నయ్య' గురించిన వ్యాసం, 'చంద్రగిరి'పైన చారిత్రక వృత్తాంతం పత్రిక శోభను పెంచాయి. పుస్తక సమీక్షకు కనీసం రెండు పేజీలు ఉంటే బాగుంటుంది. సభాపర్వానికి ఓ రెండు పేజీలు కేటాయించగూడదూ! ఉదయ్ వేసిన ముఖచిత్రం అరుదైన పెయింటింగ్‌లా భావరమ్యంగా ఉంది. 'కథాకేళి' ఎదుగుదలను అనవరతం ఆకాంక్షిస్తూ...

– డా॥ ఎన్. గోపి, హైదరాబాద్

'డబ్బు' గురించి ప్రచురించిన సంపాదకీయం స్టేటస్ సింబల్‌కి పోతూ అజాగ్రత్తగా ఉండే వారికి ఎంతో సూచన ప్రాయంగా ఉంది. 'కథాకేళి' 'ఇంతింతై వటుడింతై' అన్నట్లు దినదినాభివృద్ధి చెందుతూ చక్రకేళీ అంత మధురఫలాలని అందించాలని ఆశిద్దాం.

– అవ్వా విజయలక్ష్మి, మచిలీపట్నం

వెయ్యి వసంతాల తెలుగు సాహిత్యపరిమళ సుమాల వెనుక సజీవచిత్రంగా నిలిచిన 'ఆదికవి నన్నయ' జూలై నెల కథాకేళి ముఖచిత్రంగా దర్శనమీయడం ముదావహం.

– వక్కలంక రామారావు, అమలాపురం

ఒకప్పుడు కథలు మనిషి వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దేందుకు ఉపయోగపడేవి. చిన్న పిల్లల దగ్గర్నుంచి పెద్దల వరకూ అందరూ ఆసక్తిగా చదివేవి కథలనటంలో ఏమాత్రం అతిశయోక్తి లేదు. చిన్న పిల్లలకి మన సంస్కృతి, సంప్రదాయాల్ని తెలియజేసే శీర్షిక ఉంటే బావుంటుంది.

– సిహెచ్. అశ్వినీకుమార్, వెల్లూరు

ముఖచిత్రం ముచ్చటగా ఉంది! కథలు కమ్మగా ఉన్నాయి! జోకులు అదనపు షోకులు! టోటల్‌గా కథాకేళి – కోనసీమ చక్కెరకేళి!

– పుష్యమి, హైదరాబాద్

పాఠకులలో పరనాసక్తి పెరగటానికి ఇలాంటి పుస్తకాలు ఇప్పుడు ఎంతో అవసరం. మిమ్మల్ని అభినందిస్తున్నాను. "కథాకేళి" దినదినాభివృద్ధి చెందాలని కోరుకుంటున్నాను.

– ఉంగుటూరి శ్రీలక్ష్మి, హైదరాబాద్

ఈ పత్రిక తొలి వార్షికోత్సవం నాటికి పూర్తి

హంగులతో మంచి స్థాయికి చేరుకుంటుందని నా నమ్మకం. పుస్తక సమీక్షలతో బాటు సాహిత్యకార్యక్రమాల వార్తలు – ఫొటోలు ప్రచురించాలనుకోవడం బాగుంది. సంపాదకీయం కూడా క్లుప్తంగా, ఈనాటి పరిస్థితులను ప్రతిబింబిస్తూ ఉంటోంది.

– పి. చంద్రశేఖర్‌అజాద్, హైదరాబాద్

"కథాకేళి" అంటే కేవలం కథలకే పరిమితం కాకుండా "చంద్రగిరి" చరిత్ర విశేషాలను చక్కగా తెలియజెప్పారు. కార్టూన్లు కూడా బావున్నాయి. భవిష్యత్‌లో ఎప్పుడూ సీరియల్స్ ప్రచురించవద్దు. 'కథాకేళి' మాసపత్రికలకు రారాజు కావాలని కోరుకుంటూ...

– మైలవరపు పుల్లయ్య పంతులు, బూరుగుపూడి

జూలై సంచిక ఆదికవి నన్నయ ముఖచిత్రంతో వెలు వడడం అపురూపంగా అన్పించింది. మల్లాది వెంకటకృష్ణమూర్తిగారి 'బ్రెయిన్ టీజర్స్' ఆకట్టుకున్నాయి. కథలన్నీ వైవిధ్యంగా ఉండి, ఆసాంతం చదివించాయి.

– శ్రీనివాస్ కాళే, బిచ్కుంద

ఈ సంచికలో [illegible]

గాఢ నిద్రలో ఉన్న కిరణ్‌కి అంతశ్చేతన స్పందించింది. అతనికి ప్రపంచ ప్రభుత్వపు ముఖ్యకార్యదర్శి పంపిన టెలిపతి వార్త తాలూకు స్పందన అది. ఆ వార్త తాలూకు విద్యుదయస్కాంత తరంగాల చలనం వలన అతనికి మెలకువ వచ్చింది. గ్రహాంతర మేధో జీవ విభాగం వారు అతనికి ప్రపంచ ప్రభుత్వం ద్వారా ఆ వార్త పంపారు. దాని సారాంశం:

భూగోళానికి 156 కాంతి సంవత్సరాల దూరంలో "ఋతంభర" నక్షత్రమండలం ఉంది. ఆ మండలంలోని ఒక గ్రహం "ప్రజ్ఞ". అది భూగోళాన్ని పోలిన గ్రహం. ఆ గ్రహం పర్యటనకు భారతదేశ ప్రతినిధిగా అతడు ఎన్నికయ్యాడు.

క్రీ॥శ॥ 2552 నాటి వరకూ మనిషి గుర్తించిన సారూప్య భూగ్రహం వంటి గ్రహాలలో అతి తెలివైన జీవగోళంగా "ప్రజ్ఞ" పేరు పొందింది. అక్కడి మేధో పరిణతితో పోలిస్తే భూగోళం వర్ధమాన గ్రహం. "ప్రజ్ఞ"పై రాచరిక ప్రభుత్వం నడుస్తోంది. ప్రస్తుతం ఆ గ్రహం రాజు పేరు "బృహస్పతి".

అటువంటి మేధో గ్రహపు ప్రతినిధులతో కిరణ్ మాట్లాడతాడు. ఆ యాత్రా లక్ష్యం, బాధ్య



# "నానో జెయింట్"

తలు, పద్ధతులు, హక్కులు వివరించబడతాయి కనుక సమయానికి కిరణ్ నిర్దేశిత ప్రాంతంలో ఉండాలి.

భారత ప్రతినిధిగా కిరణ్ ఎంపికకు గల కారణాల్ని ఆ సందేశం వివరించింది. "కిరణ్! మీరు మీ గోళంపై అత్యధిక మేధోజీవి అని మా కంప్యూటర్లు నిర్ధారించాయి. విశ్వమేధో అంకస్థాయి ప్రకారం భూగోళంపై మనుషులలో 90–110 మధ్య ఈ అంకం ఉంటుంది. దీనినే మేము UIQ (Universal Intelligence Quotient) అని వ్యవహరిస్తాం. మా గోళంపై UIQ 125-150 మధ్య ఉంటుంది. అందుచేత మిమ్మల్ని ఈ యాత్రకు ఎంపిక చేసాం. కంగ్రాట్స్"

ఈ వర్తమానం కిరణ్‌ని ఉక్కిరిబిక్కిరి చేసింది. ఆ మన్నన, అవకాశం అటువంటివి.

*   *   *

అనుకున్న ప్రకారం "ప్రజ్ఞ" గ్రహపు అధికార బృందం నియమించిన టైమ్ ప్రకారం అతనితో చర్చించారు. ఆ వివరాల సారాంశం:

"మిస్టర్ కిరణ్! మీరు మా గ్రహంపై భూగోళపు సంవత్సర కాలం ఉండాలి. మా గ్రహపు కట్టుబాట్లను, నియమాలనూ అనుసరించాలి. మీరు బస చేసినంతకాలం మీకు మా గ్రహపు పౌరహక్కులు, సదుపాయాలు, బాధ్యతలు, తూ.చ. తప్పక వర్తిస్తాయి. భూగోళానికి అవసరమైన శాస్త్రసాంకేతిక విజ్ఞానాన్ని మీరు పొందగలుగుతారు. అలాగే మా గోళంతో భూగోళపు స్నేహసంబంధాలు, వ్యాపార బంధాలు, ఎగుమతి, దిగుమతి ఒప్పందాలు, కళ, విజ్ఞాన, సాంస్కృతిక బృందాల మార్పిడి వంటి అంశాలపై బాహాటంగా చర్చించి, అంగీకారానికి వచ్చి, అనేక ఒప్పందాలు కుదుర్చుకోవచ్చు. అది ఉభయగ్రహాలకూ అనేక విధాలుగా ఉపకరిస్తుంది. ఇందుకు తగిన మధ్యవర్తిత్వాన్ని ప్రపంచ ప్రభుత్వం వహించి, మార్గదర్శకం చేస్తూంటుంది.

మా గ్రహం మీద భాషలు, వ్యవహారాలు వలన మీకు ఇబ్బంది రాకుండా తగిన అనువాద కంప్యూటర్ వ్యవస్థలు మీకు అందుబాటులో ఉంటాయి. అవి మన భాషలను తగిన విధంగా తర్జుమా చేస్తూంటాయి. ఇదంతా నానో సెకండ్ల కాలంలో జరిగిపోతూంటుంది. మా గ్రహపు వాతావరణంలో మీరు హాయిగా తిరగడానికి తగిన ఏర్పాట్లు చేయబడతాయి".

ఈ సమాచారాన్ని, వివరణని బట్టి తన బాధ్యత, భూగోళానికి తన అవసరం ఎంత ఉందో కిరణ్‌కి బాగా అర్థమయింది. అందుకని విశ్వప్రభుత్వ సమాచార శాఖ ద్వారా "ప్రజ్ఞ" గ్రహం గురించి అన్నిరకాల సమాచారాన్నీ తెలుసుకున్నాడు.

*   *   *

పురాణపండ రంగనాథ్

"ప్రజ్ఞ" గ్రహవాసుల్ని "ప్రాజ్ఞులు" అంటారు. అక్కడి ప్రజలు చాలా పొట్టివారు. మూడున్నర – నాలుగు అడుగుల కన్నా పొడవుండరు. తలలు పెద్దవిగా ఉంటాయి. కనుబొమలు ఉండవు. నుదురు బోసిగా, నున్నగా ఉంటుంది. నడ్డికి విచిత్రమైన చిన్న తోక ఉంటుంది. అక్కడ ఏ చిన్న జీవికి హాని తలపెట్టినా పెద్ద నేరంగా పరిగణించి కఠిన శిక్షలు వేస్తారు. అక్కడ పరిఢవిల్లిన నీతి నియమాలు, జీవనాదర్శాలు, ఆచరణలు వలన వారి నిఘంటువులలో హత్య, చావు వంటి ఘాతుక పదాలు లేవు. ఘోర నేరాలు చేసిన నేరస్తులకు మరణశిక్షకు బదులు గ్రహాంతర వాస శిక్ష విధించి పంపి వేస్తారు. అదే పెద్ద శిక్ష.

ఒక అద్భుత ఆచారం అక్కడ ఉంది. మేధావులు, పరోపకార పరాయణులు, శాస్త్రవేత్తలు, కళారంగాలలో ఉద్దండుల మెదడులను వారి మరణానంతరం అతి శీతలీకరణ మందసాలలో భద్రపరుస్తారు. వాటిని ఉపగ్రహాలలో ఉంచి, "ప్రజ్ఞ" గ్రహానికి దూరంగా భద్రంగా పరిభ్రమించే ఏర్పాటు చేసారు. అవసరమైనప్పుడు వారి ప్రతిభాపాటవాలను టెలిపతి పద్ధతి ద్వారా పునరుజ్జీవింపజేసి వాడుకుంటూ ఉంటారు.

ఇవన్నీ ఒక ఎత్తు. మరే జీవగోళంలోనూ లేని, అవతరించని "కాలయంత్రం" వ్యవస్థను "ప్రజ్ఞ" శాస్త్రవేత్తలు రూపొందించి మేధో జీవ గోళాలకు మార్గదర్శకులయ్యారు.

* * *

| | |
|---|---|
| Nano: | ఒక యూనిట్‌లో 10 లక్షల వంతు యూనిట్ |
| ప్రేరణ: | IN BETWEEN TIME<br>– ఎస్. హెచ్. ఉస్మాన్ |

"ప్రజ్ఞ" గ్రహానికి యాత్రకై కిరణ్ గ్రహాంతర నౌకలో మొదట కుజ గ్రహానికి వెళ్ళాలి. అక్కడి నుంచి గోళాంతర నౌకలో "ప్రజ్ఞ" గోళానికి యాత్ర ప్రారంభమవుతుంది. అది ఒక అద్భుత అంతరిక్ష విమానం. నక్షత్ర మండలాలు దాటి గ్రహాంతర సీమలను అనుసంధించే రోదసీ విమానం. అటువంటి విమానాలు, విమానయానాలు, భూగోళ విజ్ఞానానికి అప్పటి వరకూ తెలియవు.

అలాంటి విచిత్ర విమానంలో కిరణ్ కూర్చున్నాడు. కొన్ని సెకన్ల తరువాత ప్రయాణం మొదలయింది. ఇంతలో అతనికి ప్రక్కనే ఉన్న చిన్న యంత్రంలో నుంచి "కళ్ళుమూసుకో" అన్నమాట సుతారంగా వినిపించింది. కిరణ్ కళ్ళు మూసుకున్నాడు. ఏమయిందో తెలియదు కానీ విమానం "చాలా... చాలా... చాలా..." వేగాన్ని పుంజుకున్న అనుభూతి కలిగింది. మరో సెకనులో అతనికి స్పృహ పోయింది.

ఎంతసేపయిందో తెలియదు కాని, స్పృహ వచ్చేసరికి అతనికి "ప్రజ్ఞ" గ్రహ వాతావరణం కనిపించింది. ఆ వాతావరణం ఏదోలా అనిపించింది. ఆ అనుభవం, అనుభూతి విచిత్రంగా ఉన్నాయి.

ప్రజ్ఞ గ్రహంపై అది ఉదయం. ఆకాశం వెలిసిన పసుపురంగు వలె ఉంది. కాషాయ రంగు మేఘాలు అక్కడక్కడా కదలాడుతున్నాయి, అక్కడ విమానం దిగిన చోట ఇద్దరు ప్రాజ్ఞులు కిరణ్‌కి స్వాగతం చెప్పారు. వారి ప్రవర్తన, దుస్తుల్ని బట్టి ఒకరు పెద్ద అధికారి అని, రెండవ వారు నౌకరనీ అర్థమవుతోంది. అధికారి పేరు డాక్టర్ బుధ. నౌకరు పేరు షాడో. డాక్టర్ బుధ గోళాధిపతి బృహస్పతికి ప్రత్యేక సలహాదారు. వారు ఇద్దరూ వినయంగా వంద

నం చేసి స్వాగతం చెప్పారు. షాడో ఒక ప్రత్యేకమైన ఓవర్‌కోటుని కిరణ్‌చే ధరింపచేసాడు. విచిత్రంగా మెరుస్తున్న దాన్ని ఆశ్చర్యంగా చూసే కిరణ్‌తో షాడో ఇలా అన్నాడు.

"అనేక భావావేశాలు, వాటి విపరీత ప్రభావాలూ అనుభవంలోకి వచ్చాక మా శాస్త్రవేత్తలు ఈ దుస్తులు రూపొందించారు. మీ భూగోళవాసులకు రాగద్వేషాలు ఎక్కువ. మీకు తెలియకుండానే మీలో భావావేశాలు ప్రబలుతాయి. అలా జరగకుండా ఈ దుస్తులు కంట్రోల్ చేస్తాయి".

అతని మాటలు కిరణ్‌కి ఆశ్చర్యం కలిగించాయి. భూగోళంపై కూడా రాగద్వేషాలు మంచివా? లేక హేతువాదం ముఖ్యమా? అనే వాదనలు జరుగుతున్నాయి. ఈ రెండూ మెదడులోని జీవకలాపాలే. కొందరు రాగద్వేషాలు (ఎమోషన్స్) ముఖ్యం అంటున్నారు. చాలామంది హేతువాదం (రేషనాలిటీ) ముఖ్యం అంటున్నారు. వీటి నియంత్రణకై పరిశోధనలు, సాంకేతిక పరికరాల రూపకల్పన సాగుతున్నాయి. షాడో చెప్పిన దుస్తులు అటువంటి ప్రక్రియకు సంబంధించినవే అని కిరణ్ తీర్మానించుకున్నాడు. ప్రజ్ఞ గోళపు సాంకేతిక, వైజ్ఞానిక ప్రగతి మనిషిని ఇంచుమించు జీవం ఉన్న మరమనిషిగా చేస్తున్నదన్నమాట. అటువంటి ప్రగతి భూగోళంపై అవసరమా?

* * *

నాలుగు రోజులలో కిరణ్‌కి అక్కడి విశేషాలు చాలా తెలిసివచ్చాయి. ప్రజ్ఞ గోళం సాంకేతికంగా, వైజ్ఞానికంగా ఎంతో ప్రగతి సాధించింది. యాంత్రిక నాగరికత మనిషిని మనీ యంత్రంగా మార్చినట్లు అనుకున్నాడు. ప్రజ్ఞ గ్రహవాసులు ద్రవరూపంలో ఉండే పౌష్టిక ఆహారం తీసుకుంటారు. ఇందుకు అవసరమైన పంటలు కాలుష్యప్రమాదం లేకుండా కృత్రిమ గ్రహాలపై ఉత్పత్తి చేయబడుతున్నాయి. ఆ ప్రక్రియ భూగోళానికి ఎంతో మేలు అని గ్రహించిన కిరణ్ ఆ ప్రక్రియ భూగోళానికి చేరే సహకార ఒప్పందం గురించి కీలకచర్చలు జరిపాడు. ప్రజ్ఞ గ్రహంపై అన్నిటికన్నా విశిష్టము, ఆధునికమూ అయిన యంత్రం ఉంది. అదే... కాలయంత్రం... టైమ్ మెషీన్. ప్రత్యేకంగా నిర్మితమయినది. ఒక షరతుపై కిరణ్ దానిలో ప్రయాణించడానికి డాక్టర్ బుధ అంగీకరించాడు. భూగోళ కాలజ్ఞానం ఆధారంగా ఆ యాత్ర చేయాలి తప్ప ప్రజ్ఞ గోళపు జీవకాలం ప్రాతిపదికగా ఈ యాత్రలో పాల్గొనరాదు. కాలయాత్రానంతరం అతనిని తిరిగి వర్తమాన యధాకాలంలోకి తీసుకువచ్చేస్తారు. ఈ నిబంధనలకు లోబడి కిరణ్ ఆ గోళపు టైమ్‌మెషీన్ యాత్రకు అంగీకరించాడు.

* * *

ఆ రోజు రానే వచ్చింది. కిరణ్‌ని డాక్టర్ బుధ, షాడో ఆ కాలయంత్రం దగ్గరకు తీసుకు వచ్చారు. అది ఒక ప్రత్యేకభవనం. దాని లోపల కాలయంత్రం ఉంది. బయటి సెక్యూరిటీగార్డు దానిని ఆపరేట్ చేస్తూ ఉంటాడు. భూగోళపు ఏ కాలంలో ప్రయాణించదలిచాడో, ఏఏ సంఘటనలు చూడదలిచాడో కిరణ్ ఆ కాలయంత్రంలోకి ప్రవేశించేముందు చెప్పాడు. సెక్యూరిటీ గార్డు ఆ వివరాలను కంప్యూటర్‌కి ఫీడ్ చేసాడు.

* * *

ఇప్పుడు కిరణ్ తానుకోరుకున్న ప్రకారం కాలయంత్రంలో తన సీటుపై కూర్చున్నాడు. పాలపుంత, నక్షత్రమండలం, భూగోళం, భారత దేశం, క్రీస్తు శకం 500... అతను కోరుకున్న

ప్రకారం యాత్ర ప్రారంభమయింది. వేదాలు వల్లెవేస్తున్న వారి దీక్షా దృశ్యాలు కదిలిపోయాయి. అతను యంత్రం మీద తన ఎదురుగా ఉన్న బటన్ నొక్కాడు. అక్కడ కంప్యూటర్ స్క్రీన్‌పై అక్షరాలు కాంతివంతంగా మెరుస్తున్నాయి. అది సంస్కృత శ్లోకం. కిరణ్ చదువుకున్నాడు. దాని భావార్థం ఇది:

"ఆ సమయంలో అక్కడంతా శూన్యం. అలా అని అది పూర్తి శూన్యం కాదు. అది అస్థిత్వము కాదు, అనస్థిత్వమూ కాదు. ఉండీ లేనితనం లేక ఉండిన విచిత్రతనం. అక్కడ గాలి లేదు, నీరు లేదు, మృత్యువు లేదు, అమరత్వం లేదు. రాత్రి స్పర్శ లేదు, పగటి వేడి స్పృహ లేదు. అంతా శూన్యాంధకారం. ఆవృత అంధకారం. అనావృత తిమిరం".

వేదకాలపు ఋషి చెప్పిన ఈ వర్ణన ఆధునిక ఖగోళవేత్తల బిగ్ బ్యాంగ్ పూర్వస్థితికి సాక్ష్యం అనుకున్నాడు కిరణ్. మరియొక బటన్ని 4, 5 సార్లు ప్రెస్ చేసి ఒక ఋక్ దగ్గర ఆగాడు.

ఆ ఋక్ ఇలా ఉంది.

"మధువాతా ఋతాయతే"

గాలులు, ఋతువులు మధురములు అగుగాక.

"మధుక్షరంతి సింధవః"

నదులు మధురములై ప్రవహించును గాక!

"మాధ్వీర్నః సన్త్వోషధీః"

ఔషధులు మధురములగుగాక.

ఇవి ఋగ్వేద ఋక్కులు. నేటి పర్యావరణ పరిరక్షణ సందేశవాహికలు అనిపించాయి కిరణ్‌కి. ఆనాటి ఋషి దూరదృష్టి అది.

కిరణ్‌కి అంతలోనే తాను భావుకత్వానికి గురవుతున్నానన్న స్పృహ కలిగి, హేతుదృష్టి వైపు ఆలోచన సడలించాడు. బటన్స్ నొక్కాడు. కాలయాత్రలో వెనుక ముందులకు పయనించాడు. ఆ గత చరిత్రలో ఎంత విధ్వంసం? ఎంత అనాగరికత? ఎంత నాగరిక హింస? అణుహోమ విధ్వంసం. విలయం, వికృతి, ఉన్మా దం, మానవ జాతిస్మృతిని ఆవరించాయో అవే ఈనాటి మానవ జాతి వెనుకబాటుతనానికి నిదర్శనం. అంతలోనే కిరణ్ స్పృహ కర్తవ్యాన్ని గుర్తు చేసింది. భూత, సమీప వర్తమాన కాల యాత్ర ముగించి ప్రస్తుత స్థితిలోకి తీసుకు వచ్చేయమని టెలిపతి భాషలో అతను సెక్యూరిటీ గార్డుకు వర్తమానం ఇచ్చాడు. ఆ గార్డు ఏంచేసాడో తెలియదు. సెకండు కన్నా తక్కువ కాలంలోనే కిరణ్ మనస్సు కుదుపుననుభవించింది. అతను తిరిగి ప్రస్తుత కాలంలోకి– "ప్రజ్ఞ" గ్రహ వాతావరణంలోకి యధాస్థితిలోకి వచ్చేసాడు.

* * *

క్రమంగా కొన్ని నెలలు ప్రశాంతంగా గడిచిపోయాయి. కిరణ్‌కి ఇచ్చిన గడువు సంవత్సరం పూర్తి కావస్తున్నది. అతడు "ప్రజ్ఞ గ్రహపు" గుణదోషాల గురించి అంచనా వేసుకున్నాడు. భూగోళానికి బాగా ఉపయోగించే అంశాల్ని బాగా గుర్తుపెట్టుకున్నాడు. చక్రవర్తి బృహస్పతి తన భార్య మేధ కోరిక ప్రకారం నిర్మించతలపెట్టిన ఆదర్శ మహల్ నిర్మాణం కాంట్రాక్టును భూగోళంలోని భారతీయ స్తపతులకు సాధించాడు. త్వరలోనే వారా పని ప్రారంభిస్తారు. కాలం గడిచిపోయింది. ఇంకో వారం పది రోజులలో కిరణ్ భూగోళానికి తిరుగు ప్రయాణం కావాలి. ఆ ఏర్పాట్లు జరుగుతున్నాయి.

ఈలోగా ఒక ఉపద్రవం తలెత్తింది. ఘోర నేరాలు చేసిన, కరుడు కట్టిన హింసావాది

డాక్టర్ నక్షా శిక్షల ఉపగ్రహం నుంచి పారిపో యాడు. ప్రత్యేక శీతల మందిరాలలో భద్రప రిచిన మేధావుల మస్తిష్కాలను వశపరచుకు న్నాడు. ఆ కంప్యూటర్ వ్యవస్థలన్నీ అతని ఆధీ నంలో ఉన్నాయి. అతడిప్పుడు ప్రమాదకరమైన మహాశక్తిశాలిగా పరిణమించాడు.

"ప్రజ్ఞ గ్రహాధిపత్య చిహ్నం అయిన బృహ స్పతి కిరీటాన్ని తనకు ఇచ్చి పట్టాభిషేకం చేస్తేనే తమ గ్రహాన్ని సురక్షితంగా ఉంచుతానని, లేకుం టే సర్వనాశనం చేస్తానని నక్షా హెచ్చరించాడు. గడుపు విధించాడు. అయితే ప్రాజ్ఞులు అందుకు సిద్ధంగా లేరు. రాజ్యాధిపత్యం మారడాన్ని, మా ర్చడాన్ని వారు వ్యతిరేకిస్తున్నారు. మరి మార్గాం తరం?

* * *

రాజ్యంలో తలెత్తిన సంక్షోభం గురించి డాక్టర్ బుధ, కిరణ్ ప్రత్యేక ఆంతరంగిక సమా వేశం జరిపారు.

"అతగాడి ఆటకట్టించే పథకం నా దగ్గర ఉంది"– కిరణ్ గంభీరంగా అన్నాడు.

"అతడికి ప్రాణాపాయం ఉండదు కదా! మీ భూగోళంపై వలె కాదు... ఇక్కడ ప్రాణహాని తల పెట్టడం పెద్ద నేరం. మా కట్టుబాటు మీకు తెలు సుకదా!" – డాక్టర్ బుధ మధ్యలో ఆత్రంగా అడిగాడు".

"మీ గోళపు రాజ్యాంగ విలువలు నాకు తెలుసు. మీ పాలనానియమాలను నేను గౌరవి స్తాను. ఇక్కడ నియమాలను ఉల్లంఘించను" కిరణ్ అభయమిస్తున్నట్లు అన్నాడు.

"మీ వ్యూహం ఏమిటి? – డాక్టర్ బుధ ఆరాతీస్తున్నట్లు అడిగాడు.

కిరణ్ క్షణకాలం కళ్ళు మూసుకున్నాడు. తాను కాలయాత్ర చేసిన ఆ అద్భుత యంత్ర విశేషాలు అతనికి గుర్తుకువచ్చాయి. అది పని చేసే కాలసూత్రమే ఇప్పుడు ప్రజ్ఞ గోళం పరి రక్షణకు తారకమంత్రం.

"సార్! నన్ను సందేహించకండి. మీ కాల యంత్రం ఇప్పుడు అతగాడి ఆట కట్టిస్తుంది. నా వ్యూహం అదే".

"అదే! ఎలా?" డాక్టర్ బుధ ప్రశ్నించాడు.

"ఆ కాలయంత్రంలో కాలరేణువుల మధ్య అతనిని వదిలివేస్తాము. అక్కడ లేనితనము లేదు, ఉన్నతనము లేదు. అక్కడంతా శూన్య వాతావరణమే. అంధకారం చుట్టుకున్న అంధ కారమే.

"అది సరే! అది అతడి అంతం ఎలా అవు తుంది? అతడి ఆట ఎలా కదుతుంది? వివరిం చండి" – డాక్టర్ బుధ కిరణ్ ప్రజ్ఞకు విస్తుపోతూ అడిగాడు.

"సార్! స్థల కాలాల మధ్య గల అనుబంధ

## బ్లాక్... బ్లాక్...!

'ఏంటిసార్... అన్నీ బ్లాక్‌లోనే అమ్ము తున్నారు! జనం చచ్చిపోతున్నారు సార్!' అని చెప్పాడు మంత్రిగారితో అతని సన్ని హితుడు!

'ఏం చేయమంటావయ్యా! నేను నా టిక్కెట్టు బ్లాకులో కొనుక్కున్నా! నా ఓట్లు బ్లాకులో కొనుక్కున్నా... తెలుసా?' అన్నాడు మంత్రి.



సూత్రాలకు లోబడిన గణితసూత్రాల ప్రకారం కాలయాత్ర చేయగలుగుతున్నాం. ఇది మీకూ తెలిసిన సంగతే. అయితే ఈ సూత్రాన్వయంలో భూగోళానికి, మీ గోళానికీ తేడా ఉంది. మా గోళంలో కాలయంత్రం బాణం వలె సూటిగా ముందుకుపోయే కాల సూత్రంపై ఆధారపడి పనిచేస్తుంది. మీగోళంలో అలాకాదు. ఇక్కడ మీరు కాలాన్ని పరమాణువుల సముదాయ సూత్రంగా పనిచేయిస్తున్నారు. ఈ కాల పర మాణువులు ఎటువంటి మార్పు లేకుండా ఒక స్థితిలో అస్థిత్వం కలిగి ఉంటాయి. ఇది ఈ సూత్రపు తాత్వికత. కాలయాత్రలో మనం గతంలోకి వెనక్కి ప్రయాణిస్తున్నప్పుడు ఒక భవనపు లిఫ్ట్‌లో క్రిందకు దిగుతున్నట్లు ప్రయా ణిస్తాం. ఈ దశతో రెండు కాల పరమాణువుల మధ్య ఒక మనిషి ఇరుక్కుపోయాడనుకుం దాం... అప్పుడేమవుతుంది? కాలం లేని చోట సంగతులేం ఉండవు. ఇది కామన్‌సెన్స్. గతి సూత్రాలు స్థంభించిన స్థితి ఇది. ఆలోచనలు కూడా ఆగిపోతాయి. మీకు నా వ్యూహం అర్థ మయిందనుకుంటాను. కాలయంత్రంలో ప్ర యాణించే నక్షా శూన్యకాలం వద్ద స్థంభించి పోతాడు. ఇది నిరంతర నానోకాలదశ. దానితో అతడు వెనక్కు రాలేదు, ముందుకుపోలేదు. ఆటకదుతుంది. ఇది ఒక స్థంభించిన చీకటి దశ" – కిరణ్ మాటలు డాక్టర్ బుధకు తెరపై దృశ్యంవలె కనిపించాయి. జరగబోయేదేమిటి?

* * *

అనుకున్న ప్రకారం చక్రవర్తి బృహస్పతి ప్రజ్ఞ గ్రహాధిపత్య రాజ మకుటాన్ని నక్షాకు ఇచ్చి వేస్తానని ఆహ్వానించాడు. అతడు చక్రవర్తి సూ చన ప్రకారం కాలయంత్ర భవనం వద్దకు అట్ట హాసంగా చేరుకున్నాడు. చక్రవర్తి బృహస్పతి అతడిని మాటలలోకి దింపాడు. ఎంతకూ అస లు విషయంలోకి రాకపోయేసరికి నక్షాకు సహనం నశించింది.

"ఈ గొడవంతా ఎందుకు? నాకు కిరీటం కావాలి. ఇవ్వండి" – నక్షా విసుగ్గా, కోపంగా వేగిరపరుస్తూ గద్దింపుగా అడిగాడు.

"ఔను కదూ! మరిచిపోయాను... మన భూగోళ అతిధి కిరణ్ దానిని తీసుకువెళ్ళాడు. అతడు కాలయంత్ర భవనంలో ఉన్నాడు. వెళ్ళి తెస్తాను. క్షణం ఓపిక పట్టు" అని బృహస్పతి వెళ్ళబోయాడు.

"వద్దు... నేనే వెళ్ళి తెచ్చుకుంటాను" అని నక్షా చక్రవర్తి జవాబుకు ఎదురుచూడకుండా వేగంగా అడుగులు వేసుకుంటూ కాల చక్ర భవనంలోకి ప్రవేశించి ముందుకుసాగాడు. అతని వెనకే ఆ ప్రవేశద్వారం మూసుకుంది. చక్రవర్తి బృహస్పతి బయటే ఉండిపోయి, సెక్యూరిటీ గార్డుకి ఏదో సంజ్ఞ చేసాడు.

మరుక్షణంలో అక్కడ ఏం జరిగిందో తెలి యలేదు. గాజు తలుపులోంచి లోపలకు చూస్తే అక్కడ కాలయంత్రం ఖాళీగా ఉంది. ఏం లేదు. ఎవరూ లేరు. నక్షా కనిపించలేదు. అంతా ఘనీ భవించిన చీకటి.

* * *

ఆ తరువాత కిరణ్‌కి సకల రాజ్యాంగ మర్యాదలతో ప్రజ్ఞ గ్రహపు గౌరవ పౌరసత్వం ఇవ్వబడింది. నక్షత్ర లోకాంతర రోదసీ విమాన నిర్మాణ సాంకేతిక పరిజ్ఞానాన్ని, కాలుష్య ప్రమా దం లేని కృత్రిమ ఉపగ్రహ సేద్య సాంకేతిక పరిజ్ఞానాన్నీ భూగోళానికి అందజేసారు.

భూగోళవాసులు మాత్రం "మానవుడే మహ నీయుడు... కాలాంతకుడు..." అని కిరణ్‌ని కీర్తిస్తూనే ఉన్నారు. 

# కష్టైక్యం బాగొంది

ఆ ఉత్తరం రాకపోయి ఉంటే మా ఇద్దరిలో ఏకాభిప్రాయం అనేది ఎప్పటికీ ఉండేది కాదేమో! మా జాతకాలు దివ్యంగా కలిసాయన్న మహానుభావుడెవరో మా పెళ్ళికి గ్రీన్ సిగ్నల్ ఇచ్చాడు. జాతకాలు కలవడం తప్ప మా ఇద్దరి బుర్రలూ ఏనాడూ కలవలేదు.

నేను ఎడ్డెం అంటే ఆమె తెడ్డెం అనేది. నానా గడ్డీ కరిచి కొంపలో అన్నీ అమరుస్తున్నా తన పుట్టిల్లే స్వర్గం అంటుంది. వాళ్ళమ్మ మిస్ వరల్డ్ అయితే ఈవిడగారు మిస్ యూనివర్సట. పనీపాటా లేక అడ్డగాడిదలా తిరిగే తమ్ముడు మహాబుద్ధిమంతుడు, బ్రతకనేర్చినవాడట. వంట కూడా ఇప్పటికీ వాళ్ళమ్మనడిగే చేస్తుంది. వారానికో సారి ఫోన్‌చేసి, ఆ వారంలో వండాల్సిన వంటల లిస్ట్ వాళ్ళమ్మనడిగి తెలుసుకుంటుంది. ఆవిడ చెబుతుంది, ఈవిడ చేస్తుంది. అంతే... ఎలా ఉన్నా తినకతప్పదు.




మా ఇద్దరికీ అసలు పడకపోవడమనేది పరోక్షంగా దేశానికి ఎంతో తోడ్పడింది. మాకు తెలియకుండానే నిర్బంధ కుటుంబ నియంత్రణ పాటిస్తూ జనాభా పెరగ

వై.కె. మూర్తి

కుండా చూస్తున్నాం. కొడుకు కావాలని నేను, కూతుర్ని కనాలని మా ఆవిడా పోట్లాడుకుని, నెలల తరబడి మాట్లాడుకునే వాళ్ళం కాదు. నా మాటగెలవనీయలేదు కనుక విజయం తనదేనని గర్వపడేది. అసలు వాళ్ళ కొంపలో కూడా వాళ్ళమ్మదే గెలుపని ఊరంతా చెప్పు కునేవాళ్ళు. అలాంటిది ఒక ఉత్తరం మా ఇద్దరి మధ్యా ఏకాభిప్రాయం కుదిర్చింది.

ఆ ఉత్తరం రాసింది మా నాన్న పిన్ని కొడు కు మేనత్త తాతగారు. ఆయన మరోవైపు నుంచి నా భార్య మేనత్త కొడుకు చినమామగారి బావ మరిది పెదతండ్రి మామగారు. నా అడ్రస్ ఆ శాల్తీకి ఎలా దొరికిందోగానీ ఉత్తరం రాసిపారే సాడు. తాను కుటుంబ సమేతంగా విజయవాడ వస్తున్నట్టు, ఓ వారం రోజులుండి మా ముచ్చ టైన సంసారాన్ని కళ్ళారా చూసి తరించను న్నట్టూ రాసాడు.

అది చదివి, గుండె బేజారై ఉత్తరం మా ఆవిడ చేతిలో పెట్టా. ఒక్కక్షణంపాటు నా మీద విజయం సాధించే ఉద్దేశ్యంతో ఆనందం కన బరిచినా రెండో క్షణంలో మాత్రం ఆవిడగారి ముఖం మాడినమసిబొగ్గు అయింది. ఆయన తో పాటు వచ్చే పటాలానికి వండి వార్చేసరికి నడుములు పడిపోతాయన్న సంగతి అర్థమై తిట్లు లంకించుకుంది. ఆ దిక్కుమాలిన మాయ దారి సంతకి మా ఇల్లే దొరకాలా అని వాపో యింది. రాబోయే ముప్పును ఎలా ఎదుర్కో వాలా అన్న చింత మా ఇద్దర్నీ ఒకటి చేసింది. నా బుర్రకు ఏ ఉపాయం తోచలేదు. నానా తర్జనభర్జనలూ పడి మొత్తానికి ఓ ఉపాయం కనిపెట్టాం. జీవితంలో మొట్టమొదటిసారిగా మా ఆవిడ తెలివిగా మాట్లాడింది.

'వాళ్ళు ఇంట్లోకి వచ్చిన గంటలోనే మని ద్దరం గొడవపడదాం. మీరు నన్ను చాచిలెంప కాయ కొట్టండి' అంది. నేను మనసులోనే ఆనందపడ్డాను. జీవితంలో మొట్టమొదటి సారిగా మా ఆవిడ చెంప చెళ్ళుమనిపించే అవ కాశం దక్కుతోంది.

'అప్పుడు నేనేం చేస్తానంటే కోపం వచ్చి మా పుట్టింటికి వెళ్ళిపోతానన్నమాట. మీరు నన్ను బ్రతిమలాడుతూ నా వెనకవస్తారు. దాం తో దిక్కుతోచక వాళ్ళు వెళ్ళిపోతారు' అంది.

మరనాడు ఉదయమే ఆ పటాలం మొత్తం మా ఇంట్లో దిగిపోయింది. ఆ పటాలంలోని పిల్లమూక కుర్చీలపై, సోఫాలపై, కిటికీలపై ఎక్కేస్తున్నారు. ఒకరిద్దరు నా చుట్టూ చేరి కథక్ డాన్స్ ప్రాక్టీస్ చేస్తున్నారు.

మా నాటకం ఎప్పుడు మొదలవుతుందా, ఎప్పుడు వీళ్ళ పీడవిరగడవుతుందా అని ఎదు రుచూస్తూ కూర్చున్నాను. మా ఆవిడ వచ్చిన వాళ్లకు కాఫీలు ఇచ్చింది. నాకూ కప్పు అంది స్తూ కావాలనే కప్పు జారవిడిచింది. నా ఫాంటు మీద మోడర్న్ ఆర్ట్‌లా పెద్ద మరక పడింది. అయినా నేను నోరు మూసుకున్నాను. కింద పడిపగిలిపోయిన కప్పు ఎత్తుతూ మా ఆవిడ నాకేసి చూసి కన్ను గీటింది. అదేం సిగ్నలో నాకు అర్థంకాలేదు. మా ఆవిడ ఇక నాటకం తానే మొదలుపెట్టింది.

'ఓవైపు ఇంట్లో చుట్టాలందరూ వస్తే కాళ్ళు అడ్డం పెట్టుకుని కూర్చుంటారేం' అని అరి చింది.

'మరెలా కూర్చోమంటావ్ నువ్వే చెప్పు' అన్నాను పెద్దగా.

'ఎందుకలా నోరుపారేసుకుంటారు? ఎవ

బొద్దింక తల పోయినా
అది కొన్ని వారాలు బ్రతికే ఉంటుంది

రైనా వచ్చినప్పుడు నెమ్మదిగా మాట్లాడమని చెప్పానా! మీకే ఉందికదాని పెద్ద గొంతేసుకుని అరుస్తారేం?' అని అరిచింది. నా బుర్రలో అప్పుడు లైటు వెలిగింది. 'అరవొద్దు అంటూ నువ్వు అరుస్తావేం బుద్ధుందా నీకు?'

'అసలు బుద్ధి మీకుందా అని అడుగుతు న్నాను. పోయి పోయి బుద్ధిలేనివాడికి మా నాన్న నన్ను కట్టబెట్టాడు'.

'అసలు మీవాళ్ళకు బుద్ధుందా అని అడుగు తున్నాను. వాళ్ళకు బుద్ధుంటే నీకు బుద్ధి చెప్పే వాళ్ళు'.

'మా వాళ్ళ గురించి మాటజారితే మర్యాద దక్కదు జాగ్రత్త'.

'ఏం చేస్తావేం – కొడతావా? చుట్టాలున్నా కూడా కొడతావా?' కోపంతో రెచ్చిపోయాను.

'కొడతానో నరుకుతానో నాకే తెలియదు. కోపం వస్తే నేను కాళికను. జాగ్రత్త!'

'నేనూ అంతే... కోపం వస్తే రుద్రతాండ వం చేస్తా, ఖబడ్దార్!'

'మీ బోడి పర్సనాలిటీకి అంత పౌరుషం కూడానా? నన్ను కొట్టే దమ్ముందా?'

'ఏయ్' అని అరుస్తూ చెయ్యెత్తాను. కానీ కొట్టేందుకు ధైర్యం చాలలేదు. మా ఆవిడ కన్ను కొట్టింది. అంతే... ధైర్యం తెచ్చుకుని కళ్ళు మూసు కుని ఆమె చెంప చెళ్ళుమనిపించాను.

అంతే... ఆమడ దూరం వినిపించేలా పెద్ద గొంతేసుకుని భోరున ఏడవడం మొదలు పెట్టింది. రెండు చేతులతో గుండెలు బాదు కుంటూ ఏడ్చింది.

'ఇంత అవమానం జరిగాక నేనుండను. మా పుట్టింటికి వెళ్ళిపోతా' అంది రాగాలు తీస్తూ.

'పో... ఇప్పుడే పో... ఒక్క క్షణం ఉండాల్సిన అవసరం లేదు' అన్నాను అరుస్తూ.

'పోతా... ఇప్పుడేపోతా? మీరు బ్రతిమలా డినా ఉండను' అంది ముక్కుచీదుతూ. రయ్యిన బెడ్రూంలోకి వెళ్ళిపోయి, బట్టలు సర్దుకోవడం మొదలు పెట్టింది.

మా ప్లాన్ సక్సెస్ అవుతున్న సూచనలు కనిపించాయి. చుట్టాలందరూ వెర్రిముఖాలు వేసుకుని మాకేసి చూస్తున్నారు. నాటకాన్ని మరింత రక్తి కట్టించాలని బెడ్రూంవైపు దూసు కుపోయాను.

'ఏమనుకుంటున్నావే... నువ్వు లేకపోతే బతకలేననుకుంటున్నావా? అంత పొగరా? తక్షణమే నా కొంపలోంచి వెళ్ళిపో... అని అరి చాను. మా ఆవిడ సూట్‌కేస్‌తో బయటికి వస్తూంటే పటాలంలోని ఆడవాళ్ళు ఆమెను అడ్డుకున్నారు.

అంతే... పటాలంలోని ఒక పెద్దాయన, మరొక పెద్దావిడ మమ్మల్ని కూర్చోబెట్టి బ్రెయిన్ వాష్ చేయడం మొదలుపెట్టారు. నేను ససేమి రా అన్నాను. మా ఆవిడా ససేమిరా అంది.

'ఇలా లాభం లేదు. వీళ్ళిద్దరికీ రాజీ కుదిరే వరకూ మనం ఈ ఇల్లు వదిలి వెళ్ళే ప్రసక్తే లేదు. ఇలా గొడవలు పడుతూంటే చూస్తూ ఊరుకుంటామా?' అన్నాడు పెద్దాయన.

'చూడబ్బాయ్, మీరిద్దరూ చిలకాగోరింకల్లా కలిసిపోవాలి. అంతవరకూ మేము ఊరికి తిరిగి వెళ్ళేదే లేదు" అంది పెద్దావిడలోనికి వెళ్తూ.

దబ్బున పెద్ద శబ్దం వినిపించి బెడ్రూంలోకి పరిగెత్తాను. మా ఆవిడ కళ్ళు తిరిగి పడి పోయింది. ●

# బొమ్మలపెళ్ళి




సాయంత్రం ఆరు అవుతోంది.

వరండాలో ఈజీ చైర్లో కూర్చుని పేపరు చదువుతున్నా. ఒక చివర మా మనుమరాలు అమూల్య, ఇరుగు పొరుగు పిల్లలూ కలిసి ఆడుకుంటున్నారు. అందరిలోకీ మా మనుమరాలి గొంతుకే గట్టిగా వినబడుతోంది. స్థాన బలం కదా మరి! అందుకేనేమో డామినేట్ చేస్తోందనుకుంటా.

ఏమ్రా! మగపెళ్ళివారు వచ్చే టైమయింది. వాళ్ళని మర్యాద చేయాలి. కోపం రాకుండా చూడాలి... మిగిలిన వాళ్ళు తలవూపారు.

ఇంతలో వరండా ఈ చివరనుంచి ఒక మగ, ఇద్దరు ఆడ పిల్లలు ఒక పిల్లవాడి బొమ్మని పట్టుకొని హుందాగా వచ్చారు.

ఆ! అదిగో మగపెళ్ళివారు వచ్చేసారు రండి... రండి.

అమూల్య నా దగ్గరకు వచ్చి, తాతగారూ! మీరు కుర్చీని ఆ చివరకి జరుపుకోండి. ఇక్కడ మగపెళ్ళి వారు కూర్చోవాలి అంది.

నాకు ముచ్చటేసి అలాగే అమూల్యా అని బుగ్గ మీద ముద్దు పెట్టుకొని, కుర్చీని వరండా చివరకు జరిపి కూర్చున్నా.

ఇక మొదలయింది సందడి. ఒకటే హడావిడి.

ఒరే నానిగా... నువ్వు పురోహితుడివి. పెళ్ళి చేయించాలి. తెలుసా ఎలా చేయించాలో?

ఓ! అలాగే. మరి... జీలకర్ర, బెల్లం ముక్కా ఉందా?

అదిగో పళ్ళెంలో ఉంది అది తినకూడదు రోయ్.

ఏమర్రా! తలంబ్రాలు బియ్యం ఉన్నాయా?

ఎవరి మట్టుకు వాళ్ళు తెగ హడావిడి పడి పోతున్నారు.

పేపరు పక్కన పెట్టి కుతూహలంగా చూస్తున్నా.

కొబ్బరిబూరాలతో సన్నాయి మోగింది.

హుషారుగా పెళ్ళి చేసేసారు.

మధ్య మధ్య అలకలు, కసురుకోడాలు... అబ్బే ఉత్తుత్తి కసురుకోడమేలే ఆటలో అరటి పండు అని ఒకళ్ళూ, కట్నం ఇస్తామని ఎగ్గొట్టారేమిటీ అని ఒక అబ్బాయి...

ఆ ఇదిగో కట్నం లక్షరూపాయలూ అని వాడిచేతిలో ఓ కాగితం పెట్టింది అమూల్య.

మరి పిల్లకు నగలో? అని అడిగింది పెద్ద ఆరిందాలా.

నగలా? కంసాలికిచ్చాం చేయమని ఇవ్వ గానే ఇస్తాం అని సమాధానం.

# కాలనాధభట్ట వీరభద్రశాస్త్రి

బాగుంది సంబడం... అని మూతి వంకర్లు తిప్పారు అమూల్యా వాళ్ళు.

మొత్తానికి పెళ్లి అయింది – అప్పగింతలు అయ్యాయి.

మా అమూల్య ముక్కు చీదుకుంటూ దొంగ ఏడుపు ఏడుస్తూ అప్పగింతలు కార్యక్రమం పూర్తి చేసింది.

ఇక రండర్రా! విందు భోజనం చేద్దాం అని పిల్లల్ని వరసగా కూర్చోబెట్టి మరమరాలు, శనగపప్పు, బెల్లం ముక్కలు కాగితం ప్లేట్లలో పెట్టి అందరికీ పంచి పెట్టింది.

ఓ కాగితం ప్లేటు నా దగ్గరకు తెచ్చి తాత గారూ ఇదిగో మా అమ్మాయి పెళ్ళి విందు అని ఇచ్చింది.

ఇంతలో మా ఆవిడ వచ్చింది చేత్తో పెద్ద లడ్డు పుచ్చుకొని. ఏమే అమూల్యా నాకు పెట్ట వేమిటే విందుభోజనం? అని అడిగింది.

అయ్యో మాయమ్మ! పెద్ద ముత్తయిదువు... నీకు పెట్టకుండానా? అని ఒక ప్లేటు వాళ్ళ మామ్మకి ఇచ్చింది.

అది సరే... ఇదిగో పక్కింటి నీలకంఠం తాతగారు తిరుపతి కళ్యాణం లడ్డు ఇచ్చారు పిల్లలకు పెట్టు అని ఇచ్చింది.

ఇదిగోనర్రా! తిరుపతిలో ఇంకో పెళ్ళి అయిందట అని తలోముక్కా చిదిమి పెట్టింది.

నా మనోనేత్రంలో తిరుపతి కళ్యాణం, ఇక్కడ పిల్లల బొమ్మల పెళ్ళి ఒకదాని పక్క మరొకటి సమానాంతర రేఖలో కనపడ్డాయి.

ఏడు కొండలవాడా... వెంకటరమణా... గోవిందా! గోవిందా!! ●

# మాటే మంత్రం

సాయంత్రం 4-30 అయింది. లాన్‌లో కూర్చున్న సీతమ్మగారు, రామయ్యగారూ వీధి గేటు వైపు దృష్టి సారించారు. పని అబ్బాయి మొక్కలకి పాదులు చేస్తూ కలుపు మొక్కలు పీకుతున్నాడు.

రామయ్యగారు గవర్నమెంట్ ఎంప్లాయి. రిటైర్ అయ్యారు. భార్యాభర్తలు ఇద్దరూ ఉన్నత భావాలతో నలుగురికీ తమ చేతనయిన సహా



యం చేస్తూ నలుగురిలో మంచి వ్యక్తులు అని పించుకున్నారు. కొడుకు, కోడలూ డాక్టర్లు. 8 సంవత్సరాల హరీష్ ముద్దుల మనుమడు. సీతమ్మగారి అభిరుచి మేరకు లాన్ ఎప్పుడూ పచ్చగా కళకళలాడుతూ, కంటికి ఆహ్లాదంగా రంగురంగుల గులాబీలతో చూపు మరల్చకుం డా చూసేలా ఉంటుంది. వీధిలో ఆటో ఆగిన చప్పుడయింది. మరుక్షణం గేటు తీసుకొని హరీష్ పరిగెత్తుకుని వచ్చి స్కూలు బ్యాగ్, లంచ్ బాక్స్, షూ విప్పేసి అటూ ఇటూ విసిరేసి, నాన్నమ్మ వీపు మీద చేతులు వేసి ఉయ్యాల ఊగుతూ, తాతయ్యా మీకో గుడ్‌న్యూస్... మా క్లాస్‌లో మా మిస్ ఈ రోజు లెసన్స్ వద్దుగానీ, మీరందరూ మంచి ప్రవర్తన, మంచి మాట లు అంటే ఎలా ఉంటాయో చిన్న స్పీచ్‌లా... ధైర్యంగా చెప్పాలి అంది. ఆ కాంపిటీషన్‌లో నేను ఫస్ట్ వచ్చాను. మా మిస్ ఎంత మెచ్చు కుందో తెలుసా? అంటూ నాన్నమ్మ బుగ్గ మీద కిస్ చేసాడు. అలాగా... అంటూనే రా... హరీష్ అంటూ దగ్గరకి తీసుకున్నారు.

ఫ్రెండ్స్‌తో మాట్లాడడం, ఎవరినీ తిట్ట కుండా అందరితో మంచిగా ఉండడం, బాగా మాట్లడడం అంటూ అందరూ రకరకాలుగా చెప్పారు.

నేను ఏమి చెప్పానో తెలుసా? ఉదయం నిద్రలేవగానే ముందు భూమికి నమస్కరించి, తరువాత భగవంతునికి సమస్కారం చేసి, మన అరచేతుల్ని చూసి కరాగ్రేవసతే లక్ష్మి, కరమధ్యే సరస్వతి, కరమూలే స్థితాగౌరి, ప్రభాతేకర దర్శనము అని శ్లోకం చదవాలి. ఇంట్లో ప్రతి ఒక్కరినీ గుడ్‌మార్నింగ్ అంటూ విష్ చేయడం, చదువుకోవడం, ఆపదలో ఉన్నవారిని ఆదుకో వడం, మూగజీవులు, పశుపక్ష్యాదుల పట్ల ఆద రంగా ఉండడం, తోటి వారికి సహాయం, వికలాంగుల పట్ల ఆదరణ, ఆకలితో ఉన్నవారి ఆకలి తీర్చడం, అనాధల పట్ల ప్రేమతో మాట్లా డడం, ఓదార్పుగా మాట్లాడడం, మాటల్లో మృ దుత్వం, లాలన, చెదరని చిరునవ్వుతో, ఆత్మ స్థయిర్యంతో - చేసే పనిపట్ల అంకిత భావం, తల్లిదండ్రులను గౌరవించడం, పెద్దల పట్ల విన యంగా ప్రవర్తించడం, గురువుని పూజించడం మొదలైనవి అని చెప్పాను.

ముందుగా మా మిస్ క్లాప్స్ కొట్టి, అందరి తో ఆపకుండా క్లాప్స్ కొట్టించింది తెలుసా... అంటూ తాతయ్య మీసాలు నిమురుతున్న మనుమడికి షేక్‌హాండ్ ఇచ్చి, గుడ్‌బాయ్... అని మెచ్చుకున్నాడు.

నాకు ఇవి అన్నీ మా నాన్నమ్మ నేర్పింది అని మా మిస్‌కి చెప్పాను అంటూ గర్వంగా నాన్నమ్మ వైపు చూసాడు ముద్దుల మనవడు. నాన్నమ్మ నవ్వుతోందిగానీ, కళ్ళు మాత్రం హరీష్ విసిరేసిన బ్యాగ్ మీద ఉన్నాయి.

అమ్మో... నాన్నమ్మ ఎన్నిసార్లు చెప్పింది? దేనినీ విసరకూడదు అని, ప్రతి వస్తువుకీ ప్రాణం ఉంటుంది అనీ... ఆనందంతో విసిరే సాను అని నాన్నమ్మకి సారీ చెప్పి, చకచకా లంచ్ బాక్స్, బ్యాగ్, షూ అన్నీ ఒక ప్రక్కన సర్ది పెట్టాడు. అప్పుడు అంది నాన్నమ్మ... హరీష్ చాలా మంచి బాలుడు... అని.

హరీష్ స్నానం చేసి, డ్రస్ చేసుకుని వచ్చే సరికి నాన్నమ్మ బత్తాయి రసం గ్లాసుతో రడీగా ఉంది. నాన్నమ్మ ఇచ్చిన జ్యూస్ తాగి, గ్లాస్ నెమ్మదిగా టేబుల్ మీద పెట్టి, నాన్నమ్మ దగ్గర చేరాడు. నాన్నమ్మా ఏ వస్తువునీ విసరకూడదు అంటావు కదా! విసిరితే ఏమవుతుంది? దానికి

నొప్పి తెలీదు కదా? దానికి ప్రాణం ఉంది అంటావేమిటి? చెప్పు నాన్నమ్మా అంటు గారాలుపోయాడు.

అది కాదురా బాబూ... వాటికి నొప్పి లేకపోయినా, ప్రాణం ఉండే వస్తువు రా అది కూడా! నీ స్కూల్ బ్యాగ్ చూడు... బుక్స్ పెట్టడానికి ఉపయోగిస్తుంది కదా? అలా ఉపయోగించటమే దాని ప్రాణం. బుక్స్ అంటే సరస్వతి సరస్వతిని అవమానించినట్లు కాదా బుక్స్ విసిరితే? నేను బుక్స్ పెట్టుకోవడానికి ఉపయోగపడ్తుంటే నన్ను విసిరేసాడు అని బ్యాగ్ అనుకుంటుంది. అందుకని ఏదీ విసరకూడదు. చెట్లు చూడు... గిల్లితే పాలు కారుతాయి. కొన్ని చెట్లకి జిగురు పదార్థం వస్తుంది. నిన్ను గిల్లితే ఏడుస్తావు... అవి తమ బాధని పైకి చెప్పలేవు. అవునా, కాదా? అంది.

ఇంతలో కారు హారన్ వినిపించడం, గేటు తియ్యడంతో రయ్యిన కారు లోపలికి వచ్చింది. మమ్మీ... డాడీ... అంటూ పరిగెత్తాడు.

స్కూల్ నుంచి వచ్చేసావా హరీ? అంటూ సుధ కొడుకుని దగ్గరకి తీసుకుంది. మమ్మీ... మమ్మీ... ఈ రోజు స్కూలులో... అంటుండగానే సుధా నీకు ఎన్నిసార్లు చెప్పాలి? హాస్పటల్ నుంచి రాగానే కబుర్లు మొదలుపెట్టవద్దన్నానా? అంటూ హుకుం జారీచేసిన తండ్రిని చూసి, గబగబా స్కూల్ బ్యాగ్ తీసాడు. తండ్రి డిసిప్లిన్ గురించి బాగా తెలుసు హరికి, ఇంట్లో అందరికీ.

సుధ, రవి ఫ్రెషప్ అయి లాన్‌లో కూర్చున్న వారి దగ్గరకి వచ్చారు. హరీష్ మమ్మీకి, డాడీకి స్కూల్‌లో జరిగిన కాంపిటీషన్ గురించి చెప్పాడు. వెరీగుడ్‌రా కన్నా! నీకు చిన్నప్పటి నుంచీ తల్లి, గురువు, దైవం అన్నీ మీ నాన్నమ్మ. నాన్నమ్మ మాటలు నీకు, మాకూ వేదమంత్రాలు. ఇలానే నీవు అన్నిట్లోనూ ఫస్ట్ రావాలి అంటూ అత్తగారిని, మామగారినీ గౌరవంగా చూసి, తనయుడిని దీవించింది.

కాలం వేగంగా పరిగెత్తింది. హరి మెడిసిన్‌లోకి వచ్చాడు. నాన్నమ్మ మాటలు తూచ తప్పకుండా పాటిస్తూ, చదువులోనే కాదు... ఆటపాటల్లో... అన్నిరంగాలలో ముందున్నాడు. రవి, సుధ డాక్టర్లుగా మంచి పేరు ప్రఖ్యాతులు తెచ్చుకున్నారు. సీతమ్మ, రామయ్యగార్లు వృద్ధాప్యంలో తమకు వీలయినంత వరకూ ఇతరులకు సాయం చేస్తూ, ప్రతినెలా పెన్షన్ రాగానే మనుమడిని తీసుకొని అనాథాశ్రమాలకి, వృద్ధాశ్రమాలకీ వెళ్లి పండ్లు, స్వీట్లు పంచి రావడం, ఆధ్యాత్మిక కార్యక్రమాలకి హాజరవుతూ దైవచింతనతో, కొడుకు, కోడలు, మనుమడి ఆత్మీయతానురాగాలతో ఆనందంగా ఉంటూ చుట్టూ ఉన్నవారిని ఆనందింపజేస్తున్నారు.

కాలం పరిగెడుతూనే ఉంది. రామయ్యగారు నిద్రలోనే కాలం చేసి, తెల్లవారేసరికి అప్తులని, సీతమ్మనీ తీరని ఆవేదనకి గురి చేసారు. కొడుకు, మనుమడు సీతమ్మని అక్కున చేర్చుకొని ఓదార్చారు. కొడుకు, కోడలూ రామయ్యగారి అంత్యక్రియలు ఘనంగా జరిపించారు. అన్నదానం, వస్త్రదానం, గోదానం, భూదానం... అన్ని దానాలూ చేసి నలుగురిలో కొడుకు అంటే ఇలా ఉండాలి... అనిపించుకున్నారు.

హరీష్ నాన్నమ్మని శ్రద్ధగా గమనిస్తూ, దిగులు పడకుండా ఉండడానికి తన శాయశక్తులా కృషి చేస్తున్నాడు. సీతమ్మగారిని తీసుకొని అందరూ కాశీ బయలుదేరారు. రామయ్యగారి అస్థికలు నిమజ్జనం చేయడానికి.

కాశీలో గంగ వద్ద అక్కడి కలుషిత వాతా

వరణాన్ని చూసిన రవి ఆ అపరిశుభ్రతతో ఉన్న నదిలో దిగవద్దు అంటాడు. భర్త సంగతి తెలిసి సుధ నిశ్శబ్ధంగా ఉండిపోయింది. అలా బ్రాహ్మడికి ఇచ్చి కలపడం సుధకి ఇష్టం లేదు. మీరే మీ నాన్నగారి అస్థికలు నిమజ్జనం చేయాలి అని చెప్పాలని ఉంది. కానీ భర్త డిసిప్లిన్ నోరు తెరువనివ్వలేదు.

సీతమ్మగారు తప్పు బాబూ... గంగని ఎంచ కూడదు. గంగా నది ఎంతోమంది పాపులను తనలో ప్రక్షాళనం చేసుకొని, తిరిగి మనకి జీవ నదిగా ప్రవహిస్తుంది. ఎంత కలుషితం చేసినా గంగానది పవిత్రమైనది. పడవలో నదీ గర్భానికి వెళ్ళి, అక్కడ మీ నాన్నగారి అస్థికలను నెమ్మదిగా నిమజ్జనం చేయాలి... అంటూ కొడుకుతో పడవ మీద నది మధ్యకి వెళ్ళి, నెమ్మదిగా అస్థికల పాత్రని వదలమంది. మీ నాన్నగారికి నీవు చేసే ఈ పని ఆయనని పుణ్యలోకాలకి చేరుస్తుంది అంటూ నమస్కారం చేసుకొని వచ్చి, ఒడ్డున పూజా కార్యక్రమాలను పూర్తి చేసుకొని విశ్వేశ్వరుని దర్శించుకుని వచ్చారు. దారి పొడవునా తన ప్రశ్నలతో నాన్నమ్మ దిగులుని మరిపిస్తూ తనకి తెలియని క్రొత్త విషయాలు ఎన్నో తెలుసుకున్నాడు హరి.

నాన్నమ్మా... నదీ గర్భంలోనే ఎందుకు కలపాలి అస్థికలని? అన్న ప్రశ్నకి నాన్నమ్మ ఇచ్చిన వివరణ విన్న తరువాత సాంప్రదాయం, పద్ధతుల పట్ల ఆమెకున్న విశ్వాసం, విజ్ఞానానికి; వాటికి ఆచరించే ఆమె నమ్మకానికీ జోహర్లు అర్పించారు సుధ, హరీష్.

మనం తల్లి గర్భంలో ఎలా జన్మిస్తామో, మనకి జీవించటానికి ఉపయోగించే ప్రతి వస్తువూ భూమి మనకి ఇస్తుంది. నీటిని తన గర్భంలోంచి మనకు ప్రసాదిస్తుంది. భూమి

### హెల్మెట్

నాన్నా... నాకు కూడా హెల్మెట్ కొను... గారాలుపోయాడు రెండో తరగతి చదువుతున్న కొడుకు.

నీకెందుకురా...? ప్రశ్నించాడు తండ్రి ఆశ్చర్యంగా.

మరేమో... మా క్లాస్ టీచర్ అస్తమానూ మొట్టికాయలు వేస్తున్నారు... అందుకు... సమాధానమిచ్చాడు కొడుకు.

మీద పంటలు పండిస్తాం. ఖనిజ లవణాలను భూమిలోంచి తీస్తాం. భూమి మీద చెట్లు మనకి కలప, ప్రాణ వాయువు, పూలు, పండ్లూ అందిస్తున్నాయి. చెట్లు, చేమలు అన్నీ భూమి మీద పండిస్తాం. భూమి, నీరు మనకి జీవితాన్ని ప్రసాదిస్తున్నాయి. పంచభూతాల సాక్షిగా మనం జీవిస్తున్నాం.

పంచభూతాలు అంటే ఏమిటి నాన్నమ్మా?

నింగి, నేల, నీరు, అగ్ని, వాయువు... ఇవి అన్నీ మానవుల మనుగడని క్రమపద్ధతిలో నడిపించే ప్రత్యక్ష దైవాలు. మానవులు చేసే పాపాలను భూమి భరిస్తుంది. పాపులను జీవనదులు ప్రక్షాళనం చేస్తున్నాయి. నదీ స్నానం పాపులను పరిహారం చేస్తుంది. అందుకని గంగని ఎంచ కూడదు. ఉదయం లేవగానే మనం భూమికి భూస్తుతి ఎందుకు చేస్తాం? "సముద్రవసనేదేవి పర్వతస్తనమండలే! విష్ణుపత్ని నమస్తుభ్యం, పాదస్పర్శం క్షమస్వమే॥" సముద్రములే వస్త్రములుగా కలిగి, పర్వతములే పాలిండ్లుగా కలిగి, లోకపాలకుడగు విష్ణుమూర్తి యొక్క పత్ని అయిన ఓ భూమాతా! నీకు నమస్కారం. నా పాదములను మోపుచున్నాను. క్షమించు... అని ప్రార్థించాలి. పంచభూతాల సాక్షిగా మనం చేసే

ప్రతి పనీ సక్రమంగా చేయాలి.

అందుకని మీ తాతగారి అస్థికలను నదీ గర్భంలో కలిపాం. నదీమ తల్లి తనతో బాటు భూమిలో కలుపుతుంది. మన ప్రతి చర్యా మంచిని పెంచేదిగా ఉండాలిరా బాబూ... అంది. అన్నీ వివరంగా చెప్పిన నాన్నమ్మ వైపు "ఆరాధన"గా చూసాడు హరీష్.

మా నాన్నమ్మ విజ్ఞాన ఖని. ఇంత మంచి నాన్నమ్మతో నేను చాలా ఆత్మీయంగా, ప్రేమానురాగాలు పంచుకోవాలి. నేను చాలా అదృష్టవంతుడిని అనుకొన్నాడు హరీష్.

రోజులు వారాలుగా, వారాలు నెలలుగా, నెలలు సంవత్సరాలుగా మారుతున్నాయి. కాలం పరుగులు తీస్తూనే ఉంది. తరాలు, అంతరాలు మారుతూనే ఉన్నాయి. హరీష్ మంచి డాక్టరుగా పేరు సంపాదించుకున్నాడు. నాన్నమ్మ, తాతయ్య పేర్ల మీద సూపర్ స్పెషాలిటీని రన్ చేస్తున్నాడు. అందులో బీదలందరికీ ఉచిత వైద్యం. హరీష్ రోగులందరికీ దేవుడితో సమానం.

సుధ ఎప్పుడూ అత్తయ్య వల్లనే మా హరీష్ ఇంతవాడయ్యాడు అంటూ గర్వంగా చెబుతుంది. కాలంతో నడవలేక సీతమ్మగారు తిరుగుతూ, తిరుగుతూనే ఎటువంటి అనారోగ్యం లేకుండా కోడలి చేతిలో కన్నుమూసారు. తన అవశేషాలని బాల్యంలో పెరిగిన విజయవాడలోని కృష్ణానదిలో నిమజ్జనం చేయమని ముందుగానే కోరిందావిడ.

హరీష్ చాలా దిగులు చెందాడు నాన్నమ్మ గురించి. నాన్నమ్మ జ్ఞాపకాలను గుర్తు చేస్తూ సుధ హరీష్‌ని మాములుగా చేయడానికి ప్రయత్నించింది. ఎన్ని అనునయ వాక్యాలు విన్నా నాన్నమ్మ ఎడబాటు హరీష్‌ని చాలా బాధించింది.

నాన్నమ్మ కోరిక ప్రకారం విజయవాడ వచ్చారు. హరీష్ చాలా అపురూపంగా కృష్ణానదిని చూస్తున్నాడు. హరీష్ మదిలో నాన్నమ్మ తన చిన్నతనంలో అమ్మ చెయ్యి పట్టుకొని కృష్ణానదిలో స్నానం ఎలా చేసేదో, కృష్ణ ఒడ్డున తన స్నేహితులతో ఆడే ఆటలు, చేసిన పూజలు, నాన్నమ్మ కొన్ని సంవత్సరాల క్రిందట ఇక్కడ తిరిగింది కదా! నాన్నమ్మ చెప్పిన సంగతులు, జ్ఞాపకం చేసుకుంటూ కృష్ణానదిని చూస్తున్నాడు. పరవళ్ళతో ప్రవహిస్తున్న కృష్ణానది చాలా మనోహరంగా ఉంది. కొండమీద దుర్గమ్మ తన చల్లని చూపులతో వీక్షిస్తూ ఉంది. ప్రకాశం బ్యారేజి చాలా అందంగా కనబడుతోంది. అవతల తీరంలో అంజనేయస్వామి గోపురం కనిపిస్తోంది. అలా నది ఒడ్డున నిలబడి రమణీయమైన అందాలను తిలకిస్తున్న హరీష్ నది మధ్యలో పడవలను చూసేసరికి ఈ లోకంలోకి వచ్చాడు. ప్రక్కనే అమ్మ, నాన్న పాత్రలని బ్యాగ్ లోంచి తీస్తూ కనిపించారు. గబగబా పడవలకి టిక్కెట్టు కౌంటర్ వైపు నడుస్తున్న హరీష్‌కి దబ్బున ఏదో నీటిలోకి విసిరేసిన శబ్దం వినిపించింది.

వెనుకకి తిరిగి చూస్తే తండ్రి నాన్నమ్మ "అస్థికల" పాత్రని నదిలోకి విసిరేసాడు. పరుగు పరుగున వెనక్కి వచ్చి, ఏమిటి నాన్నా మీరు చేసిన పని? అలా విసిరేసారు అని అంటున్న కొడుకుని, భార్యనీ చూసి, ఏముంది? నది పరవళ్ళుగా ఉంది. టికెట్టుకి డబుల్ రేటు ఇవ్వండి... అంటున్నాడు. నది పరవళ్ళుగా ఉంది కదా... అవే కొట్టుకుని పోతాయిలే... అంటూ ఉండగానే హరీష్ దబ్బున నీళ్ళలోకి దూకేసాడు. పాత్రకి కట్టిన ఎర్రని గుడ్డ ఇంకా నీటిలో పూర్తిగా మునగలేదు కాబట్టి మణిలా

ప్రకాశిస్తూ కనిపిస్తున్న వైపుకి ఈదుతూ దూసుకు పోయాడు హరీష్. అది చూసిన సుధ బాబూ... అంటూ కుప్పకూలిపోయింది.

హరీష్... ఎంత పని చేసావు... అంటూ తండ్రి దిగ్భ్రాంతిగా చూస్తూ ఉండిపోయాడు. తెప్పరిల్లి బాబూ... బాబూ... అంటూ అరుస్తున్నాడు. చుట్టూ ఉన్న జనం కూడా అవాక్కయి చూస్తున్నారు.

ఈత వచ్చునో లేదో... ఇంతసేపయినా పైకి రాలేదు... అంటూ జనం హాహాకారాలు... కనీసం ఈతగాళ్ళు కూడా లేరేమిటి? అంటూ రకరకాల వ్యాఖ్యలు చేస్తున్నారు జనం. దగ్గరలో ఉన్న అధికారులు గజఈతగాళ్ళని రప్పించారు. వారు నదిలోకి దిగారు.

అరగంట గడిచింది. సుధ అత్తగారిని మనస్సులోనే వేడుకుంటోంది... భర్త చేసిన పనికి క్షమించమని, కొడుకుని రక్షించమని. అయినా అదేమిటి? అలా విసిరేసారు? అత్తయ్య పద్ధతులు, విలువలూ తెలిసి కూడా ఇలా చేసారేమిటి? బోటుకి డబుల్ ఎమౌంట్ అడిగాడు అనా? నది పరవళ్ళు తొక్కుతోంది అనా? అస్థికలకి విలువ ఇచ్చేది ఏమిటి అనుకున్నారా? మామయ్య అస్థికలను అత్తయ్య ఎంత పవిత్రంగా నిమజ్జనం చేయించారు? అలా చేయించడం వల్ల మనం వారికి చేసే చివరి సంస్కారం అదే అన్నారు. అన్నీ తెలిసీ ఈయన ఇలా చేసారేమిటి?

బాబూ.. బాబూ... అంటూ పిచ్చిదానిలా అరుస్తోంది. చుట్టూ జనం పోగయ్యారు. అంతా నివ్వెరపోయి చూస్తున్నారు. అరె... అందమైన అబ్బాయి... ఎంత అందంగా ఉన్నాడో చూస్తే కలవారిలా ఉన్నారు... తల్లిదండ్రులు చూస్తూ ఉండగానే అలా దూకేసాడు. ఎందుకని అలా దూకాడో? కలికాలం... ప్రేమ వ్యవహారం అనుకుంటా... జనం కథలు తయారుచేస్తున్నారు. ప్రవాహం బాగా ఉంది. ఈతగాళ్ళు కూడా పైకి రాలేదు. దాదాపు అరగంట అయ్యాక స్పృహతప్పిన హరీష్‌ని భుజం మీద వేసుకొని తీసుకు వచ్చారు. బాబూ... నాన్నా... అంటూ దగ్గరికి వెళ్ళి, కొడుకుని చూసిన డాక్టర్ కొడుక్కి ప్రాణాపాయం లేదుగానీ స్పృహ తప్పాడని గుర్తించాడు. జనం అమ్మయ్య... అనుకొని కదిలారు. హరీష్ చేతుల్లో ఎర్రని గుడ్డ కట్టిన పాత్ర గుండెలకి అదుముకొని గట్టిగా పట్టుకొని ఉన్నాడు. నెమ్మదిగా కనులు తెరుస్తున్నాడు.

క్షణం తనమీద తనకే అసహ్యం వేసింది రవికి. తనని ప్రాణంలా పెంచిన అమ్మకి తాను చేసిన చివరి సంస్కారం ఇదా? తనని ప్రాణంలా పెంచిన అమ్మకి తాను ఇచ్చినవిలువ ఇదా? అంటూ కుమిలిపోయాడు.

నెమ్మదిగా కళ్ళు తెరిచిన హరీష్‌కి చుట్టూ జనం, నీరు నిండిన నయనాలతో అమ్మ, నాన్న కనిపించారు.

క్షమించు నాన్నా, నాన్నమ్మ అస్థికలను మీరు అలా విసిరేయడం భరించలేకపోయాను. నాన్నమ్మ ఏదీ విసరకు నాన్నా... అని నాకు చిన్నప్పటి నుంచీ నేర్పింది. ఆ పాత్రలో నాన్నమ్మ ఉంది అన్న ఫీలింగ్‌తో దూకేసాను. థాంక్ గాడ్... పాత్రని రక్షించగలిగాను అంటున్న కొడుకుతో నన్ను క్షమించరా నాన్నా... నాన్నమ్మ మాటే మంత్రంగా భావించి, నా కళ్ళు తెరిపించావు అన్నాడు మనస్ఫూర్తిగా.

ముగ్గురూ పడవ ఎక్కి నదీ గర్భం వైపు కదిలారు. పదిలంగా పాత్రని పట్టుకొని... నిమజ్జనం చేయటానికి. ●



# ఆ-పన్నుల రాజ్యం

"తమరి బామ్మర్దులవారి లంచగొండి వ్యవహారాలను అదుపు చేయగల నిర్ణయం ప్రభువుల వారే తీసుకోవాలి–" అన్నాడు వినయంగా మంత్రి!

"పైసంపాదనకు అవకాశం లేనిచోట నియమించమని చెప్పానుగదా... అక్కడా లంచాలు మరిగాడా...?" ఆశ్చర్యంగా అడిగారు రాజుగారు.

"చిత్తం! తమ ఆజ్ఞ ప్రకారం ఊరి చివర ఓ గుడారం వేయించి, వచ్చిపోయే బళ్ళు లెక్కించే ఉద్యోగం ఇచ్చాం. కానీ, లెక్కబెట్టిన ప్రతి బండి దగ్గరా వరహా మామూలు వసూలు చేస్తున్నాడు ప్రభూ..." మొత్తుకున్నాడు మంత్రి.

ఈ సంగతేదో స్వయంగా తేల్చాలని మారువేషాల్లో బయల్దేరారు రాజూ, మంత్రీ...! కిరాయికి ఓ బండి మాట్లాడుకుని ఊరి చివరికొచ్చారు. బామ్మర్ది ఆ బండిని ఆపి, వరహా మామూలడిగాడు.

అప్పుడు బండివాడు బామ్మర్దుల వారికి వినయంగా నమస్కరించి "అయ్యా! సరుకు తయారయిన చోట తయారీపన్ను, దాన్ని అమ్మినందుకు అమ్మకం పన్ను, అమ్మడానికి తీసుకెళ్తున్నందుకు రహదారి పన్ను... ఇలా ఒకే వస్తువు మీద రకరకాల పన్నులు వడ్డిస్తూ, మధ్యలో మామూళ్ళు అంటారేందయ్యా...?" అడిగాడు.

మారువేషంలో బండిలో కూర్చున్న రాజుగారు మంత్రితో అన్నాడు గదా... "మంత్రీ! మావాణ్ని ఇక్కణ్ణించి తీసేసి ఇంకొకణ్ణి వేసినా వాడూ ఇదే పనిచేస్తాడు. ఈ అవినీతికి అంతం లేదా?"

మంత్రి దీర్ఘంగా నిట్టూర్చి, "అవినీతికి అంతం ఏముందీ? ఒక అవినీతిని ఆపితే ఇంకో అవినీతి ఇంకో రూపంలో పుట్టుకొస్తుంది... దాన్ని కనీసం సగానికి తగ్గించగలిగితే, మనం గొప్ప పరిపాలకులం అయినట్టే" అన్నాడు.

రాజు దీర్ఘంగా ఆలోచించి, "వచ్చిపోయే బళ్ళ మీద వరహా పన్ను మనమే విధిద్దాం... అప్పుడు మా బామ్మర్ది అర్ధ వరహా లంచం ఇస్తే పన్ను అడక్కుండా వదిలేస్తానంటాడు. అలా వరహా అవినీతిని అర్ధవరహాకి తగ్గించగలిగినట్టే అవుతుంది కదా... అన్నాడు.

మంత్రికి బుర్ర తిరిగిపోయింది. "తమరి బామ్మర్దులవారు అంత తక్కువ వారు కాదు – వరహా పన్ను కట్టించుకున్నందుకు అర్ధవరహా లంచం అడుగుతాడు. అలా ఒకటిన్నర అవినీతిని పెంచిన వాళ్ళం అవుతాం..." అన్నాడు భయంగా!

"అవినీతిని నిర్మూలించాలనే ఆలోచనే వ్యర్థం" అనే నిర్ణయానికి వచ్చేశారు ఇంక రాజుగారు!! పన్నులు వసూలు చేసే అధికారుల గురించి అవినీతి నిరోధకశాఖ పట్టించుకోవడం మానేసింది అప్పట్నించి. ●

జీవి'తం' కథలు

# రోమింగ్

మూడు లోకాల్లోనూ సెల్యులర్ రోమింగ్ సదుపాయం ఏర్పాటయింది. త్రిలోకాధీశులూ ముక్తకంఠంతో ఈ సదుపాయాన్ని ప్రశంసించారు.

ఇంద్రుడు సభను సమావేశపరిచి, సెల్‌ఫోన్ల వినియోగం గురించి సకల దేవతలకూ వివరించాడు.

నూరు వరహాలకే సెల్‌కనెక్షను, వెయ్యి వరహాలకే సెల్‌ఫోన్ సెట్టూ... కారుచౌక అనుకున్నారు దేవతలంతా!

మానవుల కాలమానం ప్రకారం భారతదేశం నుంచి ఇతర లోకాలకు నిమిషానికి ఒక వరహా చార్జీగా నిర్ణయించారు. ఒక వరహా ఖరీదు అమెరికన్ డాలర్‌కన్నా ఎక్కువే కావడంతో విదేశీవాటాదార్లకూ లాభాల పంట అయింది.

ఎంత కఠోర తపస్సు చేసినా, దేవుళ్ళ దర్శనం అయ్యేదికాదు పూర్వం. ఇప్పుడు సెల్‌కి రింగిస్తే ఏ దేవుడైనా పలుకుతున్నాడు... ఇన్‌కమింగ్ కాల్స్ "ఫ్రీ"యే కదా! "ఒక పిలుపులో పిలిచితే పలుకుతాడట" అనేమాట ఇప్పటికి నిజం అయింది.

దేవతలంతా స్వామీజీల మఠాల్ని కేరాఫ్ అడ్రసులుగా ఇచ్చుకుని, కనెక్షన్లు పొందుతున్నారు. తమ దేవుడి సెల్ బిల్లుని సదరు మఠం అక్కౌంట్లోంచి తీసి చెల్లిస్తారు లేదా ఆ దేవుడితో అవసరం ఉన్న పెద్ద భక్తుడెవరో కట్టేస్తుంటాడు.

అంతా బాగానే ఉందిగానీ, సెల్యులార్ కంపెనీలకు పాతాళం నుంచి వ్యాపారం బాగా తగ్గిపోయింది. పాతాళంలోని రాక్షసులకు ఇలా కేరాఫ్ అడ్రసులిచ్చేందుకు ఎవరూ ముందుకు రావడం లేదు.



బాగా పలుకుబడి ఉన్న ఓ విదేశీ సెల్యులర్ కంపెనీ వారు చొరవచేసి, దేశంలో మాఫియా ముఠాల్ని కలిసి వాళ్ళని వేడుకున్నారు – "చాలా పెట్టుబడి పెట్టాం. ఎవరెస్టంత టవర్లు కట్టాం. రాక్షసుల్లో మీకిష్టమైన వారికి మీ అడ్రసులు కేరాఫ్‌గా ఇవ్వండి. కనెక్షన్లు మేమిస్తాము" అని విన్నవించుకున్నారు. అందుకు బదులుగా అల్లావుద్దీన్ అద్భుత దీపం కథలో భూతంలా ఎంత పనయినా చేసిపెట్టేందుకు రాక్షసులు తమ సమ్మతిని మాఫియాలకు తెలియజేశారు.

అలా... దేవలోక, పాతాళలోకాలు నెట్‌వర్క్‌తో నిండిపోయాయి. "మఠాలు" దేవుళ్ళకీ, "ముఠాలు" రాక్షసులకీ బిల్లులు కట్టేస్తున్నాయి. బదులుగా వాళ్ళు వీళ్ళ పనులన్నీ చేసి పెడుతున్నారు.

ఇంక దేవుళ్ళూ, రాక్షసులూ, భూతప్రేత పిశాచాది గణాలూ, స్వామీజీలూ ప్రజల జోలికి రావడం మానేశారు. ఎవరి వ్యాపారాల్లో వారు మునిగిపోయారు.

భారతదేశంలో సామాన్యుడు ఇప్పుడు సుఖంగా జీవిస్తున్నాడు. ●

డా॥ జి.వి. పూర్ణచంద్

# హాస్పినేరేడు పండు

రోడ్డు మీద నడుస్తున్నాడు మంగపతి. భుజాన ఓ సంచీ వేలాడుతోంది. పేపరు చుట్టిన పాత డైరీ, దానికితోడు ఆకలేసినప్పుడల్లా రెండు మూడు వరసలొలుచుకుని పొట్టలోకి పంపించడానికి రెండు మొక్కజొన్న కంకులు, దస్తీతో కట్టిన మూటలో నాలుగు అల్లోనేరేడు పండ్లున్నాయి ఆ సంచీలో. తను జనంలో నడుస్తున్నా అందరూ తనని వదిలిపెట్టి పరుగెత్తుతున్నట్లుగా ఉంది.

ఈ మహానగరంలో తన దరిద్రపు రూపాన్ని



వెనక నుంచే – నడక చూసి 'అరేయ్ ఆగు' అన్న కేక వినిపించింది. నన్నెవరు మాట్లాడిస్తారులే అని గట్టిగా అనుకున్న తనకు గట్టి దెబ్బ తగిలింది. ఆ కేక పెట్టింది బద్రి. చిన్నప్పుడు తనతోపాటు చదువుకున్నవాడు. తను చదువుకుంటూంటే వాడు చదువుకోనివాడు. కళ్లజోడు, కాళ్లజోడు అన్నీ కొత్తగా కళకళలాడుతున్నాడు. తళతళ మెరుస్తున్నాడు. బద్రి... బద్రిగాడు... బద్రీ నారాయణ... వరివాముల వెంకట బద్రీ నారాయణరావు.

తనకు ఎంతో సంతోషం వేసింది. క్షణంలో భయం వేసింది. తను తనే అంటే తననిలా చూసిన తనను తను చూడలేడనే భయం! వెంటనే ఓ నిర్ణయానికి వచ్చాడు. తను మంగపతి నన్న నిజాన్ని దాచిపెట్టాడు.

"అరేయ్! మంగపతీ!" ఆనందంగా అరిచాడు బద్రి.

"ఎవరండీ మీరు" అన్నాడు మంగపతి.

"అరేయ్ మంగపతీ నేను బద్రిగాణ్ణిరా" కళ్లలో కళ్లు పెట్టి అన్నాడు బద్రి.

"సారీ... నాకు మీ మంగపతి పోలికలుండొచ్చు.

కానీ బద్రి వెళ్లలేదు. తన సంగతి తనకెలాగూ తెలుసు. బద్రి నిర్ణయమే తనకు తెలియ లేదు.

"మీరు ఏమనుకోకపోతే నాదో కోరిక. మీరు నా మంగలాగ ఉన్నందుకే ఎగిరి గంతేస్తున్నాను. ఎన్నేళ్లయిందో. వాణ్ణి చూసిన ఆనందం నాకు కలిగించారు. కాబట్టి మీ రుణం నేను తీర్చుకోవాలి" అన్నాడు బద్రి.

"అంటే ఏం చేస్తారేంటి?" అడిగాడు మంగపతి.

"వాడికి అల్లో నేరేడు పండ్లు ఎంతో యిష్టం. నేను చెట్టెక్కి దులిపితే వాడు ఏరుకునేవాడు. హైదరాబాదంతా తిరిగైనా సరే ఆ పండ్లు మీకివ్వాలి నేను" అన్నాడు బద్రి.

"ఏమండీ... నాకు ఆ పళ్లంటే వళ్లంతా గగుర్పాటు. మీ రుణం తీర్చుకోడానికి మీతో పాటు జంటనగరాలు తిరిగే ఓపిక నాకు లేదు. ముఖ్యంగా టైం లేదు" అన్నాడు మంగపతి. ఏ భావం లేకుండా బద్రి తనని చూడడంతో తడబడ్డాడు తను. బయటికి తెలియకుండా జాగ్రత్తపడ్డాడు.

"సార్! మీ కాళ్లు పట్టుకుంటా... యివ్వాళ మీరు నాతో పాటు ఉండండి. మీకు ఓపిక, శక్తీ నేను కలిగిస్తా..." అన్నాడు బద్రి.

"సరే! మీ ఇష్టం. ఇప్పుడు టైమెంత" అంటూ క్లాక్ టవర్ చూసాడు మంగపతి.

"టైమ్ కోసం దానిని చూడక్కర్లే. కాలం నా చేతికి చుట్టబడి ఉంది. మీ జీవితంలో ఈ ఒక్కరోజు మీది కాదనుకోండి... మిమ్మల్ని మీరు మరచిపోండి... నా కోరిక ఏదీ కాదనకండి" వేడుకున్నాడు బద్రి.

"సరే అలాక్కానీండి" అన్నాడు మంగపతి.

* * *

కలా నిజమా అనేట్లు గంటలో తన రూపాన్ని పూర్తిగా మార్చేసాడు బద్రి. అది నవనాగరికమైన అయిదు చుక్కల హోటల్ గది. అందులో ఉంచాడు తనని. 'ఇంత పెద్దవాడివెలా అయ్యావురా?' అని ఆప్యాయంగా అడగాలనిపించింది తనకు. నటన అడ్డమొచ్చింది.

"ఇప్పుడే వస్తా కంగారు పడకండి" అని



బయటికి వెళ్లాడు బద్రి.

గుక్క తిప్పుకోకుండా అయింది.

నిన్న తనని చూసినవాళ్లు ఇవ్వాళ చూస్తే గుర్తుపట్టలేరు.

తనని తనే గుర్తు పట్టేట్టులేదు. ఇంతచేసిన తన స్నేహితుడికి తనెందుకు అపరిచితుడిగానే ఉన్నాడు? ఆలోచిస్తూ అద్దం ముందు అందాలు చూసుకుంటున్నాడు మంగపతి. తనిలాగే ఉంటే రేపు బద్రి కనిపించడు. అప్పుడు బద్రి కొని పెట్టిన గడియారం, సూటు, బూటు అన్నీ అమ్ము కుని బతకాల్సిందే.

ఛ! ఏమిటి తను చేస్తున్న పని? ఎందుకీ అభిమానం? వాణ్ణి వాడిగా కలవాల్సిందే... కానీ వద్దు. తన దరిద్రం బద్రికి తెలియకూడదు. చిన్నప్పుడు సరదా వెక్కిరింతలలో తనది పైచేయిగా ఉండేది. ఇప్పుడూ ఆ చేయి అలాగే ఉండాలి. ఏమిటి తన ఆనందం? తన తృప్తి? ఏమన్నా సంస్కారం అనిపించుకుంటుందా?... ఆలోచిస్తూ శంకర్ జైకిషన్ హిట్స్ వింటూ తన్మయత్వంలో ఉన్న తనకు పోలీసు బూట్ల అపశృతి వినిపించింది.

"ఏయ్ మిస్టర్ నీపేరేంటి?" గదిలోకి దూసు కొచ్చిన పోలీస్ సౌండ్ కక్కాడు.

## పాలకొల్లులో నన్నయ సహస్రాబ్ది ఉత్సవాలు

పాలకొల్లులో ఆగస్ట్ 12, 13 తేదీలలో 'నన్నయ సహస్రాబ్ది ఉత్సవాలు' నిర్వహించనున్నట్లు 'ఉత్సవాల సారధ్య సంఘ సభ్యులు శ్రీ పెద్దిభొట్ల లక్ష్మీనారాయణ తెలిపారు. 12వ తేదీ ఉదయం 9-00 గంటలకు జరిగే ప్రారంభసభలో ఆధ్యాత్మిక తత్వవేత్త శ్రీ నాన్నగారు, కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం రిటైర్డ్ ప్రొఫెసర్ శ్రీశలాక రఘునాధశర్మ పాల్గొంటారు. పాలకొల్లు శాసనసభ్యులు డాక్టర్ సిహెచ్. సత్యనారాయణమూర్తి ఈ కార్యక్రమంలో ముఖ్య అతిధిగా పాల్గొంటారు.

ఈ రెండు రోజుల కార్యక్రమంలో పలువురు వక్తలు వివిధ అంశాలపై ప్రసంగిస్తారు. డాక్టర్ మైలవరపు శ్రీనివాసరావు (నన్నయ నాటి ప్రేమతత్వము-నేటి ప్రేమతత్వము), డాక్టర్ కేసాప్రగడ సత్యనారాయణ (నన్నయ నానా రుచిరార్ధ సూక్తినిధి), డా॥ ఆర్.యస్. వెంకటేశ్వరరావు (నన్నయ-ప్రకృతి చిత్రణ), శ్రీ కోవెల సంపత్కుమారాచార్య (ఆంధ్ర మహాభారతం-అవతారిక), శ్రీమతి సి. మృణాళిని (సభాపర్వం-మనోవైజ్ఞానికత), డాక్టర్ గరికిపాటి నరసింహారావు (నాటి నన్నయ-నేటి అవసరం), శ్రీ కనుములూరి వేంకటశివయ్య (ద్యూతము-అనుద్యూతము) ఈ ఉత్సవాలలో ప్రసంగిస్తారు.

శ్రీ మానాప్రగడశేషసాయి, భారతాచార్య శ్రీ జొన్నలగడ్డ మృత్యుంజయరావు, శ్రీ మల్లంపల్లి శరభేశ్వరశర్మలను ఈ ఉత్సవాలలో సన్మానిస్తారు. ముగింపు సమావేశంలో పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్ డాక్టర్ ఆవుల మంజులత ముఖ్యఅతిధిగా పాల్గొం టారు. ఇతర వివరాలకు శ్రీ పెద్దిభొట్ల లక్ష్మీనారాయణ (94408-94395), శ్రీ పి.ఎస్.ఎన్. రాజు (94409 27899) లను సంప్రదించవచ్చు.

"నా పేరు చక్రపాణి" తడబడుతూ చెప్పాడు మంగపతి.

"నువ్వెవరివైతే నాకేంటి? పద బొక్కలో దూరుదువుగాని" గాండ్రించాడు పోలీసు.

"అదేంటండీ మీరెవరు? నేనెవర్ని? మీరొచ్చిన కారణమేంటి? నేను చేసిన నేరం ఏంటి? నన్నెందుకు అరెస్టంటున్నారు. కనీసం కొద్ది సేపాగండి. ఈ రూమ్ ఎవరి పేరు మీదుందో అతనొస్తాడు" దీనంగా అన్నాడు మంగపతి.

"వాణ్ణి కూడా నీ బొక్క పక్క బొక్కలో వేస్తాం ముందు నువు రారా" అంటూ నెట్టింది పోలీసు చేయి. వేషం ఎంత గంభీరంగా ఉన్నా లోపల తన దరిద్రం, పిరికితనం. చిన్ననాటి స్నేహితుడు అన్న ఆనందం తప్పితే యిన్నేళ్ల వ్యవధిలో వాడెలా యింతటి వాడయ్యాడు, వాడి బతుకేంటి? వివరాలు తెలియకుండా యిరుక్కుపోయాను. భగవంతుడా ఒక్క పూటలో నన్నంత ఎత్తుకి తీసికెళ్లి కిందపడేసావే! అన్ని దెబ్బలూ నాకే తగలాలా? కటకటా కటకటాల పాలాయెనా బతుకు?

* * *

"సార్! ఆ బద్రి నా చిన్నప్పటి స్నేహితుడు సార్. వాడు చాలా మంచి వాడుసార్. వాడికీ ఈ నేరానికీ ఏ సంబంధం ఉండి ఉండదు సార్. మీరు ఎవరో అనుకుని మమ్మల్ని అనుమానిస్తున్నారు. బద్రిని రానీయండి సార్" దీనాతిదీనంగా వేడుకున్నాడు.

"పెద్ద దొరగారొస్తున్నారు. పక్కకు జరగండి"

అందరూ ఎలర్టయ్యారు.

"ఏదీ వీళ్ల ఫైలు? యింకొకడేడీ?" అడిగాడు ఆఫీసర్.

"వాణ్ణి కూడా ఓ గంటలో పట్టుకొస్తాం సార్. మనవాళ్లు అదే పనిలో ఉన్నారు సార్. యితనేదో కథలు చెబుతున్నాడు సార్"

"డిగ్రీలు కొలిచారా?"

"యింకా లేదు సార్"

"ఆ. ఏంట్రా! నువ్వు రూమ్‌లోకి ఎంటరయినప్పుడు ఎలా ఉన్నావు? మా వాళ్లు వచ్చినప్పుడు ఎలా ఉన్నావు?" అడిగాడాఫీసరు చాలా గంభీరంగా. మొనగాళ్లకు మొనగాడులో ఎస్వీరంగారావు గొంతులాగా. ఏ దరిద్రపు గొట్టు వేషం ఎవరూ చూడకూడదనుకున్నాడో ఆ వేషాన్ని వర్ణిస్తూ స్టేట్‌మెంటివ్వాల్సి వచ్చిందే... ముందే ఎందుకు బయట పడాలనుకుని,

"ఇలాగే ఉన్నాను సార్" అన్నాడు మంగపతి.

"నీ వెంట ఉన్న సంచీ ఏంచేసావు"

"ఏ సంచీ సార్"

"నువ్విలా నిజం చెప్పేట్లు లేవు. అరేయ్ ఆ దస్తీ మూట తీసుకురాండ్రా"

ఓ కానిస్టేబుల్ తీసుకొచ్చాడు.

"ఏమిటిది? ఈ బాంబులు పెట్టుకుని ఎందుకు తిరుగుతున్నావు"

"అవి బాంబులు కాదు సార్... అల్లో నేరేడు పండ్లు" వినయంగా చెప్పాడు మంగపతి.

"అదే... ఆ పళ్లంటే నీ వళ్లంతా గగుర్పాటా?" నవ్వుతూ అన్నాడు ఆఫీసర్.

"అరేయ్ బద్రీ..." స్నేహితుణ్ణి గట్టిగా పట్టుకుని ఆనందంగా ఏడ్చాడు అప్పటి వరకూ తలదించుకునే సమాధానాలు చెబుతున్న మంగపతి. ●

## జూలై-2006

# 100వ సంచిక మార్కెట్‌లో ఉంది...

- ఎన్నో అవకాశాల ఏనిమేషన్ రంగం ప్రత్యేక వ్యాసం
- అప్లికేషన్స్‌లో ఈస్టర్ ఎగ్స్
- Windows XP పవర్ టాయ్స్
- ఒపేరాలో మౌస్ గెస్చర్స్
- నిత్యజీవితంలో భాగమైపోతున్న నెట్‌ఫోన్
- లినక్స్‌పై వ్యాసాలు
- Oracle...
- Java...
- కంప్యూటర్ రంగ వార్తలు
- కొత్త ఉత్పత్తులు

**... వంటి అనేక అంశాలతో...**

సంవత్సర చందా వివరాల కోసం సంప్రదించండి...



# వ్యక్తిత్వం

శుశ్రుత హాస్పిటల్ ముందు ఆగింది మారుతి కారు.

ప్రొఫెసర్ శ్రీనివాస్, ఆయన మిసెస్ హడా విడిగా కారు దిగి, ప్రసవవేదన పడుతున్న తమ కూతురు రేఖను మెల్లగా లోనికి తీసుకెళ్లారు.

రిసెప్షనిస్ట్ దగ్గరకి వెళ్ళి విషయం చెప్పారు.

రిసెప్షనిస్ట్ టైం చూసి యం.డి.కి ఫోన్ చేసి గైనకాలజిస్ట్ విద్యాధరి అపుడే యింటికి వెళ్లిందని, ఆ సమయంలో యీ కేసు వచ్చిందని చెప్పింది.

యం.డి. వెంటనే రేఖని ఆపరేషన్ థియేటర్ లోపలికి పంపే ఏర్పాటు చేసి, విద్యాధరికి ఫోన్ చేసి విషయం చెప్పాడు.

మరో పదినిమిషాలలో విద్యాధరి వచ్చింది. అప్పటికే ఆపరేషన్ థియేటర్‌లో అన్ని ఏర్పాట్లు జరిగాయి. శ్రీనివాస్ చాలా కంగారుగా ఉన్నాడు. అతడు నగరంలో డిగ్రీ కాలేజిలో కెమిస్ట్రీ ప్రొఫెసర్.

విద్యాధరి రాగానే పేషంట్‌ని చూసి శ్రీనివాస్ దగ్గరకు వచ్చింది

"ఏంటండీ! యింత నెగ్లెక్ట్ చేశారు. ముందుగా రావచ్చుగా. యిపుడు సిజేరియన్ చేయాలి..." అంది రిపోర్ట్స్ చూస్తూ...

"అదికాదు డాక్టర్! అమ్మాయి డెలివరీ డేట్ యింకో పదిరోజుల తర్వాత ఉంది. అంతలోనే



యిలా... ఎనీహౌ మీరే రక్షించాలి" అన్నాడు శ్రీనివాస్ ప్రాధేయపడుతూ!

"సరే! నా ప్రయత్నం చేస్తాను. మీ పేరు?"

"శ్రీనివాస్! కెమిస్ట్రీ ప్రొఫెసర్‌గా పని చేస్తున్నా"

విద్యాధరి తలఎత్తి కాస్త పరిశీలనగా చూసింది.

"మీరు నరసాపురంలో పనిచేసారుకదూ" అడిగింది అనుమానంగా!

"అవును చాలా ఏళ్ళ క్రితం" అన్నాడు శ్రీనివాస్ అర్థంకాక.

"నేనండీ మాస్టారూ! యిరవై రెండేళ్ల క్రితం... నరసాపురంలో... విద్యాధరిని"

"నువ్వా! సారీ... మీరా!" తడబడ్డాడు శ్రీనివాస్.

"భలేవారు సార్! సారీ ఏంటి? మీరు మా మాస్టారు! సరే... ముందు పేషంట్ విషయం చూసి తర్వాత మాట్లాడుకుందాం" అంటూ ఆపరేషన్ థియేటర్‌లోకి వెళ్లింది విద్యాధరి.

శ్రీనివాస్ మనసంతా అల్లకల్లోలం అయింది. ఇలా మళ్లీ విద్యాధరిని చూస్తాననుకోలేదు. తన గురించి ఏమని భావిస్తోంది? అసలు తనను ఆ విషయం గురించి అడిగితే ఎలా సమాధానం యివ్వాలి? ఇక ఆలోచించలేక భార్యతో అర్జంట్ పని ఉందని అంటూ కొంత డబ్బు ఆమె చేతిలో ఉంచి బయటకు వచ్చాడు.

అరగంట తర్వాత విద్యాధరి ఆపరేషన్ థియేటర్ నుంచి బయటకు వచ్చి "బై గాడ్ బ్లెస్... అమ్మాయి. బేబీ యిద్దరూ క్షేమంగా ఉన్నారు... అన్నట్లు మాస్టారు ఎక్కడ?" అని అడిగింది.

"చాలా సంతోషం తల్లీ! మీ మాస్టారు ఏదో చాలా అర్జంట్ పని, యిప్పుడే వస్తానని వెళ్లారు" అంది మిసెస్ శ్రీనివాస్.

'ఇక ఇక్కడికి రావడం జరగదులెండి' అని మనసులో అనుకొని "మీ అడ్రస్ యిస్తారా! నేను ఎపుడయినా వచ్చి కలు

టి. సురేశ్‌బాబు

స్తాను" అంది విద్యాధరి.

ఆమెకు అడ్రస్ యిచ్చి, థాంక్స్ చెప్పి, ఫీజు చెల్లించి కూతురు ఉన్న రూమ్‌లోకి వెళ్లింది మిసెస్ శ్రీనివాస్.

"మాస్టారూ! యింత నాటకం ఆడతారా! దేనినయినా సహిస్తాను కానీ అబద్దాలు సహిం చను అని చెప్పే మీలో యింతటి నయవంచ నా?" అనుకుంటూ యింటికి బయలుదేరింది విద్యాధరి.

* * *

వారం రోజుల తరువాత... ఓ సాయం కాలం వీలు చూసుకొని శ్రీనివాస్ యింటికి బయలుదేరింది విద్యాధరి.

మెల్లగా కారుని డ్రైవ్ చేస్తున్న విద్యాధరి మదినిండా ఆలోచనలు... గతకాలపు జ్ఞాపకా లు సుడులు తిరుగుతున్నాయి. అసలు తనకు తిరిగి ఈ జన్మలో శ్రీనివాస్ మాస్టారు కనిపి స్తాడనుకోలేదు. కనిపించినా యిలా ఫ్యామిలీతో వస్తాడన్న ఆలోచనే రాలేదు. ఎందుకిలా జరి గింది? తను ఎంతో గౌరవప్రదంగా, ఉన్నతం గా భావించే ఆదర్శ పురుషునిలో యింతటి దగాకోరుతనమా? కళ్లలో నీళ్లు తిరిగాయి.

మాస్టారూ! మీతో ఏడడుగులు నడిచి, జీవి తాన్ని సాఫల్యం చేసుకోవాలన్న నా కోరికను మొగ్గలోనే త్రుంచి యిలా మీరు హాయిగా ఉండ డానికి నేనేం పాపం చేశాను?

కనుల్లో నిండిన నీటికి ఎదురుగా రోడ్డు మీద దృశ్యాలు అస్పష్టంగా కన్పిస్తున్నాయి. కను లు తుడుచుకొంది. మనసులో మాత్రం ఎంత వద్దన్నా యిరవై రెండు సంవత్సరాల క్రితం జరిగిన సంఘటనలు జ్ఞాపకం వస్తున్నాయి.

* * *

ఉదయం ఎనిమిది గంటలు.

ఇంటిముందు గల పెరడులోని కాంపౌండ్ వాల్ ప్రక్కనే గల సన్నజాజి పందిరి క్రింద చదువుకుంటోంది విద్యాధరి.

విరబూసిన సన్నజాజులు గాలికి రాలి పడు తున్నాయి. పదహారు సంవత్సరాల ప్రాయం... కనులు ప్రక్కకు తిప్పుకోనివ్వని అద్భుత దేహ సౌందర్యం. నల్లని పొడవయిన వాల్జడ. తెల్లని మెరుపులా పలువరుస... దేహమంతా వాటి వాటి స్థానాల్లో సరియైన రూపంలో ప్రకాశి స్తున్న అవయవ సంపద.

విద్యాధరి తండ్రి మంచి వ్యాపారస్థుడు. రెండంతస్థుల బంగళా. ఆర్థికంగా ఏ యిబ్బం దులూ లేని జీవితం. పదవతరగతి చదువు తోంది.

"అమ్మా! విద్యా! రామ్మా! స్కూలుకు టైం అవుతోంది..." యింట్లోంచి పిలిచింది విద్యా ధరి తల్లి.

"ఆ... వస్తున్నా" అంది కోయిల గొంతు కతో... బుక్స్ తీసుకొని యింట్లోకి రాబోతుం డగా యింటిముందు ఏదో వెహికిల్ ఆగిన శబ్దం విన్పించింది.

ఒక్క క్షణం ఆగి చూసింది. ఎదురింట్లో ఎవరో చేరుతున్నారు కాబోలు టాక్సీలోంచి పాతి కేళ్ల యువకుడు దిగాడు. నలుపురంగు ప్యాం టు, లేత నీలిరంగు చొక్కా ధరించాడు. కాస్త ఉంగరాల జుట్టు. నిండైన విగ్రహం..: ముఖం లో చిరునవ్వు.

మనసంతా అదోరకమయిన తన్మయత్వ భావనతో నిండిపోయింది. ఎవరబ్బా యీ నవ మోహనాకారుడు అనుకుంటూ యింట్లోకి నడి చింది.

* * *




క్లాసంతా అల్లరిగా ఉంది.

అంతలో హెడ్‌మాస్టర్‌గారు ఒక యువకుడిని వెంటబెట్టుకొని వచ్చారు. క్లాస్ సైలెంట్‌గా మారింది. అంతా ఆత్రంగా చూస్తున్నారు. విద్యాధరి తను వ్రాస్తున్న నోట్‌బుక్ మూసి తలపైకెత్తి చూసింది. ఎదురుగా అతడే... తను ఉదయం చూసిన నవమోహనాకారుడు.

"డియర్ స్టూడెంట్స్! ఇవేళ చాలా శుభదినం. ఎందుకంటే స్కూలు తెరచి నెలగడిచినా మనకు సైన్స్ టీచర్ లేకపోవడం చాలా యిబ్బందిగా ఉంది కదా! ఈరోజు మిస్టర్ శ్రీనివాస్‌గారు మన పాఠశాలకు సైన్స్ మాస్టారుగా వచ్చారు. మీరందరూ యీ మాస్టారు బోధనలో మంచి ఫలితాలు సాధిస్తారని ఆశిస్తాను" అంటూ పరిచయం చేశారు హెడ్‌మాస్టర్.

'అంటే...యీ సుందరాంగుడు కొత్త సైన్స్ మాస్టారా! థాంక్స్ మైగాడ్" అనుకుంది చిన్నగా నవ్వుకుంటూ విద్యాధరి.

తర్వాత శ్రీనివాస్ యింట్రడక్షన్ క్లాస్ తీసుకున్నాడు... ఏ మాత్రం తడబడని వాక్ప్రవాహం... మాటలకు అనుగుణంగా హావభావాలు... బ్లాక్‌బోర్డ్‌పై అందమయిన దస్తూరి... తియ్యటి గంభీరమయిన కంఠం... ఆకట్టుకునే మాటలు... క్లాస్ జరిగినంతసేపూ అతడినే కన్నార్పకుండా చూసింది విద్యాధరి. మనసులో తెలియని ఆరాధనా భావం.

సాయంకాలం..."అమ్మా! ఎదురింట్లో కొత్తగా వచ్చిన మా మాస్టారు చేరారు... సబ్జెక్ట్‌లో డౌట్స్ తీర్చుకొని వస్తాను" అని చెప్పి శ్రీనివాస్ యింటికి వచ్చింది విద్యాధరి.

శ్రీనివాస్ బయట చైర్లో కూర్చొని ఏదో చదువుకుంటున్నాడు.

"నమస్తే సర్" అంది విద్యాధరి.

తలపైకెత్తి చూశాడు. అప్సరస లాంటి సౌందర్యం.

"నీవు?" అన్నాడు ప్రశ్నార్థకంగా...

"నా పేరు విద్యాధరి సర్! మీరు పనిచేసే స్కూల్లో పదోతరగతి చదువుతున్నా! సబ్జెక్ట్ డౌట్స్ తీర్చుకోడానికి వచ్చాను. మీ యింటికి ఎదురుగానే మా యిల్లు"

"కూర్చోమ్మా!"

ఏవో కొన్ని డౌట్స్ అడిగింది... చెప్పాడు.

"సర్! రోజూ వచ్చి నేను యిక్కడ చదువుకో వచ్చా" అంది అమాయకంగా ముఖం పెట్టి.

"దానికేం! చదువుకో"

"థాంక్స్ సర్" అంది ఆనందంగా విద్యాధరి. అంతలో యింట్లోంచి ఓ యాభైఏళ్ల ఆవిడ బయటకు వచ్చింది. "ఎవర్రా యీ అమ్మాయి" అంది రాగానే!

"అమ్మా! నా స్టూడెంట్! ఎదురింట్లో ఉంటారట" అన్నాడు శ్రీనివాస్.

"అలాగా" అంటూ లోపలికి వెళ్లింది.

విద్యాధరి వారిద్దరినీ చూస్తూ ఉండిపోయింది.

"మా అమ్మ! నేను, మా అమ్మ ఉంటాము. అక్కయ్య విజయవాడలో ఉంటోంది" చెప్పాడు శ్రీనివాస్.

"అయితే యీ సుందరాంగునికి యింకా పెళ్లికాలేదన్నమాట" లోలోన సంతోషించి "సరే మాస్టారూ! వస్తాను" అంటూ బయలుదేరింది.

అలా ప్రతిరోజూ సాయంత్రం ఆరుగంటలకు వచ్చి ఎనిమిది దాకా చదువుకోవడం అలవాటయింది.

ఓరోజు యింట్లో తయారుచేసిన స్వీట్లు తెచ్చింది.

"తీసుకోండి సర్" అంటూ యిచ్చింది.

"వద్దమ్మా" అన్నాడు శ్రీనివాస్ సున్నితంగా!

"లేదు సర్! మా యింట్లో ఈ రోజు పండుగ. తీసుకోండి సర్" అంటూ బలవంతంగా శ్రీనివాస్ చేతిలో ఉంచింది. అప్రయత్నంగా శ్రీనివాస్ చేతులు విద్యాధరి చేతులను తాకాయి.

ఒళ్లంతా ఝుల్లంది. తెలియని అనిర్వచనీయ భావవాహిని శరీరమంతా ప్రవహించింది. చూపులు కలిసాయి. విద్యాధరి కాస్త సిగ్గుతో తలవాల్చింది.

* * *

క్లాస్ జరుగుతోంది.

శ్రీనివాస్ తదేకంగా పాఠం చెబుతున్నాడు. విద్యాధరి మాత్రం అతడి వంకే కన్నార్పకుండా చూస్తోంది. మధ్యమధ్యలో పిల్లలందరినీ కలయజూస్తూ పాఠం చెబుతున్న శ్రీనివాస్ అప్రయత్నంగా విద్యాధరిని చూశాడు. ఆ అమ్మాయి తన్ను తినేసేలా చూస్తోంది. మనిషి తడబడ్డాడు. చూపు ప్రక్కకు త్రిప్పాడు.

మనసు స్వాధీనం తప్పుతోంది. అయస్కాంతం యినుపముక్కను లాగినట్లు ఆ అమ్మాయి ఆశగా చూసే కనులు రమ్మంటున్నాయి.

అప్పుడే "టెలిగ్రాం సర్" అంటూ వచ్చి యిచ్చాడు పోస్ట్‌మాన్.

దాన్ని చదువుకొని మరలావస్తానని చెప్పి హెడ్మాస్టర్ వద్ద పర్మిషన్ తీసుకొని ఇంటికి వెళ్లాడు శ్రీనివాస్.

విద్యాధరికి ఏంజరిగిందో అర్థంకాక సాయంకాలం వరకూ భారంగా గడిపింది. సాయంత్రం యింటికి రాగానే మాస్టారు ఇంటి వైపు చూసింది. తలుపులు తెరిచే ఉన్నాయి.

"హమ్మయ్య! మాస్టారు ఉన్నారన్నమాట" అనుకొని ఊపిరి పీల్చుకొంది. ఆరుగంటలు

కాగానే శ్రీనివాస్ ఇంట్లోకి పరుగుతీసింది.

యథాప్రకారం కూర్చుని చదువుకుంటున్నాడు శ్రీనివాస్.

వచ్చికూర్చొంది విద్యాధరి. ఇంట్లో అలికిడి లేదు.

"అమ్మగారు లేరా సర్?" అడిగింది విద్యాధరి.

"లేదమ్మా! విజయవాడలో అక్కయ్య ఆరోగ్యం బాగాలేదని టెలిగ్రాం వస్తే అమ్మను పంపాను" అన్నాడు శ్రీనివాస్.

"అయితే ఒక్కరే ఉన్నారన్నమాట" అంది ఒక విధమయిన ధ్వనితో.

"అవును" అన్నాడు శ్రీనివాస్ విద్యాధరి వైపు చూడకుండానే.

విద్యాధరి చదువుతోంది గానీ మనసు మనసులో లేదు. ఏదో చదువు అయిందని అన్పించి ఇంటికి వెళ్లింది.

మరో పదినిమిషాల్లో రెండు గిన్నెల్లో కూర, పచ్చడి తీసుకువచ్చింది.

"ఏంటమ్మా ఇది" అన్నాడు శ్రీనివాస్.

"ఒంటరిగా అన్నీ ఏం వండుకుంటారు సర్! కారియర్ తెస్తానంటే మీరు ఒప్పుకోరని అమ్మ పచ్చడి, కూర పంపింది. మీరు కాదన కూడదు" అంటూ అక్కడ పెట్టి ఓరగా ఓకంట చూసి వెళ్లింది. ఆ చూపు బాకులా గుచ్చుకుంది శ్రీనివాస్‌కి.

అలా వారం గడిచింది.

"మాస్టారూ! ఈమధ్య అంతగా చదవాలని పించడం లేదు"

"ఏం! ఎందుకని? ఆరోగ్యం బాగాలేదా?" అడిగాడు శ్రీనివాస్.

"ఆరోగ్యం బాగానే ఉంది. మనసే బాగోలేదు"

"ఎందుకని?"

"మిమ్మల్ని ఓమాట అడిగితే ఏమీ అనుకోరుగా?"

"అడుగు దానికేం"

"మాస్టారూ! మీ రూపం నన్ను సమ్మోహన పరుస్తోంది. మీ వ్యక్తిత్వం నన్ను నిలువనీయడం లేదు. నా మనసంతా మీ రూపం నిండి తన్మయత్వమవుతోంది. మీరు కనబడితేచాలు ఆనందం... నవ్వితే అనిర్వచనీయమయిన భావం... కనుల ముందు మీరు కదలాడితే సంతోషతరంగాలు మనోసరోవరంలో కదలాడుతాయి. ఇదంతా ఊరికే చెప్పడం లేదు. మీరు లేకపోతే నేను జీవించలేను... మిమ్మల్ని... మిమ్మల్ని... మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాను" అంటూ గబగబా చెప్పింది విద్యాధరి.

నిర్ఘాంతపోయాడు శ్రీనివాస్.

ఇలాంటి సంఘటన ఎదురవుతుందని భావించలేదు. అనుకోకుండా ఇలా... ఏం చెప్పాలి?

"చూడమ్మా! నువ్వు చిన్నపిల్లవు... ఇలా భావించడం మంచిది కాదు. ముందు చదువు పై దృష్టిపెట్టు" చెప్పబోయాడు శ్రీనివాస్.

"సర్! అవన్నీ నాకు అనవసరం... మీరు నాకు నచ్చారు అంతే! అయినా మీరు ఇంకా పెళ్లి చేసుకోలేదుగా! పెళ్లయిన వారిని ఇష్టపడి వారి సంసారాలను నాశనం చేస్తే తప్పుగానీ... నేను ఇలా కోరుకోవడం తప్పా? అసలు మీ అభిప్రాయం చెప్పండి" మోహావేశంతో ధైర్యంగా అడిగింది విద్యాధరి.

బదులివ్వలేదు శ్రీనివాస్.

"మాస్టారూ! నేను అందంగా లేనా?"

"అదికాదమ్మా! మన మధ్య పవిత్రమయిన గురుశిష్య సంబంధం ఉంది. ఇలా ఆలోచించ దం తప్పు"

"అదికాదు సర్! నేను నచ్చలేదా?" రెట్టించింది.

తన స్వచ్ఛమయిన వ్యక్తిత్వం... ఉపాధ్యాయ వృత్తి పట్ల తనకు గల గౌరవభావం, విద్యార్థులపై గల అనురాగం... ఎలా చెప్పాలి? పూర్తిగా కౌమారదశలోని మోహావేశంలో మునిగిన ఈ పిల్లకు ఎలా చెప్పాలి?

"విద్యా! నన్ను పెళ్లిచేసుకుంటే నీవు జీవితాంతం శోకించాల్సి ఉంటుంది" అన్నాడు మెల్లగా ఏదో ఒక స్థిర నిర్ణయానికి వచ్చినట్లు శ్రీనివాస్.

అర్థంకానట్లు చూసింది విద్యాధరి.

"నాకు సంతానం ఇచ్చే శక్తిలేదు" అని చెప్పి కనులు మూసుకున్నాడు శ్రీనివాస్.

త్రుళ్లిపడింది విద్యాధరి. భూమి బ్రద్దలయినట్లయింది. నమ్మలేకపోయింది... కానీ మాస్టారు... అబద్దం చెప్పడు... కనుల్లో నీరు తిరిగింది.

"అవును... అందుకే ఇలా బ్రహ్మచారిగా ఉన్నాను... ఇంతకంటే నేనేం చెప్పలేను"

విద్యాధరి బదులివ్వకుండాఇంటికి వెళ్లింది.

తర్వాత చదువుకోవడానికి మరలా రాలేదు. క్లాస్‌లో నిర్లిప్తంగా ఉండిపోయింది. అంతలో పరీక్షలు, సెలవులు... కాలం సాగిపోయింది.

శ్రీనివాస్ లెక్చరర్‌గా ప్రమోషన్ వచ్చి వెళ్లిపోయాడు.

* * *

గత జ్ఞాపకాలన్నీ వచ్చి తడిమి వెళ్లిపోయేసరికి శ్రీనివాస్ ఇల్లు వచ్చింది. కారు పార్కుచేసి లోపలికి వెళ్లింది విద్యాధరి.

ఆమెను చూడగానే "మీరా? రండి! రండి" అంటూ ఆహ్వానించింది ప్రొఫెసర్ శ్రీనివాస్ భార్య విజయలక్ష్మి.

సోఫాలో కూర్చుంటూ "అమ్మాయి క్షేమంగా ఉందా?" అడిగింది విద్యాధరి.

"అంతా నీ దయమ్మా! హాయిగా ఉంది. ఉదయమే అత్తారింటికి వెళ్లింది... పెళ్లి అని"

"మాస్టారు లేరా?"

"ఇంకా రాలేదమ్మా! ఈ వేళ కాస్త ఆలస్యంగా వస్తానన్నారు. అయినా పర్లేదు. ఈరోజు డిన్నర్ ఇక్కడే. అంతలోగా మాస్టారు వస్తారు" అంది విజయలక్ష్మి.

"అబ్బే! వద్దమ్మా! మరోసారి వస్తాను"

"అదేం వీల్లేదు... మీరు కాదనకూడదు. కావాలంటే కాలక్షేపానికి మాస్టారు వచ్చేవరకూ అదిగో ఆ రాక్‌లో బుక్స్ ఉన్నాయి" అంటూ ఇంట్లోకి వెళ్లి, రెండు నిమిషాల్లో కాఫీ తెచ్చింది విజయలక్ష్మి. ఇక తప్పలేదు. కాఫీ సిప్ చేస్తూ బుక్స్ వద్దకు వెళ్ళింది. విజయలక్ష్మి కిచెన్‌లోకి వెళ్లింది.

రాక్‌లో బుక్స్ అందంగా అమర్చబడిఉన్నాయి. డైరీల వంక చూసింది. శ్రీనివాస్ జాబ్‌లో చేరినప్పటి నుంచి ప్రతి సంవత్సరం డైరీలు వరుసగా ఉన్నాయి. వాటిపై ఏ ఊళ్లో పనిచేశాడో వాటి పేర్లూ ఉన్నాయి. 'నరసాపురం' అన్నపేరు డైరీపై చూసి అప్రయత్నంగా దాన్ని తీసుకొంది.

ఇతరుల డైరీలు చదవకూడదని తెలిసినా మనసు ఎందుకో ఉబలాటపడింది. అక్కడే కూర్చొని పేజీలు తిప్పసాగింది.

ఓ పేజీలో తనపేరు మీదుగా వ్యాఖ్యానం కన్పించింది.

"విద్యాధరీ!

ఈ రోజు అనుకోకుండా నీవు నన్ను ప్రేమిస్తున్నానని చెప్పావు. నాకేం పాలు పోలేదు. అది తప్పు అని చెప్పినా నీవు వినవు, వినలేవు. వినలేని స్థితి. అది నీ వయసు ప్రభావం - అర్థం చేసుకోగలను.

కానీ...

నాది ఓ ఖచ్చితమయిన వ్యక్తిత్వం. ఉపాధ్యాయ వృత్తిలో ఉన్న నాకు విద్యార్థుల పట్ల అభిమానం, అనురాగమే కానీ మరో వికృతభావన లేదు. ఉండరాదు అన్నది నా సిద్ధాంతం.

వయసు కలిగించే తొందరలకు, మనసు ప్రక్కదారులు పట్టడానికి లోనయ్యే కౌమార దశలో యిలా తొందరపడి నిర్ణయం తీసుకుంటే పవిత్రమైన గురుశిష్య సంబంధానికి అస్తిత్వం ఉంటుందా? ఎక్కడో ఏదో జరిగింది అని అదే త్రోవలో కుసంస్కారంతో వెళితే యీ పవిత్ర భారతీయ సంస్కృతి మురుగు కాల్వలా మారుతుంది. అలా కావడానికి నేనూ ఓ కారణం కావడం నాకు ఇష్టం లేదు.

అందుకే... నా సిద్దాంతాలకు, లక్ష్యాలకు, ఉద్దేశ్యాలకు అనుగుణంగా అయిష్టంగానే అసత్యమాడవలసి వచ్చింది.

నిజంగా నేను పుంస్త్వం లేనివాడిని కాదు... అలా చెప్పవలసి వచ్చింది... దాని వల్ల నీకు మానసిక క్షోభ కలిగించి ఉండవచ్చు. కానీ విద్యార్థుల పట్ల నాకున్న స్వచ్ఛమయిన అనురాగాన్ని కలుషితం చేయలేను.

ఒకవేళ ఏరోజయినా నేను అసత్యం చెప్పిన విషయం నీకు తెలిసినా నీవు అర్థం చేసుకోగలవని నా భావన.

ఎందుకంటే తల్లి, తండ్రి, గురువు అన్నారు. అంటే గురువు తల్లిదండ్రుల కన్నా పిల్లల్ని యింకా ఎక్కువగా ప్రేమించాలి, రక్షించాలి. చెడు దారుల నుంచి మళ్లించాలి. నీవు మంచి చదువులు చదివి అభివృద్ధిలోకి రావాలి. ఇది నా ఆకాంక్ష... ఆశీర్వాదం..."

చదవడం పూర్తయ్యాక మనసంతా అదోలా అయింది.

'మాస్టారూ? మీ ఉదాత్తమయిన వ్యక్తిత్వం సరిగా అర్థం చేసుకోలేక పోయాను. సారీ! నిజంగా ఇలాంటి ఆదర్శయుత వ్యక్తిత్వం చాలా మందిలో నేడు లోపించింది. అందుకే సభ్యసమాజం తలవంచుకునేలా అత్యాచారాల గురించిన వార్తలు పేపర్లో రోజూ చూస్తున్నాము. మీ ఉదాత్తమయిన నిగ్రహశక్తికి నా జోహార్లు" మనసులోనే అనుకొంది విద్యాధరి... ●

## పొదుపు

భర్త అడిగాడు... డాక్టరు గారు పూటకి రెండు చెంచాల మందు ఇవ్వమంటే... నువ్వు ఒక చెంచానే ఇస్తున్నావేంటీ?

'మీరేగా... ఏదయినా పొదుపుగా వాడమని చెప్పారు. నాదేం పోయిందీ... పూటకో సీసా తాగండి...' అని విసుక్కుంది... జ్వరంతో పడుకున్న భర్తమీద!



అమావాస్య రాత్రి. పది గంటలు దాటింది. వరుసగా రెండు రోజుల నుంచి ఎడతెరిపి లేకుండా పడుతున్న వర్షం ఆ పూటే కాస్తంత తగ్గింది. చిన్న చిన్న జల్లులు వస్తూ, పోతూ ఉన్నాయి. పగలంతా కోలాహలంగా ఉన్న విశాఖ బస్టాండు మౌనంగా ఉంది. ఒకటీ అరా మనుషులు వస్తూ పోతూ ఉన్నారు. ఒకటీ అరా బస్‌లు వస్తూ పోతూ ఉన్నాయి. ప్యాసింజర్ బస్‌లు తిరిగే టైమ్ అయిపోయింది కాబట్టి పాసింజర్లు కూడా అంతగా లేరు. ఎవరున్నా లేకున్నా నేను నా డ్యూటీ చేయకతప్పదు కదా!

కంట్రోలర్ క్యాబిన్‌లో కూర్చున్నాను. వార్తా పత్రిక తిరగేస్తున్నాను. బస్ రాగానే కండక్టర్ రిపోర్ట్ తీసుకోవడం, పాసింజర్లకు అవసరమైన ఇన్ఫర్మేషన్ ఇవ్వడం నా డ్యూటీ. గుంటూరుకు బస్ ఉందాండి? ఎవరో ప్యాసింజర్ అడిగాడు. 11.30 కి, 1 గంటకూ... చెప్పాను. ఎందుకో అసహనంగా ఉంది. క్యాబిన్‌లో నుంచి ఇవతలకు వచ్చాను. బైటంతా చీకటిగా ఉంది. ఒక్క బస్టాండులోనే నియాన్ లైట్ల కాంతి ఉంది. అంతా నిశ్శబ్ధంగా ఉంది. కొంతమంది లాస్ట్ బస్ తప్పిన ప్యాసింజర్లు సిమెంట్ దిమ్మల మీద నిద్రపోతున్నారు. కొందరు కళ్ళు మూస్తూ తెరుస్తూ తమ సామాను వైపు చూసుకుంటున్నారు. ఒకటీ అరా అటూ ఇటూ తిరుగుతున్నారు.

“అనకాపల్లికి బస్ ఎన్ని గంటలకండీ? ఒక స్త్రీ కంఠస్వరం వినబడే సరికి వెనక్కి తిరిగి చూసాను.

“అనకాపల్లికి బస్సుందాండీ?” అన్నదామె మరలా

“ఉందండీ” అన్నాను నేను.

“నేను అనకాపల్లి దాటాక ఆ తరువాత స్టేజిలో దిగాలండీ!” అన్నది ఆమె తన పరిస్థితిని వివరిస్తూ.

“పుల్లలపాడులోనా!” అడిగాను నేను.

“అవునండీ!” ఆమె సమాధానం.

“ఉదయం 6 గంటల తరువాతే ప్యాసింజర్లుంటాయండి. లాస్ట్ బస్ ఒక పావుగంట క్రితమే వెళ్ళిపోయింది. ఉదయం 6 గంటల వరకూ ఎదురు చూడాల్సిందే అన్నా నేను.

ఆమె ఏమీ మాట్లాడలేదు. మౌనంగా నిలబడింది.

“అనకాపల్లి వరకైతే మీరు ఏ ఎక్స్‌ప్రెస్‌లోనైనా వెళ్లవచ్చు.”

“నేను ఎట్టి పరిస్థితిలోనూ ఈ రాత్రి అర్జంట్‌గా పుల్లలపాడుకి చేరుకోవాలండీ. కండక్టర్ గారితో చెప్పి కొంచెం అక్కడ బస్ ఆపే ఏర్పాటు చేసి పెట్టండి సార్” అభ్యర్ధనగా అడిగింది.

అలా వీలుపడదనుకుంటాను అన్నాను. ఒక్క క్షణం ఆలోచించాను. నా వంతు సహకారంగా చిన్న సాయం చేసే ప్రయత్నం చేయాలనిపించింది.

“ఒక పని చేయండి. అవతల స్టేజి టికెట్ తీయండి. నేను ఎవరికైనా చెప్పి నా ప్రయత్నం చేస్తాను” అన్నాను.

“థ్యాంక్సండీ అంటూ” ఆ ప్రక్కనే ఉన్న బెంచీ మీద కూర్చుందామె.

అప్పుడు చూసానామెను పరిశీలనగా. 30 ఏళ్ళ వయసు ఉండవచ్చు. మోడరన్ డ్రస్ వేసుకుంది. జుత్తుని బిగించి కట్టి, ముడిగా వేసింది. వర్షపు జల్లులో తడవడం వల్లనేమో ఒంపు సొంపులు ప్రస్ఫుటంగా కనబడుతున్నాయి.

బి. రాంబాబు

చాలా అందంగా ఉందామె. చేతిలో చిన్న సూట్ కేస్. చంకలో ఒక హ్యాండ్ బ్యాగ్, లిప్‌స్టిక్ వేసిన పెదవులు.

నాలో సంస్కారవంతుడు భుజం తట్టి చెప్పాడు... పరస్త్రీని అలా చూడకూడదని.

బస్ రాగానే చెప్తాలెండి... అంటూ అక్కడ నుంచి ఇవతలకు వచ్చాను.

చల్లటిగాలి వీస్తోంది. ఆకాశమంతా నల్లగా ఉంది. ఈ ప్రపంచమే ఒక వింత ప్రపంచం. నా 40 ఏళ్ళ జీవితంలో ఎంతమందిని చూడలేదు? భిన్న ప్రవృత్తులున్న మనుషులు వస్తారిక్కడకి. అవకాశవాదులు, పిసినారులు, స్త్రీలోలురు, వ్యసనపరులు, త్రాగుబోతులు, అమాయకులు, అతికోపిష్టులు... అందరూ ఈ స్టాండులోనే పది నిమిషాలుండి వెళ్ళిపోతారు. ఆ కొద్దిసేపట్లోనే తమ స్వభావాన్ని ప్రదర్శిస్తారు. కొందరు చిరాగ్గా, కొందరు మర్యాదగా, కొందరు మామూలుగా ఉంటారు. అవతల మనిషి తీరుని బట్టి మా ప్రవర్తన ఉంటుంది. నిజమే... అంతం లేని ఈ భవనమంతయుపురాతన పాంథశాల. ఈ బస్ షెల్టర్ ఒక పాంథశాలయే కదా... ఇలా సాగుతున్న నా ఆలోచనలకు ఫుల్‌స్టాప్ పెట్టి నా క్యాబిన్‌వైపు వస్తున్నాను. ఆమె ప్రక్కన ఒక ముసలాయన కూర్చుని మాట్లాడుతున్నాడు. ఆ ప్రక్కనే కాస్త దూరంలో నిలబడి ఒక నడివయస్కుడు దువ్వెనతో తలను సరిచేస్తున్నాడు. నోట్లో కర్చీఫ్ వేలాడుతోంది. ఆ ప్రక్కనే ఓ కుర్రాడు అటూ ఇటూ తచ్చాడుతూ ఏదో పుస్తకాన్ని తిరగేస్తున్నాడు.

"నేనూ, అతగాడు కలిసి చదివాంలే. అప్పట్లో హైదరాబాదులో ఉండేవాళ్ళు. చాలా స్థితిమంతులు" అన్నాడా ముసలాయన.

"అవునండీ, ఇప్పుడు చితికిపోయారు" అందామె సమాధానంగా.

"నీకేం పర్వాలేదమ్మా. నేనున్నానుగా... ఏమీ భయపడకు. ఆమెతో మాట్లాడుతున్నా ఆమెని కాంక్షగా చూస్తున్నాయతని కళ్లు. కావాలని చేతులను ఆమె శరీరం మీద తాకిస్తూ శునకానందాన్ని అనుభవిస్తున్నాడతను. భయపడాల్సింది ఎవరికీ కాదు. నీలాంటి గోమాయువులకే అనుకున్నాను మనసులో.

ఈయన మాకు తెలిసిన వారేనండీ... మా నాన్నగారి స్నేహితుడు. అంటూ నాకు అతన్ని పరిచయం చేసింది. తనకు తోడుగా మరొక వ్యక్తి ఉన్నాడనే ధైర్యం ఆమె మాటల్లో కనబడింది" ఆహా... అన్నాను. ఆపైన సీరియస్‌గా ఆ ముసలాడి వైపు ఓ చూపు విసిరి నా క్యాబిన్ లోకి వచ్చి చేరాను.

ఇంతలో ఒక బస్ కండక్టర్ వచ్చాడు. బస్‌ని షెడ్‌లోకి పంపి, నాకు ఇన్ఫర్మేషన్ ఇచ్చాడు. ఆపైన ఓ పావుగంటసేపు యూనియన్ విషయాలు మాట్లాడి నన్నొదిలాడు. ఫ్లాస్కులో టీ త్రాగి సిగరెట్ వెలిగిస్తూ బైటకు వచ్చాను. ఇదొక వ్యసనం. ఎంత మానుకోవాలన్నా మానుకోలేకపోతున్నాను. అందులోనూ నైట్ డ్యూటీ అయితే మరీ ఎక్కువ. మామూలుగా లెక్క ప్రకారం రోజుకు రెండో, మూడో కాలుస్తాను. ఈ డ్యూటీలో మరో మూడో నాలుగో ఎక్కువవుతాయి. అందుకే నైట్ డ్యూటీలు సాధ్యమైనంత తక్కువ వేయించుకుంటాను.

ఒక పెద్ద లౌడ్ స్పీకర్ లాంటి గొంతు నా ఆలోచనలకు భంగం కలిగించింది. ఆమె వైపు చూసాను. ఇందాక తల దువ్విన నడి వయస్కుడామెతో ముచ్చటిస్తున్నాడు. ఒక కాలిని కొద్దిగా వంచి, రెండు జేబుల్లో చేతులు పెట్టుకొని, విలాసంగా నిలబడ్డాడతగాడు. నేను వెళ్లి అక్కడే

నిలబడ్డానతన్ని గమనిస్తూ.

ఆవిడేదో సమాధానం చెప్పింది.

"ఓ! ఐసీ! నేను మహీంద్రా & మహీంద్రాలో పనిచేస్తున్నానండి. నాది ఎక్కౌంట్ సెక్షన్. మా ఓనర్‌కి నేనంటే అమితనమ్మకం" అంటూ ఆ ఓనర్ గారి వ్యక్తిగత చరిత్రను వివరించడం ప్రారంభించాడు. ఆయన చిత్తు కాగితాలు అమ్మి ఈ స్థాయికి వచ్చాడనో, కాకా హోటల్ నుంచి కారెక్కే స్థాయికి ఎదిగాడనో అతగాడి సారాంశం. ఇదొక పెద్ద దురలవాటు. కొంతమందికి సరిగా మాట్లాడ్డం రాదు. ఎదుటి మనిషితో కాస్తంత పరిచయం కాగానే ఎక్కడెక్కడి విషయాలో ప్రారంభించి, ఆ పైన తమ స్వంత విషయాలను కథలు కథలుగా వినిపిస్తుంటారు. అవతల వాళ్ళ సహనానికి పరీక్ష పెడుతుంటారు. విడిపోయాకా ఎవరికెవరో మళ్ళీ కలుస్తారో లేదో. ఈ కొద్దిసేపట్లోనే ఈ చరిత్రలు వినిపించడం ఎందుకో?

నేను ఇవతలకు వచ్చి, సిగరెట్ ఆఖరి దమ్ము లాగి అవతల పడేసి క్యాబిన్‌లోకి రాబోతున్నాను.

"ఒక పని చేయండి. నేను ఇక్కడికి దగ్గర్లోనే ఉంటున్నాను. నా శ్రీమతి పుట్టింటికి వెళ్ళింది. వాళ్ళది విజయవాడలెండి. ఆవిడగారిని తీసుకు రావడానికి వెళుతున్నాను. మీకభ్యంతరం లేకపోతే ఈ పూట ఇక్కడ ఉండి, ఉదయమే వెళ్ళవచ్చు" అన్నాడతగాడు.

"ఈ రాత్రికి నాతో ఉంటావా?" అనే విషయాన్ని ఎంత డైరెక్ట్‌గా అడుగుతున్నాడు?

ఒంటరిగా ఆడది కనిపిస్తే చాలు... ఎక్కడ లేని ధైర్యం వస్తుంది మగ జాతికి.

ఈనాటి ద్వంద్వార్థపు మాటలున్న సినిమాలు, అశ్లీల వర్ణనలున్న కథలూ మనుషుల్ని ఏ రకంగా దిగజారుస్తున్నాయో కదా! ఈ నాగరికత మాటున ఎంత పశుప్రవృత్తి? ఎదుటి మనిషి రియాక్టయితే తప్పించుకోవడానికి అనుకూలంగా వింతగా మాటలు పేర్చాడితగాడు.

"లేదండీ. నేను అర్జంట్‌గా వెళ్ళాలి".

"పర్వాలేదండీ. ఇప్పటికే 11 గంటలు దాటి 12 కావస్తోంది".

మా ఇంటి ప్రక్కన ఎవరూలేరు. ఎవరూ పట్టించుకోరు కూడా.

ఉదయానే ఫస్ట్ బస్ ఎక్కిస్తాను కదా అన్నాడతను తప్పకరావలసిందన్నట్లుగా.

పర్వాలేదండీ సారీ. నేను తప్పక వెళ్ళాలి.

అది కాదండీ...

ఇలా సాగుతున్న సంభాషణను నేను గమనిస్తూనే ఉన్నాను. మర్యాద నుంచి బతిమిలాడుతూ ఆపైన దబాయించే స్థాయికి మారుతున్నాయి అతని మాటలు.

"ఏది కాదయ్యా. ఆమె అర్జంటుగా వెళ్ళాలంటే అలా సతాయిస్తావెందుకు" అన్నా నేను.

"అడిగేది నిన్ను కాదుగా? నీ జోక్యం ఏమిటి?" అన్నట్లు ఓ అసహనంతో కూడిన వాడిలా ఒక చూపుని నాపై విసిరి, ఆమె ప్రక్కన ఆ బెంచీ మీద కూర్చున్నాడతగాడు.

నాలో ఏవో ఆలోచనలు మొదలయ్యాయి.

మనిషి జీవితంలో సెక్స్‌కి ఎందుకింత ప్రాధాన్యత నిస్తాడు? ప్రతి వ్యక్తీ ఈ విషయంలో ఎంతకింత వ్యామోహ పీడితుడౌతాడు? మనిషిని ఆ కోరిక ఎందుకు పశువుగా మారుస్తుంది?

ప్రతిరోజూ పేపర్లో అమానుషంగా అనుభవించడం, బలాత్కరించడం, పరస్త్రీని వేధించడం వంటి సంఘటనలు ఎన్ని చదవడం లేదు? ఉన్నత పథాలకు వెళ్లాల్సిన ఈ వ్యవస్థ ఎందుకు పాతాళం వైపు పోతోంది? ఒంటరిగా స్త్రీ కనబడితే ఎందుకింత ఆబగా చూస్తారు? కాస్తంత అందచందాలను ప్రదర్శించే స్త్రీ కనబడితే ఎందుకింత రెచ్చిపోతారు? వయస్సుతో తారతమ్యం లేకుండా. ఎంత గొప్పవాడైనా, ఎంత నియమనిష్టలు గలవాడైనా, ఎంతటి మేధావియైనా పరస్త్రీ కాస్తంత అవకాశం ఇస్తే ఎందుకు వాళ్ళ జీవితాల్లోకి ప్రవేశిస్తాడు? ఇదేనా మగబుద్ధి అంటే?

ఎదుటి వ్యక్తి కష్టంలో ఉండి అర్థిస్తే సాయం చేయని వ్యక్తి, ఆ వ్యక్తి స్త్రీ అయితే అడిగీ అడగకుండానే సాయం చేస్తాడెందుకని? స్త్రీ అబల అనా లేక అవకాశం ఇస్తుందేమోనని ఆశతోనా? ఏమిటీ వింత ప్రవృత్తి? అందుకే అన్నాడొక మహానుభావుడు...

ఎంత నేర్చినా, ఎంత చూసినా, ఎంతవారలైనా కాంతదాసులే అని. నిజమే. ఈ విషయంలో ప్రపంచంలోని అన్ని దేశాల్లోనూ మానవ స్వభావం ఒక్కటిగానే ఉంది.

ఆఖరి సిగరెట్ తీసి వెలిగించాను. ఈ డ్యూటీకి ఇది చివరి సిగరెట్.

ఆలోచనలు నన్ను వదలడం లేదు.

అసలు మనం ఈ పాశ్చాత్య సంస్కృతికి అలవాటు పడడం వల్ల వచ్చిందేమో ఈ పరిస్థితి అనుకునే వాడిని. కానీ అమెరికా లాంటి విదేశాల్లో ఉన్న భారతీయులు ఎంతో దూరంలో ఉండడం వల్ల తమ అలవాట్లను, ఆచారాలను, సాంప్రదాయాలనూ అవసరమైనపుడు తప్పక అవకాశమున్నంతలో ఆచరిస్తున్నట్లు చదివానొక వ్యాసంలో. కానీ మనం మామూలు సమయాల్లో ఎలా ఉన్నా దేవాలయాల్లో పూజలు చేసేటప్పుడు కూడా ఫ్యాషన్ల పేరిట మిడ్డీలు, స్కర్టులు, పంజాబీలు, జీన్స్ వంటివి వేసి ప్రశాంతమైన వాతావరణాన్ని ఏర్పాటు చేసుకోలేక పోతున్నాం. పండుగ సమయాల్లో విపరీత ధోరణులున్న సినిమాలు ప్రదర్శించడం, చూడడం, సంక్రాంతి – దసరా పండుగలొస్తే ప్రతి కోవెలా దగ్గరా ఏదో ఒక సినిమా లేదా రికార్డింగ్ డ్యాన్స్. పొరపాటున ఎవరైనా ఓ హరికథో లేక బుర్ర కథో ఏర్పాటు చేస్తే ప్రేక్షకులు పదిమంది కూడా ఉండరు. ఈ ఫ్యాషన్ ప్రపంచంలో పడి, నాగరికత పేరిట వికృత చేష్టలను ప్రదర్శించడం ఎలా అలవాటైందో తెలియదు గానీ అది ఇప్పట్లో పోదు.

టీ తాగాలనిపించింది. ఎందుకో ఈ రోజు ఆలోచనలు కందిరీగల్లా బుర్రని తొలిచేస్తున్నాయి. క్యాబిన్‌లోకి వచ్చి ఫ్లాస్కులోని టీ ఒంపుకుని, చప్పరిస్తూ బైటకు చూసాను. ఆమె ప్రక్కన ఇందాక తచ్చాడిన కుర్రవాడు కూర్చుని ఉన్నాడు. అతడేదో చదివి వినిపిస్తున్నాడామెకు. నా కథకు ఏదైనా మంచి సన్నివేశం దొరుకుతుందనే ఉద్దేశ్యంతో అక్కడికి వెళ్ళాను.

*"ఓ చెలీ!*

*అప్పుడప్పుడూ అందించే చిరునవ్వు అప్పుగా ఇవ్వు*

*బారు వడ్డీయో, చక్ర వడ్డీయో*

*బిగి కౌగిలిగా ఇస్తాను*

*నా ప్రేమను మళ్ళీ మళ్ళీ"*

ఆవిడ పకపకా నవ్వింది.

ఆ కుర్రవాడామెవైపు ఆరాధనగా చూస్తున్నాడు"

మరొకటి వినిపించేదా? అన్నాడతను.




"ఆగు" అంటూ ఆమె అరచేతిని అతనివైపు ఉంచి పడీ పడీ నవ్వుతోంది. ఆమె అలా నవ్వు తూంటే ఆ కుర్రవాడి కళ్ళు ఆమె శరీరపు ఒంపు సొంపులను ఆస్వాదిస్తూ, కొలతలు కొలుస్తు న్నాయని నాకవగతమైంది. తెల్లటి వైట్ ప్యాం టులోకి బ్లూ రంగు టీషర్ట్‌ను దోపి ఖరీదుగల షూ వేసాడు. ఈ మధ్యే వచ్చి, వెలుగుతున్న ఓ కుర్ర హీరో గారి హెయిల్ స్టయిల్‌ని అను కరిస్తూ తలదువ్వాడు. దానికి తైల సంస్కారం జరిగి ఐదారు నెలలై ఉండవచ్చు.

"ఒక్క నీ కంటి చూపు చాలు.

వేయి ఓల్టుల కాంతి మాలలు"

చాలా బావుంది అంటూ భుజం మీద చేయి వేసి మెచ్చుకుందామె.

"ఏం చదువుకుంటున్నావు బాబూ!" అడి గానతన్ని.

"బి.ఏ. ఫైనల్" అన్నాడతను.

అతనిలో చాలా తెలివితేటలున్నాయి. మంచి భావుకత ఉంది.

కానీ ఆ వర్ణనలు వింటూంటే అతనిలో ఈ మధ్య కాలపు విపరీత ధోరణులు కనిపి స్తున్నాయి.

సరదాగా అతని సబ్జెక్ట్‌లో నాలుగు ప్రశ్నలు వేసాను.

సరియైన సమాధానాలు రాలేదు.

"పరీక్షలకింకా చాలా టైముందండీ. అప్పు డు చదువుతాను, నన్ను అమాయకుడిలా చూస్తూ అన్నాడతను.

నేనేమీ మాట్లాడలేదు. ఒక సీరియస్ లుక్ విసిరాను.

"అవునండీ... పరీక్షలపుడు నైట్ అవుట్‌లు చేసి ప్లాన్ ప్రకారం చదువుతాను. నేనెప్పుడూ ఫస్టే అన్నాడు మెరిసే కళ్ళతో."

"మీకింకా తెలియదు. చాలామంది అసలు చదవక స్లిప్‌లు పెట్టి రాస్తారు. కొంతమంది ఫీజులు కట్టి ఎగ్జామ్స్ వ్రాస్తారు. మా క్లాస్‌లో

చదివిరాసే వాళ్ళం ఓ పదిమందిమి ఉంటాం. అంతే... అందరి కంటే తనేదో బుద్ధిమంతుడై నట్లు చెపుతున్నాడు.

"ఏ ఊరు వెళ్ళాలి?" అన్నాను.

"దేరువాడ" అని చెప్పాడు.

"ఫస్ట్ షోకి సినిమాకు వెళ్ళానండీ. టిఫిన్ చేసి వచ్చేసరికి బస్ వెళ్ళిపోయింది. ఈ రాత్రి ఇక్కడే ఉండి, ఫస్ట్ బస్‌కు వెళతాను అన్నాడు సంజాయిషీగా. ఇందాక ఇద్దరికన్నా వీడు బెటర్. నిజాయితీగా నిక్కచ్చిగా తన మనస్సులో మాట చెపుతున్నాడు. వస్తానండీ" అంటూ లేచి వెళ్ళాడు.

నా చివరి ప్రశ్నకు కొంచెం గిల్టీగా ఫీల య్యాడనుకుంటా.

"పర్వాలేదు కూర్చో" అన్నాను. నా క్యాబిన్ లోకి వచ్చి కూర్చున్నాను. డ్యూటీ రిపోర్ట్‌పై సంతకాలు పెట్టి, కాగితంపై ఏవో పిచ్చి బొమ్మ లు గీస్తూ కూర్చున్నాను. ఓ పావు గంట గడి చింది.

ఆమె ఒక్కతే అటు వైపు కూర్చుని ఉంది.

విజయవాడ బస్ క్యాన్సిలైంది.

గుంటూరు గాని, రాజమండ్రి గానీ 12 గంటలకు, 1 గంటకూ రావాలి.

రాజమండ్రి బస్ ఇంకా రాలేదు. అది వస్తే ఈవిడను ఎక్కించవచ్చు.

ఆవిడ కూర్చున్న బెంచీ వైపు చూసాను. ఒకతే కూర్చుని ఉంది. రండి టీ త్రాగుదురు అని అహ్వానించాను.

కాబిన్ దగ్గర కొచ్చి నిలుచుంది.

కూర్చోండి అన్నాను మర్యాదగా.

ఆవిడ నావైపు అదోలా చూసింది. ఆమె నన్ను కూడా అనుమానిస్తున్నట్లు కనబడింది.

"పర్వాలేదు రండి అంటూ టీ కప్పు అం దించాను.

నేను తల వంచి కాగితం మీద పిచ్చి గీతలు గీస్తున్నాను. ఆవిడ టీ త్రాగి కప్పు టేబుల్‌పై ఉంచింది. నేను తలెత్తి ఆమె వైపు చూసాను. ఆమె హ్యాండ్ కర్చీఫ్‌తో కళ్లు తుడుచుకుం టోంది. ఆమె బాధపడుతోందని అర్థమైంది.

నేను ఆమె వైపు తిరిగి చూడండి.... "బాధ పడడం కాదు... బాధపడవలసిన పరిస్థితి తెచ్చు కోకూడదు. మిమ్మల్ని మీరొక్కసారి చూసు కోండి. మీరు 30 దాటిన స్త్రీ. చక్కగా మన సంస్కృతిని ప్రతిబింబించేలా నిండుగా చీర కట్టుకుని, పైటను మెడ వెనుక నుంచి తీసి, ఇవతలి భుజం వైపుకు వేసుకుంటే మీకెంతో హుందాతనం వస్తుంది. మిమ్మల్ని చూస్తే ఎదు టి వారికెంతటి గౌరవం కలుగుతుంది? కానీ మీరు ఆ పంజాబీ డ్రెస్ వేసి, పెదాలకు లిప్‌స్టిక్ పెట్టి, ఐబ్రోస్ సవరించి, ముడిని అందంగా మడచి, ఒంపు సొంపులను ప్రదర్శించే విధంగా ఉన్నారు. అందులోనూ వర్షపు జల్లులో తడిచి వచ్చారేమో, ఎంతటి వాడైనా నిగ్రహాన్ని కోల్పో యేలా ఉన్నారు. మీవంటి స్త్రీలు నగ్నశిల్పా ల్లాగా మగవాళ్ళను రెచ్చగొట్టే విధంగా వేషం ధరిస్తే కన్నులు చెదరక మానవు. ఆ పైన కోర్కె రగిలి, ఆలోచించే సంస్కారం ప్రదర్శించేది ఎవరో ఒక్కరూ అరా. అందునా అర్ధరాత్రి. ఈ స్థితిలో ఒంటరిగా కనబడితే ఎవరైనా అంతే. మన సంస్కృతికి అనుగుణంగా ఏ వయస్సులో ఏ విధంగా ఉండాలో అలా అందంగా అలంక రించుకుంటే ఈ సమస్యలే రావు" అన్నాను. ఇందాకటి సన్నివేశాలు నాలో స్పందనలు కలు గజేసాయి. దాని ఫలితంగా ఆలోచనలు... అం దుకే ప్రవాహంలా నాలోని ఆవేశాన్ని మాటల రూపంలో ఆమెకు కొంచెం ఘాటుగానే వివ రించాను.

మా ఇద్దరి మధ్యా కొన్ని నిమిషాలు మౌనం రాజ్యం చేసింది. తరువాత ఆమె ప్రారంభించింది. చాలా ఆవేశంతో ఉంది.

"నేనేమీ సరదాగా అలంకారం కోసం వేసుకు రాలేదండీ... నాకు సమాజమంటే ఏమిటో, మనుషులంటే ఏమిటో తెలియదు. మేము చాలా ఏండ్లుగా కువైట్‌లో ఉంటున్నాం. అక్కడ మా మామగారు, నాన్నగారూ మంచి స్నేహితులు. కలిసి వ్యాపారం చేసారు. కాని మొన్న కువైట్ గొడవల్లో మా రెండు కుటుంబాలూ మాడి మసయ్యాయి. చివరగా మిగిలింది అవిటివాడైన నా భర్త, పసివాడైన నా బిడ్డ. ఉన్నదంతా వదిలి మేమిద్దరం అష్టకష్టాలు పడి మా వారి స్వగ్రామం పుల్లలపాడుకు వచ్చాం. ఆయన మంచంలోఉన్నారు. ఆయన్ని, నా బిడ్డనూ పోషించుకోవడానికి ఆధారం లేదు. భువనేశ్వర్‌లో నా చిన్ననాటి స్నేహితులుంటే అక్కడేదైనా ఆధారం దొరుకుతుందని వెళ్ళాను. ఓ ప్రైవేట్ కంపెనీలో ఇంటర్వ్యూ పూర్తి చేసుకుని తిరిగి వస్తున్నాను. నాకు సరైన డ్రస్ లేక వాళ్ళ డ్రస్ వేసుకున్నా. రిసెప్షనిస్ట్ అంటే ఎటువంటి అలంకారం చేసుకోవాలో మీకు తెలుసు కదా! ఇంటర్వ్యూ అయ్యేసరికి ఆలస్యమైంది. హడావిడిగా వచ్చి కదలబోతున్న రైల్లో ఎక్కాను. ట్రైన్ 4 గంటలు ఆలస్యమైంది. అందుకే ఈ రాత్రి పూట ఇక్కడ ఇరుక్కోవలసి వచ్చింది. ఆయన ఒక్కరే ఉన్నారు. బాబు చాలా చిన్నవాడు. నేను వెళ్ళకపోతే కంగారు పడతారు" మాటలు ఆపి ఆమె వెక్కి వెక్కి ఏడవసాగింది.

"చివరగా ఒక్క మాట... నన్ను నగ్నశిల్పంలా ఉండవద్దని అన్నారు. పట్టుచీరలో ఉన్నా, పరదాచాటున ఉన్నా చూసే కళ్ళల్లో వాంఛ ఉంటే నగ్నశిల్పంలాగే చూడగలరండీ... మేము నగ్నశిల్పంలా ఉండడం కాదు... పరస్త్రీల నగ్నత్వాన్ని మీ కళ్ళతో చూడకండి. అదే పదివేలు. భారతీయ సంస్కృతి అని మీరన్నారే? మరి "యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతాః" అన్ని పెద్దలు చెప్పారే! అది మరిచారా? లేదా పరస్త్రీని తల్లిగానో చెల్లిగానో చూసి తొలగిపోవాలని చెప్పారు గదా! అది గుర్తుకు రాలేదా? మారుతున్న నాగరికతతో పాటు వేష భాషలు మారవలసిందే. తప్పు లేదు. కాని సంస్కృతిలో అంతర్లీనంగా దాగి ఉండే మంచిని మనం వదలకూడదండీ... చూసే కళ్ళల్లో, మాట్లాడే మాటల్లో, ఆలోచించే మనస్సులో మంచి ఉంటే అంతా మంచిగానే ఉంటుంది. కానీ మంచి భావాలున్న మీరు కూడా అందరి మగవాళ్ళలాగా ఆలోచించవద్దు. ఇది నా మనసులోని మాట. నన్ను మరో విధంగా అనుకోవద్దు" మాటలాపి హఠాత్తుగా ఆమె బయటకి కదిలింది.

నేను హతాశుడినయ్యాను. ఒక వ్యక్తి హృదయపు లోతుల్లోకి తొంగి చూసిన నాకు హాయిగా ఉంది. ఇందాకటి ఆలోచనల్లేవు. ఏదో ప్రశాంతత నన్ను ఆవహించింది. మనస్సంతా ఒక రకమైన సంతృప్తితో తేలిపోయింది.

రాజమండ్రి బస్ కండక్టర్ వచ్చారు. అతన్ని రిక్వెస్ట్ చేసి ఒప్పించి, ఆమెని బస్ ఎక్కించాను యాంత్రికంగానే. ఆమెతో ఇంకేమీ మాట్లాడలేకపోయాను. నేను ఆమె వైపు చూసినపుడు ఆమె మౌనంగానే చేయి ఊపింది.

అంతలో ఆమె మొహంలో చిన్న చిరునవ్వు. "ఉంటానండి..." అని చేయి ఊపింది. బస్ కదిలింది.

జీవన ప్రయాణంలో ఇటువంటి గమ్యాలెన్నో, గమనాలెన్నో! కనిపించే వ్యక్తులెందరో! ఆలోచింపజేసే సంఘటనలెన్నో! మనిషి హృదయపు లోతుల్లోకి వెళ్ళి చూస్తే గానీ వాస్తవాలు బయటకు రావు. ●

# అర్ధాంగులు

అర్ధాంగి అంటే భార్య అని అందరికీ తెలిసిన విషయమే. తెలియాల్సిందల్లా 'అర్ధాంగుల' గురించి.

మా ఇంటి పక్కవాటాలోకి ఓ నడివయసు దంపతులు వచ్చారు. పిల్లాజెల్లా ఎవరూ లేరు కాబోలు... ఎప్పుడూ ఒకర్ని ఒకరు విడువకుండా, అంటిపెట్టుకుని తిరిగేవారు.

బస్తీ మామూలు ప్రకారం - పక్కింటి విషయాలు ఎవరూ పట్టించుకోము కాబట్టి నా అంతట నేనుగా వెళ్లి పరిచయం చేసుకోలేదు. కానీ ఓ కంట వాళ్లని గమనిస్తూనే ఉన్నాను.

మా ఆవిడ రెండు కళ్లతోను గమనిస్తోందన్న సంగతి ఆ సాయంత్రమే తెలిసింది.

“ఏమండోయ్... గమనించారా?” అంది రహస్యంగా.



"ఏమిటోయ్ అదీ?" అన్నాను ఆశ్చర్యంగా.

"వాళ్ళు ఒకరినొకరు ఏమండీ అని పిలుచుకుంటున్నారు..." అంది ఆశ్చర్యంగా బుగ్గలు నొక్కుకుంటూ.

"ఇంతకీ ఎవరు వాళ్లు?" అన్నాను అయోమయంగా చూస్తూ.

"ఊ... మీకెప్పుడూ పరధ్యానమే! అదేనండీ... మన పక్కింట్లోకి కొత్తగా వచ్చిన దంపతులు లేరూ... వాళ్లు!"

'అమ్మ నాపెళ్లమా... నువ్వు కళ్లకేగాక చెవులక్కూడా పని పెట్టావన్నమాట' – అని మనసులో అనుకుని, పైకి తేలిగ్గా చప్పరిస్తూ "ఆ... అదేమంత వింతలే? వాళ్లు రాజులై ఉంటారు" అన్నాను.

ఆవిడ "రాజులా గాజులా! వాళ్లు మనలాంటి మధ్య తరగతి వాళ్లే..." అంది నా ఊహని కొట్టిపారేస్తూ.

"రాజులందరూ కోటీశ్వరులని ఎందుకనుకోవాలి? ఒకప్పుడు బాగా బతికిన వాళ్లై ఉంటారు..."

"అబ్బే... వాళ్లలా కనబడ్డంలా..."

"అయితే... యింతకీ ఏమంటావు?" విసుగ్గా అడిగాను.

"ఏమంటాను? వాళ్ల వెనక ఏదో కథ ఉందంటాను..."

"ఏదో కథ అంటే?"

"అదే... దాంపత్య బంధం కాని మరో బంధం..."

"అంటే అక్రమ సంబంధమా?"

"దానికి మీరేం పేరు పెడతారో మీ యిష్టం! కాకపోతే, నేను పుట్టి బుద్ధెరిగాక పెళ్లాన్ని ఏమండీ... అనే మొగుణ్ని యిదే చూట్టం"

"మనం చూడనంత మాత్రాన ప్రపంచంలో అలాంటివి లేవూ అనుకోవటం అహంకారం అవుతుంది..."

"సరే మనిద్దరం పందెం వేసుకుందాం..."

"ఏమిటది?"

"వాళ్లిద్దరూ భార్యాభర్తలు కాదని నేను... అవునని మీరు... గెలిచిన వాళ్లకి ఓడినవాళ్లు వెయ్యి రూపాయిలిచ్చుకోవాలి..."

"నేనీ పందేనికి వప్పుకోను..."

"ఎందుకని?"

"వాళ్లిద్దరూ భార్యాభర్తలు అవునో కాదో పరిశోధించి తెలుసుకోవాల్సిన అవసరం మనకేమిటి? అందుకు వెయ్యి రూపాయల పందెం కూడా ఎందుకు?"

"అవసరం ఉంది."

"ఏమిటో చెప్పు..."

"వాళ్లిద్దరూ భార్యాభర్తల్లా నటిస్తూ అక్రమ సంబంధం కలిగి ఉన్నారనుకోండి... ఆ విషయం బయట పడ్డరోజున లొకాలిటీలో అందరి కళ్లూ యిటు వైపే ఉంటాయి. మన అందరి వంకా అనుమానంగా చూట్టం మొదలెడతారు – కొందరు యిటువైపు ఆడవాళ్లతో అసభ్యంగా కూడా ప్రవర్తించవచ్చు..."

"అలా ప్రవర్తిస్తే ఎందుకూరుకుంటాం?"

"జరగాల్సిందేదో జరిగాక మనం చేయగల్గింది ఎక్కువ ఉండదు..."

కేళీ

"కాబట్టి...?!"

"ముందు జాగ్రత్త పడటం మంచిది..."

"సరే - నువ్వింతగా చెబుతున్నావు గనుక, వాళ్లెవరో తెలుసుకునేందుకు ప్రయత్నిస్తాను. కానీ అందుకోసం పందెం మాత్రం వప్పుకోను..."

"సరే - మీ ప్రయత్నం మీరు చేయండి. నా ప్రయత్నం నేను చేస్తాను..."

"అలా అన్నావ్ బావుంది..."

అంతటితో ఆ చర్చ ముగిసింది కానీ నాకు కొత్త సమస్య ఎదురయింది. పక్కింటి పెద్ద మనిషితో ఎలా మాటలు కలపటమా అని... ఎలాగైతేనేం ఒకరోజున అవకాశం రానే వచ్చింది.

"మాస్టారూ!" అని పిలిచాడు ఒకరోజు ఉదయం ఆయన.

నేను వెంటనే ప్రసన్నంగా మొహం పెట్టి "చెప్పండి సార్" అన్నాను.

"మీకెవరయినా ఎలక్ట్రీషియన్ తెలుసా?" అనడిగాడు.

"ఇంట్లో ఏదైనా రిపేరుకొచ్చిందా?"

"అవున్సార్. ఫ్యాను తిరగటం లేదు..." అన్నాడు యిబ్బందిగా చూస్తూ.

"నాకు కొద్దిగా మెకానిజం తెలుసు - నేను చూస్తానుండండి" అంటూ వాళ్ల వాటాలోకి అడుగుపెట్టాను. ఫ్యాను పరీక్ష చేసాను. 'కెపాసిటర్' పోయింది. ఆ విషయం చెప్పాను.

"మరెలా?!"అన్నాడాయన నిస్సహాయంగా.

"మరేం ఫర్వాలేదు. సాయంత్రం వచ్చేటప్పుడు కొనుక్కురండి. నేను బాగుచేస్తాను..." అని కాగితం మీద 'కెపాసిటర్' వివరం రాసి యిచ్చాను.

## విజయవాడలో తెలుగు రచయితల మహాసభలు

అక్టోబర్ 27,28,29 తేదీలలో విజయవాడలో తెలుగు రచయితల మహాసభలు జరుగనున్నాయి. కృష్ణాజిల్లా రచయితల సంఘం ఆధ్వర్యంలో జరిగే ఈ సభలలో దేశం నలుమూలల నుంచీ లబ్ధప్రతిష్టులైన రచయితలు, విమర్శకులూ పాల్గొననున్నారు. సభల ప్రసంగాలతో కూడిన 50 ఏళ్ల సాహిత్య సమీక్ష గ్రంథాన్ని ఈ సందర్భంగా ప్రచురించనున్నారు.

ఆంధ్రప్రదేశ్ అవతరణ స్వర్ణోత్సవాల సందర్భంగా 50 ఏళ్ల ఆధునిక తెలుగు సాహిత్య సమీక్షా సమావేశాలుగా ఈ సభలు జరుగనున్నట్లు కృష్ణాజిల్లా రచయితల సంఘ అధ్యక్ష ప్రధాన కార్యదర్శులు శ్రీ గుత్తికొండ సుబ్బారావు, డాక్టర్ జి.వి. పూర్ణచందులు తెలియజేసారు. వస్తువు, రూపం, భాష, నిబద్ధత, ప్రచురణ, ప్రభావం అనే ఆరు అంశాల మీద సదస్సులు జరుగుతాయని వారు తెలిపారు.

సభల నిర్వహణ నిమిత్తం శ్రీ కాలనాథభట్ట వీరభద్రశాస్త్రి ఆధ్వర్యంలో ఒక సన్నాహక సంఘం ఏర్పాటయింది. వివరాలకు 99852 52616, 94401 72642, 94415 18715 లలో సంప్రదించవచ్చు.

"థాంక్స్" చెప్పాడు. నేను మందహాసంతో "దాన్దేముందండీ" అంటూ వచ్చేసాను. అలా మొదలయిన పరిచయం స్నేహంగా మారింది. ఆ కుటుంబంతో నేను సన్నిహితంగా మెలగటం మా ఆవిడకి కంపరంగా ఉంది.

"విషయం కనుక్కోమంటే అలా అతుక్కు పోయారేమిటీ?" అంది చిరాకుగా.

"అతుక్కుపోలేదు,.యిరుక్కుపోలేదు! అయినా నువ్వుచెప్పిన విషయం నిర్ధారించటం అంత తేలికా? ఎంతో సున్నితమైనది. కాబట్టి తొందర పాటు లేకుండా విషయం రాబట్టాలి" అన్నాను.

"ఏదో చేయండి" అంది విసుగ్గా.

ఇక్కడొక ముఖ్య విషయం మీకు చెప్పాలి.

ఈ కొద్దిరోజుల పరిచయంలో నాకు అర్ధమయిన విషయాలు కొన్ని ఉన్నాయి. అవేమిటంటే – అతను ఆవిడని ఆరోప్రాణంగా చూసుకుంటాడు. ప్రతి పనిలోనూ సహాయం చేస్తాడు. విసుక్కోవటం, చిరాకుపడటం, పరుషంగా మాట్లాడటం అనేవి అసలు లేనేలేవు. ఇద్దరి మొహాల్లోనూ ఎప్పుడూ చల్లని మందహాసం కాపురముంటుంది.

అన్నిటికంటే అధికంగా చెప్పుకోవలసింది –వాళ్లు ఒకరినొకరు సగౌరవంగా సంబోధించుకోవటం!

ఇదే మా ఆవిడ అనుమానానికి మూల కారణం.

ఇంతకీ వాళ్లపేర్లు మీకు చెప్పలేదు కదూ?

ఆయన పేరు సుందరం, ఆవిడ పేరు సుందరి. పేర్లు కూడా చక్కగా కలిసిపోయాయి. మనుషులు సుందరంగా లేకపోయినా, మనసులు సుందరంగా ఉన్నాయి. ఎప్పుడూ ఉల్లాసంగా, హుందాగా, ఆత్మీయంగా ఉంటారు.

### అయితే మాదే...

ఈ బంతి మీదేనా? రోడ్డు మీద ఆడుతున్న పిల్లల్ని పిలిచి అడిగాడు ఆనందరావ్.

ఏం అంకుల్... మీ కిటికీ అద్దాలేమైనా పగిలాయా? అడిగాడు గుంపులోని ఓ కుర్రాడు.

లేదు... చెప్పాడు ఆనందరావు.

అయితే ఆ బంతి మాదే... కోరస్‌గా అరిచారు పిల్లలందరూ.

ఇంత మంచివాళ్లని సందేహించటం, వాళ్లమీద పరిశోధన చేయడం తప్పనిపించింది. వాళ్లు నిజంగా భార్యాభర్తలు అయినా కాకపోయినా, భార్యా భర్తల కంటే అన్యోన్యంగా ఉంటున్నారు. అంతకంటే సహజీవన సౌభాగ్యం మరేముంటుంది?

"మీ మేరేజ్‌డే ఎప్పుడు?" అనడిగాను. వాళ్లకో మంచి 'గిఫ్ట' యిద్దామని.

అతను నవ్వుతూ "మాది నిత్యకళ్యాణం" అన్నాడు.

"అదేమిటి?!" అన్నాను ఆశ్చర్యంగా.

"అవును! మా పెళ్లి తిరుపతిలో జరిగింది. అప్పుడే నిర్ణయించుకున్నాం. శ్రీనివాసుడిలా నిత్యకళ్యాణభావనతో, జీవితంలో అన్నీ చెరిసగం పంచుకోవాలని, మొదటి పరిచయం నాటి గౌరవం, చివరి శ్వాస వరకూ కాపాడుకోవాలనీ..."

"మరి మీ పిల్లలు?"

"లేరు! ఆవిడ నాకు బిడ్డ. నేను ఆమెకు బిడ్డని. ఇదే మా జీవనవేదం" అన్నాడు.

నేను చేతులు జోడించాను. ●

మాధుర్య...

మాధుర్యేనా...?

నా కళ్లను నేనే నమ్మలేకపోయాను.

అడుగులో అడుగు వేస్తూ మెల్లగా గుడి చుట్టూ ప్రదక్షిణలు చేస్తున్న మాధుర్యను చూస్తూ ఆశ్చర్యపోవడం నావంతైంది. డిగ్రీ చదివే రోజుల్లో... చిలుకూరు వెళ్లి... బాలాజీ గుడిలో 'ప్రదక్షిణలు చేద్దాం రావే' అంటే సెల్ఫ్ కాన్ఫిడెన్స్ లేనిదే దేవుడు మాత్రం ఏం చేయగలడు?' అని తేలికగా కొట్టి పారేసిన మాధుర్య ఈనాడు ప్రదక్షిణలు ఎందుకు చేస్తోంది?

నాకేం అర్థం కాలేదు. ఆలోచించి బుర్ర వేడెక్కింది.

'మధూ...' - ఎదురెళ్లి పిలిచాను.

మాధుర్య కళ్లల్లో మెరుపు.

కాసేపు ఆగమని సైగ చేసింది.

మా పిల్లలిద్దర్నీ పనిమనిషితో ఇంటికి పంపించాను. చెట్టు క్రింద కూర్చున్నాను.

అసలు మాధుర్యకేమైంది? కళ్లక్రింద నల్లని చారలు. కేన్సర్ పేషెంట్‌లా తయారయింది. మాధుర్య పేరుకు తగ్గట్లే పాటలు మధురం - మాటలు మధురం - నిర్ణయాలు మధురం. డిగ్రీలో కాలేజ్ ఫస్ట్ వచ్చిన మాధుర్య - హఠాత్తుగా పెళ్లి చేసుకుంది.

'అదేమిటి? - పిజి చేయవచ్చు కదా - ఈ పెళ్లి ఏమిటి?' అంటే 'నాన్న ఇష్టమే నా ఇష్టం. మంచి కోడలుగా - మంచి ఇల్లాలుగా ఉండడంలో నాకెంతో ఆనందం ఉంది. మా వారు ఇంజనీరు. బోలెడు ఆస్తి. స్వంత ఇల్లు. ఆడపడుచుల్లేరు. అత్తమామల సేవాభాగ్యం నా అదృష్టం' అంటూ మురిసిపోయింది. అన్నట్లుగానే మాధుర్య అత్తమామల్ని ఎంతో బాగా చూసుకొనేది. అత్తగారు వెంట లేనిదే ఎక్కడికీ వెళ్లేది కాదు. గుళ్లు - గోపురాలు - పార్కులు - సినిమాలు... అందరూ కలిసే వెళ్లేవారు. అందరూ మాధుర్య ఎంతో అదృష్టవంతురాలు అనేవారు.

ఓసారి ఊటీకి వెళ్తున్నట్లు ఫోన్ చేసింది.

'ఆదర్శమహిళా - అత్తగార్ని కూడా తీసుకెళ్తున్నావా? ఉత్తమ కోడలిగా గిన్నిస్‌బుక్‌లోకి ఎక్కాలని ఆశా?' అని అడిగాను.

'ఆవిడ చలికి తట్టుకోలేరు లేకపోతే..." అంటూ నవ్వేసింది.

'సత్యా - సత్యా' మాధుర్య పిలుపుతో నా ఆలోచనలకి అంతరాయం.

'మధూ - ఇన్నాళ్లూ ఎక్కడున్నావు? ఈ ఊరు ఎప్పుడువచ్చారు? చాలా సన్నబడ్డావ్! ఏమైంది నీకు? ప్రశ్నల వర్షం.

'ఇంటికి వెడుతూ మాట్లాడుకుందాం రా' కారువైపు నడకసాగించింది మాధుర్య. అనుసరించాన్నేను.

'బెంగుళూరు నుంచి అహ్మదాబాద్ ఇస్రోకి మావారికి ట్రాన్స్‌ఫర్ అయింది. అక్కడే ఆరేళ్లు ఉండిపోయాం. ఆయనకి ఇక్కడ ఒక పెద్ద కంపెనీలో ఆఫర్ వచ్చింది. ఇక్కడికి వచ్చి ఏడాది అవుతోంది. నీ ఫోన్ నెంబరు లేక నిన్ను కలవలేకపోయాను' అంది మాధుర్య.

కారు పెద్ద బంగ్లా ముందు ఆగింది.

'మీ అత్తగారు - మామగారూ ఎలా ఉన్నారు?' అడిగాను.

'మామగారు పోయారు. అత్తగారు ఏదో అలాగే ఉన్నారు'.

నీలిమ

'పిల్లలు?' ఆగిపోయాను.

'లేరు' మాధుర్య మొహం వాడిపోయింది.

తలుపు తీసుకొని లోపలికెళ్లాం. మాధుర్య వాళ్లత్తగారు మెల్లగా నడుచుకుంటూ వచ్చి కుశల ప్రశ్నలడిగారు. సమాధానాలు చెబుతున్నాను. కానీ ఏదో అలజడి. ఆవిడలో కూడా ఏదో మార్పు.

మాధుర్య లోపలికెళ్లి జ్యూస్ తీసుకొచ్చింది.

'మీ అత్తగారికి కూడా ఇవ్వు' అన్నాను.

'నాకూ ఆవిడకీ ఇక ఏం పని? తినడం - త్రాగడం' అంది విసురుగా. ఉలిక్కిపడ్డాను. నేను వింటున్నది నిజమేనా? అంటున్నది మాధుర్యేనా?

'మీ అమ్మా నాన్నల గురించి చెప్పలేదు' అన్నాను.

'అమ్మ, నాన్నా ఇద్దరూ పోయారు. అన్నయ్య అమెరికాలో సెటిల్ అయ్యాడు. వాడు ఇక్కడికి రాడు. నన్నే రమ్మంటాడు. ఈవిడని వదిలిపెట్టి వెళ్లటం కుదరదు. ఆయనకి ఆఫీసే లోకం. ఎక్కడికి వెళ్లాలన్నా ఈవిడ కారులో కాసేపైనా కూర్చోలేదు. దిగి రెండడుగులు కూడా నడవలేదు. రామేశ్వరం వెళ్లినా శనేశ్వరం తప్పదన్నట్లు ఈవిడతో వెళ్లి అవస్థలు పడలేక వెళ్లడమే మానేసాం'. మాధుర్య మాటలు మధురంగా విన్పించడం లేదు - ఎందుకని?

ఇంతలో కాలింగ్ బెల్ మ్రోగింది. మాధుర్య అటుగా వెళ్లింది.

'మాధుర్య ఎందుకిలా అయింది?' వాళ్లత్తగార్ని అడిగాను.

'పిల్లలు లేరని దిగులు. మంగళ - శని వారాలు కఠిన ఉపవాసం. మిగతా రోజులు ఒక్కపూట భోజనం. తను అలా కృశించిపోతూ ఉంటే చూడడానికే దేవుడు నన్నింకా ఉంచాడు' ఆవిడ కళ్లల్లో నీళ్లు.

మాధుర్య లోపలిరాగానే 'తరువాత కలుస్తాను' అని చెప్పి వచ్చేసాను.

ఇంటికి వచ్చినా మాధుర్య ఆలోచనలు వదలడం లేదు. మాధుర్య వాళ్లాయన సతీష్‌ని కలవాలన్పించింది.

* * *

'సతీష్...' మాధుర్య గురించి చెప్పండి. నాకు తెలిసిన మాధుర్య ఇంతిలా ఎలా మారిపోయింది?'

'పిల్లలు లేరనే బాధలో మాధుర్య ఏం చేస్తోందో తనకే తెలియడం లేదు. తిరగని హాస్పిటల్, మొక్కని దేవుడు లేడు. ప్రాబ్లమ్ తనలోనే ఉందన్నారు. ఆ నిస్సహాయత, ఒంటరితనం మాధుర్యకి అమ్మ మీద ద్వేషాన్ని పెంచుతున్నాయి. ఒక్కోసారి తను తప్పు చేస్తున్నానని ఏడ్చేస్తూ ఉంటుంది' అన్నాడు సతీష్.

'నాకు అర్థమైంది సతీష్! - మాధుర్యని డాక్టర్ వసుమతిగారి దగ్గరికి తీసుకెళ్తాను' అన్నాను.

* * *

నేను, మాధుర్య వసుమతిగారి హాస్పిటల్లో ఉన్నాం. వసుమతిగారు ఇంకో అరగంటలో వస్తారట.

'మధూ - నీవేం అనుకోకపోతే ఓ మాట చెప్పనా?'.

నీవు చాలా తప్పు చేస్తున్నావు. నీవు దేవతలా చూసుకొనే నీ అత్తగార్ని ఎందుకు నీ మాటలతో బాధిస్తున్నావ్? వృద్ధాప్యంలో ఉన్న ఆ పసిమనసు నీకు కన్పించటం లేదా?' అడిగాను బాధగా.

మాధుర్య ఒక్కసారిగా భోరున ఏడ్చేసింది.

ఆ బేలతనం మాధుర్యలో ఎప్పుడూ చూడలేదు.

'మధూ – ఊరుకో... నీ సమస్యకి పరిష్కారం చూపాలనే ఇక్కడికి తీసుకువచ్చాను. నిన్ననే డాక్టరుగారికి నీ గురించి అంతా చెప్పాను. ఏడవకు' అంటూ ఓదార్చాను.

ఇంతలో వసుమతిగారు వచ్చారు. లోపలికెళ్లి పరిచయాలయ్యాక ఆవిడ 'నాతో రండి' అంటూ లేచారు.

హాస్పిటల్లో ఓ ప్రక్కగా ఉన్న ఇంకో బిల్డింగ్ వైపు తీసుకెళ్లారు.

లోపల లేత రోజా పువ్వులా ఉన్న పసిపిల్లలు.

ఉయ్యాల్లో కొందరు – ఆయమ్మలు ఆడిస్తూంటే గంతులు వేస్తున్న ఆ ముద్దు మురిపాల పిల్లల్ని చూస్తున్న మాధుర్య ముఖంలో సంతోషం.

వసుమతిగారు మెల్లగా చెబుతున్నారు.

'నాకు పిల్లలు లేరు. ఇప్పటి పరిజ్ఞానంతో సంతానవంతులు కావడం ఏమాత్రం కష్టం కాదు. హోటల్ రూముని అద్దెకి తీసుకున్నట్లు గర్భాశయాలు అద్దెకు తీసుకుని మరీ పిల్లల్ని పుట్టిస్తున్నారు. అమ్మ, నాన్న అవసరం లేకుండానే పిల్లలు పుట్టే రోజులూ వచ్చాయి. మనం పిల్లల్ని కంటే ఒక్కరికో – ఇద్దరికో మాత్రమే మన ప్రేమని అందిస్తాం. ఈ ప్రపంచంలో కోట్ల మంది అనాధపిల్లలు అమ్మానాన్నల ఆలనా పాలనా లేక అనాధశరణాలయాల్లో, ఫుట్‌పాత్‌ల మీద అలమటిస్తున్నారు. ఇక్కడున్న పిల్లలందర్నీ చేరదీసాను. ఇప్పుడు చూడు... నాకెంత మంది పిల్లలో. "అమ్మా" అని ఒక్కరు కాదు – అందరూ పిలుస్తూంటారు. ఇంతకంటే ఏం కావాలి?'

మాధుర్య మంత్రముగ్ధురాలై వింటోంది.

'మా అత్తగారు, మామగారు, మావారు అందరూ నన్ను వెన్నుతట్టి ప్రోత్సహించిన వాళ్లే' అంటూ గార్డెన్‌లోకి తీసుకెళ్లారు.

దూరంగా డాక్టరుగారి అత్తమామలు పిల్లల ఆటపాటలతో మురిసిపోతున్నారు. ఆ దంపతుల్ని చూస్తూ అలాగే ఉండిపోయింది మాధుర్య.

* * *

ఉదయం 10 గంటలకి మాధుర్య దగ్గర్నుంచి అర్జంట్‌గా వసుమతిగారి హాస్పిటల్‌కి రమ్మని ఫోన్. త్వరగా పనులు ముగించుకొని అర గంటలో అక్కడున్నాను. మాధుర్య నవ్వుతూ ఎదురొచ్చింది. మాధుర్య ముఖంలో కొత్త వెలుగు. లోపలికి వెళ్లాం.

సతీష్ చేతిలో ఓ పాప, వీల్‌ఛైర్‌లో ఓ బాబు, ప్రక్కనే వసుమతిగారు.

'ఏం చేయబోతున్నావు మాధుర్యా?' ఆశ్చర్యంగా అడిగాను. మాధుర్య ఇద్దరు పిల్లల్ని పెంచుకోవాలనుకుంటోంది' – అన్నారు వసుమతిగారు.

'ఇద్దరా? మరి ఈ బాబుకి కాళ్లు...'

అవును సత్యా! బాబు నడవలేడు. నాకు ఈ బాబే కావాలి. వాడికి అన్నీ నేనై ఆ లోపం తెలియకుండా పెంచుతాను' మాధుర్య గొంతులో తెలియని ఆవేశం – ఆనందం.

సతీష్, మాధుర్య, నేనూ పిల్లలతో కలిసి బయటికి వస్తున్నాం.

'అన్నయ్యా – నీకు తెలుసా? నేను ఓ పాప, బాబు, మా అత్తగారితో కలిపి ఒక్కసారిగా ముగ్గురు పిల్లల తల్లినయ్యాను'.

ఫోన్‌లో వాళ్ల అన్నయ్యతో మాట్లాడుతున్న మాధుర్య కంఠం నాకు మధురంగా విన్పించింది. ●

ఆడ, మగ కూలీలు మన్ను తవ్వి, గమే ళాల్లోకెత్తి రోడ్డు కవతల పోస్తున్నారు. వాళ్ల ముఖాల నుంచి చెమట ధారలుగా జారి పడుతోంది. కొన్ని ఉద్యోగాలయితే బట్టలు నలగకుండా, ఒళ్లు అలియకుండా, మేకప్ చెదిరిపోకుండా ఫ్యాను క్రింద కూర్చుని కబుర్లు చెబుతూ కాలక్షేపం చేసినా నెలయ్యేసరికి కొన్ని వేల రూపాయలు చేతిలో పడతాయి. ఫైళ్ల మీద రాయడానికే అలసిపోయినట్లు, కొండంత భారం మోస్తున్నట్లు తెగ బాధ పడిపోతూ, రిలాక్సేషన్ కావాలని పదిసార్లు అటూ ఇటూ తిరుగుతూ, టీ తాగుతూ కాలం గడిపేస్తారు. మరి ఈ కూలీలు ఒక్క క్షణం సేదతీర్చుకునేం దుకు ఆగితే మేస్త్రి ఊరుకోదు, యజమాని సహించడు.

యాదమ్మ ఉస్సురంటూ కూలబడి చీర చెంగుతో ముఖం తుడుచుకుంది. మిట్టమధ్యా హ్నం. అంతా కాళ్లూ చేతులూ కడుక్కొని క్యారే జీలు విప్పసాగారు. ఎండ నిప్పులు చెరుగుతోం ది. పేగులు అరుస్తున్నాయి. యాదమ్మ మూట విప్పి గిన్నెమూత తీసింది. చూపు మసకబారు తోంది. ఓపిక సన్నగిల్లుతోంది. ఆకలి బాధ కన్నా కొడుకు దూరంగా వెళ్లిపోయాడన్న బాధ తినేస్తోంది. 'ఆడూ యాడనే ఉండి ఏదో పని చేసుకుంటే తనకి తోడుగుండేవోడు. కోడలింత ఉడకేసి పడేసేది. సుధ తొలి తనని బాగనే సూసేది. ఆనకేటయిందో సిరమురలాడేది. ఏమాటకామాటే అనుకోవాల. సుధ పప్పుశారు బాగా చేస్తది. అదంటే తనకి సేన యిట్టం. హు... దేనికయినా పేప్తముండాల' అనుకొని నిట్టూర్చింది.

* * *

కొడుకు మాటలు విని కొయ్యబారిపోయిం ది యాదమ్మ. తన కొడుకేనా యిట్టా మాట్లా దేది? ఏటయిందీడికి? "ఒరే పెబా నేనిన్నది నిజంకాదని సెప్పరా?" కొడుకు ముఖంలోకి ఆశగా చూస్తూ అడిగింది.

"లేదమ్మా... నిజంగానే అన్నానమ్మా"

యాదమ్మ గుండెలో సన్నగా బాధ. ఆమె కళ్లలో నీటిపొర. "ఒరే నాయనా, నేనా పెద్ద దాన్నయాను. సూపు సరిగా ఆనదు. బగమం తుడి దయవల్ల ఏదో కష్టపడ్తన్నాను. నన్నొగ్గి ఎల్లిపోతావా? నేనెట్టా బతికేదిరా? అమ్మా సుధా నువ్వయిన సెప్పమ్మ" బతిమాలింది. సుధ మాట్లాడలేదు. ఆశచావక యాదమ్మ "ఓరి నా ముద్దుల కొడకా, పోనీ ఓ పిల్లోడినయిన నా కాడ ఉంచరా. కసింత తోడుగుంటడు" అంది. మొగుడెక్కడ ఒప్పేసుకుంటాడోనని సుధ ప్రభా కర్ ముఖంలోకి తీక్షణంగా చూసింది. ఆ చూపు యాదమ్మ దృష్టిని తప్పిపోలేదు. "లేద మ్మా ఎల్లాల. ఈలున్నపుడు ఒస్తునే ఉంటాం" ప్రభాకర్ సమాధానంతో యాదమ్మ ప్రాణం విలవిల్లాడింది. కొడుకంటే ఆమెకి ప్రాణం. ప్రభాకర్‌కి భార్య మాట వేదం. యాదమ్మకి తనీ ప్రపంచంలో ఒంటరిననిపించింది. తన పేగు తెంచుకొని పుట్టిన కొడుకు. ఆడే అంతా అని నమ్ముకున్న ఒక్క కొడుకూ పెళ్ళాం కొంగట్టుకొని ఊరొగ్గేసి, తన్నొగ్గేసి యెల్లిపోత న్నాడు.

కొడుకు, మనవలు, కోడలు ఎల్లిపోతుంటే యాదమ్మ గుండె బరువెక్కింది. మనవలను ముద్దెట్టుకుంది. వాళ్లు వెళ్లినవైపు చూస్తూ ఎంత సేపలా నిల్చుందో తెలియదు. రెండిళ్లవతల ఉన్న గౌరమ్మ పిలిచేవరకూ ఏదో ఆలోచనలో ఉంది. "ఏటి యాదమ్మా, కొడుకు కోడలు పిల్లలతో యాడకెల్తన్నారు" గౌరమ్మ ప్రశ్నకు

వి.ఎస్.ఆర్. మౌళి

యాదమ్మ ఖోరుమంది. కాస్సేపటికి తెప్పరిల్లి విషయం చెప్పింది. గౌరమ్మ కాస్సేపక్కడుండి యాదమ్మను ఓదార్చి వెళ్లిపోయింది.

*    *    *

యాదమ్మకి తన పాత రోజులు గుర్తొచ్చాయి. అప్పుడు పెనిమిటి సూరయ్యా బతికున్నాడు. సూరయ్యకి పెద్ద సంపాదన లేకపోయినా ఏనాడూ యిబ్బంది పడకుండా హాయిగానే గడిపేవారు. ఏదో పనిచేసి కొద్దో గొప్పో తెచ్చేవాడు. తృప్తిగా ఉండేది. తనకు యిద్దరు మగ పిల్లలు. ఒకాడ పిల్ల పుట్టినా ఎక్కువ కాలం బతకలేదు. చివరికి ప్రభాకర్ పుట్టాడు. ఆడ్ని అల్లారుముద్దుగా పెంచింది. ప్రభాకర్ బొద్దుగా బాగుండేవాడు. ఆడంటే సూరయ్యకీ ప్రేమే. కొడుకు సెనంకూడా తన్నొగ్గేవోడుకాదు. తను అప్పుడప్పుడు పనిసేసి కుసింత డబ్బులు తెస్తుండేది. నాలుగు డబ్బులు చేతిలో పడగానే సూరయ్యకి తాగుడలవాటయింది. అది తన కిట్టం ఉండేది కాదు. తనకి సేన బాధ కలిగింది. "ఏటయ్య కొత్తగా తాగొత్తన్నావు. నీకేటయినాది" యాదమ్మ మాటలు సూరయ్య తేలిగ్గా తీసుకున్నాడు. యాదమ్మ ఊరుకోలేదు. "ఇదిగో నిన్నే... అంతుసారుగుందేటా ఎదవమందు. ఉన్న యీ ఒక్క నలుసుగాడ్ని సదివించుకుంటే, ఆడికి నాలుగచ్చరం ముక్కలొత్తే ఆడి బతుకాడు బతుకుతాడు" అంది.

"ఎహె... ఏటే నీ గోల?"

యాదమ్మ ఆశ్చర్యపోయింది. అంతకంటె రెండింతలు బాధపడింది. తనమావేనా యిట్టా మాట్టాడుతున్నాడు? ఏటయిందీడికి?

"అయినా నీకీ పాడలవాటేటి, బంగారం లాటోడివి. బతుకు బుగ్గిసేసుకుంటన్నావు".

"నోరుముయ్యేహె. ఒక్కపాలి ఏదో కసింత ఏస్కున్నాను"

యాదమ్మ తగ్గలేదు. "ఈయేల ఒక్కపాలే అంటావు. రేపటి నుంచి అదే అలవాటయిపోద్ది" అపుడింకేదో సెబుతావు" అంది.

సూరయ్యకి చిర్రెత్తిపోయింది. "అవునే... తాగుతానే... నా యిట్టం" అన్నాడు. అన్నట్లుగానే సూరయ్య రోజూ తాగొస్తున్నాడు. యాదమ్మ కొడుకుని పట్టుకొని ఏడుస్తోంది. సూరయ్య రానురాను ఇంటి విషయం పట్టించుకోవడం మానేశాడు.

"ఇదిగో నిన్నే... ఇంట్ల బియ్యంలేవు. జావ కాద్దామంటే నూకలు కూడా లేవు" అంది యాదమ్మ.

"ఏటి బియ్యంలేవా... అపుడే అయిపోనాయేటి... సెత్... ఇయ్యాల బొమ్మిడాలు సింత సిగురెట్టి సెయ్యి" అన్నాడు ముద్దగా.

"ఏటి సెన్నల్లో సెట్లు మొలిచినయ్యా. దరిజాసెవాయిస్తన్నావు... బియ్యం లేవురో మొగుడా అంటే రుసులు కావాలా? ఓయబ్బ! తెచ్చిన డబ్బంత తాగి తగలేసి కూడు బుక్క డానికి కొంపకొచ్చి పీకలనింద తిని తొంగుంతన్నావు. పెల్లం, బిడ్డలేటి తిన్నారో లేదో నీకేటవసరంలేదు" అంది యాదమ్మ.

సూరయ్యకి సురసురమంది. యాదమ్మకి నాలుగుతగిలించాడు. యాదమ్మ ఏడుపులంకించుకుంది. ప్రభాకర్ బెంబేలెత్తి తనూ ఏడవసాగాడు. యాదమ్మకి పెబుత్వం మీద కోపమొచ్చింది. కల్లు, సారా, అయేయో మందు లమ్మే వాళ్ళ మీద ఉక్రోషం కలిగింది. అయినా

> మానవుని తొడలోని ఎముక
> కాంక్రీట్ కంటే గట్టిగా ఉంటుంది




ఏం చేయగలదు తను? "ఓర్నాయనో నేనేటి సేద్దునో. ఈ ముదనట్టపు మందు సుబ్బరంగ వున్నోల్లని రాచ్చసులుగ సేస్తంది. ఈల్లేమో తాగి ఇల్లు గుల్లసేస్తన్నారు" అంది ముక్కు చీది. ప్రభాకర్ భయం భయంగా తల్లిని వాటేసుకొని బిక్కుబిక్కుమంటూ చూస్తున్నాడు.

అటుగా వచ్చిన గౌరమ్మ యాదమ్మని చూసి ఎందుకేడుస్తున్నావని అడిగింది. యాదమ్మకి తలకొట్టేసినట్లయింది. ఏంసెప్పాల. యాదమ్మ చెప్పింది విని గౌరమ్మ "నే రేసను షాపుకి పోయొచ్చిన. బియ్యం లేవట, కిరసనాయలు లేదట, నీకాడుందేమో అడుగుదామని ఒచ్చిన" అంది.

యాదమ్మ "నా కాడా? ఆడి జిమ్మడ. తెచ్చిన కూలి డబ్బులు తాగడానికే తగలేస్తంటే సరుకులు యాడకెల్లి తేవాల? నానీ సంసారం ఎలా సెయ్యాల?" అంది. ఎలచ్చన్లపుడు అది సేత్తాం యిది సేత్తాం అని ఓటేయించుకుం టారు మాయదారోల్లు. మన బతుకులు అద్దా న్నమయిపోనాయి" అంది గౌరమ్మ.

* * *

తెల్లవారేసరికి ఆ వార్త గుప్పుమంది. ఎవరి నోటవిన్నా అదే విషయం. రాత్రంతా భర్త రాకకోసం చూసిన యాదమ్మకి ఏ తెల్లవారు ఝామునో కాస్త కునుకు పట్టింది. బయట అలికిడికి లేచి వచ్చింది. గౌరమ్మ గుండెలు బాదుకొంటూ ఏడుస్తోంది. ఇంతలో ఓ వ్యాను వచ్చి ఆగింది. అందులో నుంచి ఒకయిదుగుర్ని మోసుకొనితెచ్చి పడేశారు. వారిలో సూరయ్య శవం, గౌరమ్మ భర్త శవం ఉన్నాయి. అంతా గొల్లుమన్నారు. రాత్రి వాళ్లంతా చిత్తుగా తాగేరు. వాళ్లు తాగింది కల్తీ సారా కావడంతో వాంతుల యితే హాస్పిటల్‌లో చేర్చారు. కానీ అప్పటికే పరిస్థితి విషమించింది. ఒక్కరూ బతకలేదు. ప్రభాకర్ తల్లి వద్దకు పరిగెత్తాడు యాదమ్మ వాడ్ని పట్టుకొని "ఒరే నాయినా సూద్రా... మీ అయ్య ఎంత గోరం సేసినాడో. ఈ దిక్కుమాలి న తాగుడు మీ అయ్యని సంపేసిందిరా" అంది

వెక్కుతూ. ప్రభాకర్ రాగం ప్రారంభించాడు. ఆ దృశ్యం చూసి అక్కడి వారి గుండె ద్రవించి పోయింది.

*　　*　　*

భర్తపోయినప్పటి నుంచీ యాదమ్మ కొడుకుని మరీ ముద్దుగా, ప్రేమగా పెంచింది. తనకి శక్తున్నంత వరకూ ఆ ఊర్లోనే చదివించింది. తన మంచితనంతో ఓ పెద్ద యింట్లో పని సంపాదించింది. కొడుక్కు ఓ ప్రయివేట్ ఆఫీస్‌లో అటెండర్ ఉద్యోగం వేయించింది వాళ్లనీ వీళ్లనీ బతిమాలి. ఓ పిల్లను చూసి కొడుక్కి పెళ్లి చేసింది. ఇద్దరు కొడుకులు పుట్టేవరకూ సుధ అత్తగారిని బాగానే చూసింది. క్రమంగా సుధలో మార్పు రాసాగింది. అత్తని చులకన చేయసాగింది. భార్య తన తల్లిని తిడుతున్నా, అవమానిస్తున్నా ప్రభాకర్ పట్టించుకోలేదు. భార్యని మందలించలేదు. సుధ అత్తకి తిండి కూడా సరిగ్గా పెట్టడం లేదు. యాదమ్మ మనస్సు చివుక్కుమంది. తనకి ఏదో తినాలని జిహ్వ లాగుతున్నా కోడలినోటికి జడిసి ఊరుకునేది. ఇపుడున్నపళంగా కొడుకు నిర్ణయం విని విలవిల్లాడింది యాదమ్మ మనసు.

*　　*　　*

గతం నుంచి బయటపడింది యాదమ్మ. చైత్రమాసం ఎండ వేపుకు తింటోంది. అపుడపుడూ వస్తూంటామని చెప్పిన కొడుకు జాడ లేదు. యాడున్నాడో తెల్దు. రోజూ ఒస్తాడని చూస్తోంది. పనిమీద ధ్యాస లేక సరిగా చేయలేకపోతుంటే పన్లో నుంచి తీసేసారు. కుడి పాదం మీద కురుపు లాగేస్తోంది. కాలంతా ఒకటే బాధ. ఏవో పసర్లు, అదీ యిదీ పోసింది. బాధ తగ్గలేదు. కాలు వాచింది. ఒకటే సలుపు, పోటు. ఆ రోజు ఇద్దరు నర్సులు, కొంతమంది సిబ్బంది ఏవో మందులు తీసుకొని వీధివీధీ తిరుగుతున్నారు. పోషకాహారం, ఆరోగ్య రక్షణ గురించి ఏవో సలహాలు చెప్తారట. వాళ్లు ఏవో మాత్రలు యిచ్చి, పోషకాహారం బాగా తినాలని ఉచిత సలహాలు చెప్తున్నారు.

"అంటే ఏటి?" అడిగేరు కొందరు.

"మీ ఆరోగ్యం బాగుండాలంటే ఫలానా ఆహారం తినాలి. వాటిలో విటమిన్లుంటాయి"

## నిత్య రక్తదానం

"మా పార్టీవాళ్ళు రేపు రక్తదానం శిబిరం ఏర్పాటు చేశారు. మీరు కూడా రావాలి! వచ్చి రక్తదానం చేయాలి" – అన్నాడు ఓ పార్టీవాడు ఓ అప్పారావుతో.

"నేను నిత్యం రక్తదానం చేస్తున్నాను. మా పేటలో దోమలు ఎక్కువ! వున్న రక్తం వాటికే సరిపోవడం లేదు! మీ శిబిరంలో ఏం ఇవ్వమంటావ్?" అని అడిగాడు అప్పారావు.

పార్టీ మనిషి మరోమాట మాట్లాడకుండా వెళ్ళిపోయాడు.



ఏదేదో చెప్పుకుపోతున్నారు. ఓ యువకుడు ఫకాల్న నవ్వాడు. అంతా నవ్వసాగారు.

"బలేవోరండి. మేం అన్నం తిని ఎన్నాళ్ళయిందో తెల్సా? ఓ పూట తిండి దొరికితే రెండు రోజులు తిండే ఉండదు. మీరు సెప్పినవెట్ట గొస్తయి?" అన్నాడాయువకుడు. "ఇవన్నీ మాకెందుగ్గాని, మా కడుపుకి బువ్వ గావాల. పెడతారా బాబూ?" అడిగాడో వృద్ధుడు. నర్సులు, సిబ్బంది ముఖాలు చూసుకున్నారు. వాళ్లలో వాళ్లేదో మాట్లాడుకొని తిరుగుముఖం పట్టారు.

యాదమ్మ నిలబడాలని ప్రయత్నించింది. ఆకలి, దాహం. అతికష్టం మీద తడబడుతూ ఒక్కొక్క అడుగూ వేయసాగింది. అడుగుతీసి అడుగు వేయడం గగనమవుతోంది. కాలు రివ్వున లాగేస్తోంది. ప్రాణం కదంటిపోతోంది. ఆయాసంతో రొప్పుతోంది. యాదమ్మ ఓ యింటి ముందాగింది. "తల్లీ పేనం లాగేస్తంది. కసిన్ని గంజినీళ్లు పొయ్యమ్మా" అరిచింది లేని శక్తిని తెచ్చుకొని. ఆ కంఠంలో వేడికోలు, వేదన హృదయమున్న ఎవరికయినా జాలి కలిగిస్తాయి. తలుపులు తెరచి ఉండడం వల్ల లోపలేం జరుగుతున్నదీ రోడ్డుమీదకి కనిపిస్తోంది. ఆ యింటి ఇల్లాలు కూతురికి భోజనం పెడుతోంది. లోపల నుంచి వేడి ఉల్లిపాయ పులుసు వాసన ముక్కుకి తాకడంతో యాదమ్మ ఆకలి రెట్టింపయింది. లోపల కంచాల చప్పుడు. యాదమ్మ కడుపులో పేగుల అరుపులు. ఆశగా లోనికి చూస్తోంది. తల్లి "ఒసే... ఇదిగో ఈ తెలకపిండి ముద్దనంజుకో. సేనా బాగుంటది" అంటూ కంచంలో వేసింది. యాదమ్మ జిహ్వా లాగేస్తోంది. అభిమానం చంపుకొని మళ్లీ అడిగింది. ఆ యింటి ఇల్లాలు కసిరి దభీమని తలుపు మూసింది. యాదమ్మ మనస్సు చివుక్కుమంది. తను అడుక్కు తినేదా?

యాదమ్మ ఈంౘ పడుతూ అడుగులేస్తోంది. ఒళ్లంతా నొప్పులు. కడుపుమంట, ఓ ప్రక్క కాలుమంట. మరో వైపు గొంతెండిపోతోంది. నరాలు లాగేస్తున్నాయి. నాలుక పీక్కుపోతోంది. కళ్లు తిరుగుతున్నాయి. తనింటికేసి ఒక్కొక్క అడుగు వేస్తోంది. ప్రక్కనే ఉన్న పేడ కుప్ప నుంచి చేతి నిండా పేడ తీసి మండుతున్న పుండు చుట్టూ రాసింది. చల్లగా అనిపించింది. మెల్లగా యిల్లు చేరి అరుగుమీద కూర్చొని గోడకి చేరబడి కళ్లు మూసుకొంది.

నీరసంగా కళ్లు తెరిచిన యాదమ్మకి తనింట్లో ఎవరో ప్రవేశించినట్లనిపించింది. తనింట్లో దొంగ ప్రవేశించాడా? అయినా తనకాడేటుంది? తినడానికి బువ్వే లేదు. నీరసంగా నవ్వుకుంది. కొడుకు, కోడలొచ్చారు. మరి మన వాల్ని తీసుకొచ్చేరా? అల్లెంత పెద్దోల్లయ్యేరో? ఎవురూ అవుపడరేటి? చెవులు రిక్కించింది. ఆ సప్పుదు వంట గది నుంచే. సూపంటే మందగించింది. సెవుదు రాలేదు. ముక్కెగబీల్చింది. పప్పులుసు వాసన లాగుందే... నోరూరింది. తన కోడలికి తనంటే ఎంతపేమ? మరికాసేపట్లో సుధ తనని బువ్వ తినడానికి పిలుస్తుంది. ఇంక ఆగలేమన్నట్లు పేగులరుస్తున్నాయి.

అయినా తన పిచ్చిగాని తనకర్మకి తన్నొగ్గే సెల్లిపోయిన కొడుకు, కోడలు యింతదాకా ఒక్కపాలయినా రాలేదు. ఓ కారుదుముక్కయినా రాయలేదు. అసలెక్కడున్నారో, ఆడి కోసం ఎదురు సూసిందే గానీ ఆడికి తనక్కర్లేదు. యాదమ్మ ఎండిన పెదాలమీద శుష్కమైన చిరునవ్వు. ఆ నవ్వులో జీవం లేదు, మెరుపు లేదు. ఆమెకి చాలా అస్థిమితంగా ఉంది. నిస్త్రాణగా పక్కకి వాలిపోయింది. ●

"ప్రపంచ ఆరోగ్య సంస్థ – ప్రపంచ ఆరోగ్యదినం సందర్భంగా టోక్యోలో నిర్వహిస్తున్న కేర్ ఆఫ్ ది టెండర్ హార్ట్స్" సెమినార్ ప్రారంభ సభ ప్రత్యక్షప్రసారం... కొద్ది క్షణాల్లో" టి.వి. ఎనౌన్స్‌మెంట్.

హిందూ దేశస్థులకు అది ఒక ప్రత్యేక దినం. కారణం... ఆ సెమినార్‌కి కీనోట్ అడ్రస్ ఇస్తున్నది భారతీయుడు. పైగా తెలుగు బిడ్డ.

తన స్వంత కొడుకు... ఒక్కగానొక్క కొడుకు. వెయ్యి పౌర్ణమి చంద్రులను చూసిన డాక్టర్ రమణారావుకి మరింత గర్వకారణం.



టి.వి.కి దగ్గరగా కూర్చున్నాడు. కరెంట్ పోకూడదని దేవుళ్లందరికీ మొక్కుకున్నాడు.

ముఖ్య అతిధులు, వక్తలు వేదికపైకి వచ్చారు. వారు వస్తున్నప్పుడే పరిచయ వాక్యాలు చకచకా జరుగుతున్నాయి.

డాక్టర్ ఆనంద్... ఆనంద్ వచ్చాడు. తనకు నిర్దేశించిన స్థలంలో కూర్చున్నాడు. రమణారావు కళ్ళు పెద్దవి చేసుకుని మరీ చూసాడు. వేయి కళ్ళతో చూసాడు. నిజం చెప్పాలంటే... కొడుక్కి నరదిష్టి తగలకూడదని దేవుడ్ని ప్రార్థించాడు.

ఒకరి వెనుక ఒకరు... పరిచయ వాక్యాలు... చిన్న చిన్న ఉపన్యాసాలు... చకచకా జరిగిపోయాయి.

"కీ నోట్ అడ్రస్ - డాక్టర్ ఆనంద్‌ని పరిచయం చేయవలసిన అవసరం లేదు. ఆయన వైద్యరంగంలో ముఖ్యంగా - పసిపిల్లల హృదయవ్యాధులు - శస్త్ర చికిత్సలలో నిష్ణాతులని అందరికీ తెలుసు. అటువంటి ప్రపంచ ఖ్యాతి గడించిన డాక్టర్ ఆనంద్‌ని కీనోట్ అడ్రస్ ఇమ్మని ఆహ్వానించడానికి నేనెంతో గర్వపడుతున్నాను. డాక్టర్ ఆనంద్..." అని సభాధ్యక్షుడు డాక్టర్ ఆనంద్‌ని పరిచయం చేయడంతో అంత వరకూ నిశ్శబ్దంగా ఉన్న హాలు కరతాళ ధ్వనులతో మారుమోగింది.

"సభస్ప్రృతులను సుమారు మూడు దశాబ్దాలు వెనక్కి తీసుకువెళ్ళాడు డాక్టర్ ఆనంద్.

"సుమారు మూడు దశాబ్దాల క్రితం డాక్టర్ స్టీవ్ బెర్నార్డ్ గుండె మార్పిడి చేసి - మనల్ని అందర్నీ ఆశ్చర్యచకితులను చేసాడు. మరణించిన ఒక వ్యక్తి హృదయం మరొకరి శరీరంలో పనిచేసింది. అతనికి పునర్జన్మ ఇచ్చింది... ఓపెన్ హార్ట్ సర్జరీ మామూలు అయిపోయింది. ప్రపంచంలో నుంచి పోలియో ఇంచుమించుగా నిర్మూలించబడింది. అది వైద్య రంగంలో కేవలం చరిత్రలో ఒక పుటగా మిగిలింది. ఎయిడ్స్ కి ప్రస్తుతానికి మందులు లేవు. ఉన్నాయి కానీ పూర్తిగా ఎఫెక్టివ్ కాలేదు. రాకుండా చేసుకోవడానికి తీసుకోవలసిన జాగ్రత్తలు మనకు తెలుసు. ఈ రోజు కాకపోతే రేపు మందులు కనుక్కుంటారు - వాక్సీన్ తయారుచేస్తాం.

పెద్ద వారిలో ఈ వ్యాధులు చాలావరకూ మన అజాగ్రత్త వల్లే వస్తాయి. ఆరోగ్యకరమైన వ్యాయామం - ఆహారం ముఖ్యం.

దయాబెటిస్‌ని అదుపులో పెట్టుకోవచ్చు - హృదయరోగాలు రాకుండా జాగ్రత్త పడవచ్చు. తీసుకోవలసిన జాగ్రత్తలు తీసుకుంటే సగం పైగా వ్యాధులు వాటంతట అవే మాయమైపోతాయి. బహుశా అపుడు ఇంతమంది వైద్యుల అవసరం ఉండదేమో?

సభలో సన్నగా నవ్వులు.

మనం ఈ రెండు రోజులూ చర్చించేది - మాట్లాడేదీ వీటితో సంబంధం లేని విషయం.

మనం విశేషంగా చర్చించేది - పసికందులకు పుట్టుకతోనే వచ్చే హృదయ సంబంధమైన వ్యాధులు, లోపాలు.

పసికందులు హృదయ వ్యాధులతో - లోపాలతో జన్మిస్తే దానికి కారణం ఎవరు? పెద్దలు అజాగ్రత్త వల్ల వ్యాధులు కొని తెచ్చుకుంటారు. కానీ పిల్లలు... పుట్టుకతోనే అలా జన్మిస్తే వాళ్లను మనం ఎలా కాపాడాలి? దానికి మనం ఏం చేయగలం. వీటికి ఇంకా దూరంగానే

ఆనందకృష్ణ

ఉన్నాం. ఒక పక్క వయసు మళ్లినవారు - పూర్తిగా జీవితాన్ని అనుభవించినవారు, రెండో ప్రక్క తల్లి ముఖం కూడా సరిగా చూడలేని, రోజుకి 20 గంటలు పైగా కళ్ళు మూసుకునే ఉండే పసివాళ్లు. ఈ రెండిటికీ ఎంత తేడా ఉంది వైద్యంలో?

ఈ రంగంలో కూడా మనం పురోగమిస్తు న్నాం. కేవలం రోజుల వయసు గల చిన్న పిల్ల లపై విజయవంతంగా శస్త్ర చికిత్సలు చేసాం. కేవలం ఏడునెలలైనా తల్లి గర్భంలో ఉండ కుండా ప్రసవించబడిన - కేవలం 640 గ్రాముల బరువు... ఛాతీ కేవలం మన అర చేయి అంత... హృదయం ద్రాక్షపండుతో సమా నం... విజయవంతంగా శస్త్ర చికిత్స చేసాం. రెండు రోజులు, 15 రోజులు - ఇలా ఎన్నో ఎన్నో కేసులున్నాయి.

అయితే చిన్న పిల్లలు కంజేనిటల్ హార్ట్ డిఫెక్ట్స్‌తో ఎందుకు పుడతారు? అనేది నిర్ధారణ గా చెప్పలేం. మనకు తెలిసిన కారణాలకంటే తెలియనివే ఎక్కువ. కంజేనిటల్ హార్ట్ డిఫెక్ట్‌తో పిల్లలు ఎందుకు పుడతారు? మనకు తెలిసిన కొన్ని కారణాలు - పసిపిల్ల అసాధారణమయిన క్రోమోజోమ్స్ - 3 నుంచి 5 శాతం, జీన్ డిఫెక్ట్స్ 3-5 శాతం, నివసిస్తున్న వాతావర ణం, పరిస్థితులు 4 శాతం, పిల్ల తల్లిగర్భంలో ఉన్నప్పుడు తల్లి తీసుకున్న కొన్ని మందుల ప్రభావం కూడా ఉంటుంది అని నా అనుమా నం - అంటే మనకు తెలిసిన కారణాలు 10 -20 శాతం, తెలియనివి 80-90 శాతం.

పిల్ల తల్లిగర్భంలో ఉన్నప్పుడు 18-22 వారాల మధ్య అవసరమనిపిస్తే ఫీటల్ ఎకో కార్డియోగ్రఫీ ద్వారా హృదయ పెరుగుదలలో ఏమైనా లోపాలుంటే తెలుసుకోగలుగుతున్నాం - సరి చేయగలుగుతున్నాం - నమ్మశక్యం గాని పరిస్థితుల్లో పసికందుల జీవితాల్ని కాపాడ గలుగుతున్నాం.

అయితే సి.హెచ్.డి. విషయంలో ఇంకా చేయవలసింది చాలా ఉంది. మనం మొదటి దశలోనే ఉన్నాం.

పిల్లల హృదయాలపై మనం చేసిన విజయ వంతమైన, క్లిష్టమైన శస్త్ర చికిత్సలు చూసి మురి సిపోవద్దు. ఈ సెమినార్‌కి మహామహులు హాజ రవుతున్నారు. దిగ్గజాలు వచ్చారు - వాళ్ల అను భవాలు తెలుసుకుందాం. అభిప్రాయాలు తెలు సుకుందాం... మన ఆశయం ఒకటే - సిహెచ్ డి నిన్నటి చరిత్ర కావాలి. చరిత్రలో ఒక పుట గా మార్చేద్దాం... ప్రపంచంలో రేపు ఏ పసికం దూ సిహెచ్‌డితో జన్మించకూడదు. అదే మన ధ్యేయం - మన లక్ష్యాన్ని సాధిద్దాం".

అరగంట సేపు అనర్గళంగా మాట్లాడి, తన కీనోట్ అడ్రస్ పూర్తి చేసాడు. అంతవరకూ నిశ్శబ్దంగా స్పీచ్ విన్నవాళ్లందరూ నిలుచుని కరతాళ ధ్వనులు చేసారు గౌరవసూచకంగా.

"ఇంతవరకూ ప్రపంచ ఆరోగ్య సంస్థ - ప్రపంచ ఆరోగ్యదిన సందర్భంగా టోక్యోలో నిర్వహిస్తున్న "కేర్ ఆఫ్ ది టెండర్ హార్ట్స్" సెమినార్ ప్రారంభసభ ప్రత్యక్షప్రసారం చూ సారు".

టి.వి. ఆపేసారు డాక్టర్ రమణారావుగారు.

వెంటనే ఫోన్ చేసారు డాక్టర్ రాజారావుకి. వారిద్దరూ ప్రాణ స్నేహితులు - డాక్టర్లు. ఇంచు మించు పక్కపక్క ఇళ్లే. ఇద్దరికీ ఒక్కొక్క కొడుకే. వాళ్లూ డాక్టర్లే. రమణారావు కొడుకు ఆనంద్ పిడియాట్రిక్ కార్డియాలజిస్ట్, సర్జన్. రాజారావు కొడుకు శేఖర్ హార్ట్ సర్జన్.

"ప్రోగ్రామ్ చూసావా?"

ఒరేయ్! ఆనంద్ నీకు కొడుకైతే - వాడు నా ప్రాణ స్నేహితుడి కొడుకు. ఎలా మర్చిపోతాను? - అసలు అక్కడికే వద్దామనుకున్నాను - కానీ మనం ఇద్దరం ఒక చోట చేరితే... మనం చూడం - రెండోవాడిని చూడనియ్యం. ఇపుడే వస్తున్నాను. మాట్లాడుదాం".

పది నిమిషాల్లో వచ్చారు డాక్టర్ రాజారావు.

"ఏడీ శేఖర్ రాలేదా?"

"లేదురా. వాడు ఊళ్లో లేడు. మిస్ అవుతాడేమోనని వాడి కోసం రికార్డ్ చేసాను"

"మనం గర్వపడేలా చేసాడు - మనవాడు" ఆనందంతో కారిన కన్నీళ్లు రాజారావుగారి కళ్ళజోడుని మసకగా చేసాయి. కళ్లజోడు తీసి తుడుచుకున్నాడు.

స్నేహితులు ఇద్దరూ కౌగలించుకున్నారు - వాళ్ల సంభాషణ ఆనంద్, శేఖర్ చిన్నతనం రోజులూ, వాళ్ల అమ్మలు వాళ్లను పెంచిన తీరు, మెడికల్ కాలేజి చదువు ఒకటేమిటి...

"ఆనంద్‌కి ఫోన్ చేసి మాట్లాడుదాం" రమణారావు మాటకు "ఇప్పుడేగా అయ్యింది... బిజీగా ఉండి ఉంటాడు. కొంచెం సేపు ఆగి చేద్దాం" రాజారావుగారి జవాబు.

మరొక అరగంట జరిగింది. ఇక ఆగలేకపోయాడు.

ఆనంద్ కాంటాక్ట్ నంబర్‌కి ఫోన్ చేసాడు రమణారావు.

"సారీ సార్ ఆయన ప్రెస్ కాన్ఫరెన్స్‌లో ఉన్నారు. డిస్టర్బ్ చేయలేను"

"నేను ఆనంద్ తండ్రిని"

ఆయనను అడ్డు పెట్టలేకపోయాడు.

"జస్ట్ ఎ మినిట్ సార్ - ఐ విల్ ట్రై"

"యువర్ ఫాదర్ ఆన్ ది లైన్ సర్ - స్పష్టంగా విన్పించాయి" సెక్రటరీ మాటలు డా॥ రమణారావుకి.

తను ప్రెస్ కాన్ఫరెన్స్‌లో ఉన్నానన్నమాట కూడా మర్చిపోయి, "చెప్పండి డాడీ ఎలా ఉన్నారు?"

కొన్ని క్షణాలు రమణారావుగారి నోట మాటలేదు - ఆనందంతో.

"డాడీ ఈజ్ ఎవిరిథింగ్ ఫైన్" కొంచెం ఆందోళనగా ప్రశ్నించాడు ఆనంద్.

"చాలా సంతోషంగా ఉందిరా - ఆగలేక ఫోన్ చేసాను.

ఐయామ్ రియల్లీ ప్రౌడ్ ఆఫ్ యూ"

"నిన్ను కాన్ఫరెన్స్‌లో డిస్టర్బ్ చేయలేదు కదూ?"

"లేదు డాడీ - మీతో మాట్లాడడం నాకు ఎప్పుడూ డిస్టర్బెన్స్ కాదు.

తన కొడుకు - పిడియాట్రిక్, కార్డియాలజిస్ట్ సర్జన్. ప్రపంచప్రఖ్యాతి పొందిన డాక్టరు - ఆయన సంతోషానికి హద్దు లేదు. నోట మాట రావడం లేదు.

ఇది ఆనంద్ అర్థం చేసుకున్నాడు. "డాడీ వీలయినంత త్వరలో ఇండియా వస్తాను మిమ్మల్ని చూడాలని అందరం ఎదురుచూస్తున్నాం"

"ఒక్క నిమిషం. డాక్టర్ రాజా అంకుల్ మాట్లాడతాడు".

"ఎస్ అంకుల్ ఎలా ఉన్నారు?"

"ఉయ్ ఆర్ ప్రౌడ్ ఆఫ్ యూ బాయ్ - గాడ్ బ్లెస్ యూ"

"థ్యాంక్యూ అంకుల్. వచ్చే నెలలో ఇండియా వస్తున్నాం. డాడీని ఒప్పించండి అంకుల్

– ఇక్కడకు రావడానికి. లేకపోతే మేమే వచ్చేయవలసి ఉంటుంది".

"చూద్దాం. మీ నాన్న రెండింటికీ ఒప్పుకోడు. చూద్దాం"

మళ్లీ ఫోన్ రమణారావుకి ఇచ్చాడు రాజారావు.

"ఎల్లుండి ఎల్.ఏ. చేరతాను డాడీ – వెళ్ళగానే ఫోన్ చేస్తాను. టేక్ కేర్ ఆఫ్ యువర్ సెల్ఫ్... బై"

* * *

సెమినార్ రెండు రోజులూ రెండు క్షణాలుగా గడిచిపోయాయి. భార్య డాక్టర్ స్నేహకు, మెడిసిన్ చదువుతున్న పిల్లలకూ ఒక్కసారి "హాయ్" అనగలిగాడు ఆ రెండురోజుల్లో.

* * *

ఆనంద్‌కి ఎప్పుడూ విండో సీట్ కావాలి. పక్క సీట్లో భార్య స్నేహ, వెనుక పిల్లలు – ఏమిటి మరీ చంటి పిల్లాడిలా విండో సీటు పిచ్చి? నవ్వుతూ అంటుంది స్నేహ. ఈ సారి ఆవిడ తన పక్కన లేకపోవడం కొంచెం వెలితి అన్పించింది.

టోక్యో విమానాశ్రయం వదిలింది విమానం.

కునుకు తీయడానికి ప్రయత్నించాడు. మానసికంగా, శారీరకంగా చాలా అలసిపోయాడు ఆనంద్. అయినా నిద్ర రాలేదు. ఎందుకో తలపులు అన్నీ తండ్రిమీదే – తల్లి యూనివర్శిటీలో పని చేసేది. తను ఒక్కడే కొడుకు. తల్లి, తండ్రి అతనికి ఇచ్చిన అభ్యాసం, పెంచిన విధానం అతడిని ఇంతటి వాడిని చేసింది ఈనాడు. తల్లిపోయి రెండు సంవత్సరాలు కూడా కాలేదు. ఆమె మరణం తండ్రి మీద చాలా ప్రభావం చూపింది. ఆయన ఆరోగ్యం మునపటిలా లేదు. ఎన్నోసార్లు చెప్పాడు... "డాడీ మీరు అమెరికా వచ్చేయండి మా దగ్గరకు. లేకపోతే మేమే వచ్చేస్తాం అని. కోడలు స్నేహని వారు ఎప్పుడూ కోడలుగా చూడలేదు – కూతురిలా చూసేవారు. ఆమె కూడా అలాగే ప్రవర్తించేది. ఈసారైనా ఎలాగో ఒప్పించి తన కూడా అమెరికా తీసుకువెళ్ళాలి. ఏవో ఆలోచిస్తున్నాడు – అలాగే ఒక కునుకు తీసాడు.

లాస్‌ఏంజెలెస్ ఎయిర్‌పోర్ట్ చేరుకుంది విమానం. కేబిన్ అనౌన్స్‌మెంట్‌కి మెలకువ వచ్చింది ఆనంద్‌కి.

ఎయిర్‌పోర్ట్‌కి స్నేహ, పిల్లలూ వచ్చారు.

"చాలా అలసిపోయినట్టున్నారు" అంది స్నేహ.

"ఎలా జరిగింది డాడీ సెమినార్?" పిల్లలు ప్రశ్నించారు.

ఆనంద్‌కి ఏదో వెలితి కన్పించింది. వాళ్ళ ముఖాలు మామూలుగా కన్పించలేదు.

"మీ స్పీచ్ మీద రియాక్షన్ ఎలా ఉంది?" స్నేహ ప్రశ్న.

"అందులో సగంపైగా డేటా, ఫాక్ట్స్ నువ్వు ఇచ్చినవే కదా. సరిగా జరుగక ఎలా జరుగుతుంది?".

స్నేహ మామూలుగా నవ్వలేదు. ఏదో చెప్పాలనుకుంటోంది. చెప్పలేకపోతోంది. ఎలా చెప్పాలా అని ఆలోచిస్తోంది అన్పించింది ఆనంద్‌కి.

కొడుకు కారు డ్రైవ్ చేస్తున్నాడు – అతను పక్కన కూర్చున్నాడు.

"ఏమయింది రవీ – ఎవిరిథింగ్ ఫైన్?"

కొడుకుని ప్రశ్నించాడు.

"డాడీ - మనం రేపు ఇండియా వెళుతున్నాం"

"వాట్! ఏమయింది? ఇండియా ఎందుకు వెళ్ళాలి" ఎగిరిపడ్డాడు ఆనంద్ కంగారుగా.

ఆ క్షణంలో - తండ్రికి ఏమైనా అయిందా అనే ఆలోచన.

కంగారు పడకండి. డాక్టరు శేఖర్ ఫోన్ చేసాడు. డాడీకి హార్ట్ ఎటాక్. మైల్డ్. మీకు టోక్యో ఫోన్ చేసారుట. అప్పటికే మీరు ఎల్.ఎ.కి బయలుదేరారు. నాకు ఫోన్ చేసి చెప్పారు. ఈ కొద్ది గంటల్లో నేను అయిదారు సార్లు ఫోన్ చేసాను. డోంట్ వర్రీ. ఎవిరిథింగ్ విల్‌బి ఆల్ రైట్" స్నేహకి మామగారిని డాడీ అనడం అలవాటు.

ఆనంద్‌కి మనసు మనసులో లేదు. సెల్ తీసాడు. శేఖర్‌కి ఫోన్ చేసాడు.

"శేఖర్ డాడీకి ఏమయింది? నా కీనోట్ అడ్రస్ అవ్వగానే ఫోన్ చేసారు. ఎంతో సంతోషంగా మాట్లాడారు. ఇంతలో ఏమయింది? ఈ రెండు మూడు రోజుల్లో?"

"ఏమీ కంగారుపడొద్దు. అన్నీ కంట్రోల్‌లో ఉన్నాయి" బుకాయించడానికి ప్రయత్నించాడు శేఖర్.

ఆనంద్ ప్రశ్నల పరంపరకు తట్టుకోలేక నిజం చెప్పకతప్పలేదు. పూర్తి వివరాలు చెప్పాడు. చేసిన టెస్టులు,రిజల్ట్స్ చెప్పాడు. నీకు తెలుసుకదరా - డాడ్ ఫేస్‌మేకర్ వాడుతున్నారు. కొన్ని కొన్ని చేయలేం - చేస్తున్న ట్రీట్‌మెంట్ పూర్తి వివరాలు చెప్పాడు. తను అక్కడ తండ్రి పక్కన ఉండి ఉంటే అదే వైద్యం చేసేవాడు. ఆ విషయంలో అతనికి ధైర్యం... వైద్య లోపం ఉండదు. ఆ ధైర్యం ఉన్నా తన తండ్రి పరిస్థితి అతనికి ఆందోళన కలిగిస్తోంది. శేఖర్ చెప్పిన మాటలను బట్టి దేవుడి మీదే భారం. మానవ ప్రయత్న లోపం లేదు. డాక్టర్లు ఆ పరిస్థితిలో అంతకంటే చేయగలిగింది ఏమీలేదు. గంట గంటకీ శేఖర్‌కి ఫోన్ చేస్తూనే ఉన్నాడు. శేఖర్ ఒకటే జవాబు "నేను డాడీ దగ్గరే కూర్చున్నాను".

* * *

లాస్‌ఏంజెల్స్ ఎయిర్‌పోర్ట్ జనంతో కిటకిటలాడుతోంది. ఆనంద్, స్నేహ, పిల్లలు చెకిన్ వైపు నడుస్తున్నారు. విమాన రాకపోకల ఎనౌన్స్‌మెంట్స్... మధ్య మధ్యలో ఏవేవో చెబుతున్నారు. ఆనంద్‌కి ఇవి ఏమీ విన్పించడం లేదు. ఆలోచనలు అన్నీ తండ్రిమీదే. ఎంత తొందరగా వెళ్లి తండ్రి పక్కన వాలుదామా? అన్న ఆదుర్దా.

"డాడీ - మీ పేరు ఎనౌన్స్ చేస్తున్నారు. డాక్టర్ జిమ్ మీకోసం వెయిట్ చేస్తున్నారట. ఎంక్వయిరీ దగ్గరకు మీరు అర్జంటుగా వెళ్ళాలిట"

ఒక్కసారి ఉలిక్కిపడ్డాడు ఆనంద్. డాక్టర్ జిమ్ ఎయిర్‌పోర్ట్‌కి ఎందుకు వచ్చి ఉంటాడు? అంత అర్జంట్ ఏమిటి? అర్థం కాలేదు. ఎంతో అర్జంట్ అయితే కానీ రాడు. మామూలు విషయం అయితే సెల్‌కి ఫోన్ చేసేవాడు.

స్నేహా... నువ్వు, పిల్లలూ చెకిన్ దగ్గర లైన్‌లో నిలుచోండి. డాక్టర్ జిమ్‌ని కలుసుకుని నేను వస్తాను. ఎంక్వయిరీ వైపు వెళ్లాడు ఆనంద్.

ఆనంద్ మానసిక పరిస్థితి తెలిసిన స్నేహ అతడిని ఒక్కడినీ వెళ్లనియ్యలేదు.

"రవీ - నువ్వు, చెల్లాయి వెళ్ళండి. నేను కూడా నాన్నగారితో వెళ్తాను" పిల్లలు చెకిన్

వైపు ఆనంద్, స్నేహ ఎంక్వయిరీ వైపూ వెళ్లారు.

"డాక్టర్ జిమ్ ఇలా వచ్చావేమిటి? అర్జంటా? డెబ్బీ ఎలాఉంది. డెబ్బీ డాక్టర్ జిమ్ భార్య. ఆమె కూడా డాక్టరే. ఆమె ప్రెగ్నెంట్ - పురిటి రోజులు.

"నిన్ను కలుసుకోవడానికి హాస్పిటల్‌కి వెళ్ళాను. నువ్వు ఇండియా వెడుతున్నావని, ఎయిర్‌పోర్ట్‌కి వెళ్లావని చెప్పారు. ఫోన్‌లో చెప్పలేని విషయం... మాకు ఆడపిల్ల పుట్టింది. రెండు రోజులయింది. 'ఆలిస్' అని పేరు పెట్టాం. ఆలిస్ సిహెచ్‌డి కేసు. ఇవిగో రిపోర్ట్స్. 24 గంటల్లో సర్జరీ చేయకపోతే ఆలిస్ శ్వాస ఆగిపోతుంది. నువ్వు తప్ప ఈ సర్జరీ ఎవరూ చేయలేరు అని మా ఇద్దరి నమ్మకం. పైగా డాక్టర్ కార్ల్ ఇంకా టోక్యోలోనే ఉన్నారు. ఏమీ తోచక నీ దగ్గరకు పరుగు పరుగున వచ్చాను"

"ఆనంద్ తండ్రికి హార్ట్ ఎటాక్. కండిషన్ సీరియస్‌గా ఉంది. అందుకనే మేం ఇండియా వెడుతున్నాం" అంది స్నేహ.

"అయామ్ సో సారీ - నాకు తెలీదు ఆనంద్. నీ తండ్రి జీవన్మరణాల మధ్య ఊగిసలాడుతూంటే - నా పాపకు సర్జరీ చేయడానికి ఇక్కడ ఉండిపో... అని ఏ ముఖంతో అడగగలను!? మీ తండ్రి కోలుకోవాలని ప్రార్థిస్తాం... ఆల్ ది బెస్ట్" వెనుదిరిగాడు జిమ్.

"జస్ట్ ఎ మినిట్ జిమ్" ఏమనుకున్నాడో - ఏం ఆలోచించాడో తెలీదు. సెల్ తీసాడు. శేఖర్‌కి ఫోన్ చేసాడు. శేఖర్‌కి జిమ్, డెబ్బీ బాగా తెలుసు.

"ఆనంద్ శేఖర్‌కి ఆలిస్ విషయం చెప్పాడు. సర్జరీ చేయకపోతే బ్రతకడం కష్టం. నీ సలహా ఏమిటి?" అడిగాడు.

"ఆనంద్! విషయాలు అన్నీ చెప్పాను... మీ తండ్రి సహస్రపౌర్ణాలు చూశారు. వయసు, రిపోర్ట్‌లు, ప్రస్తుత కండిషన్ చాలా ఆందోళన కలిగిస్తున్నాయి. నువ్వు ఆయనను సజీవుడిగా చూస్తే ఆశ్చర్యమే".

"స్నేహతో అన్నాడు ఆనంద్ - నువ్వు, పిల్లలూ వెళ్ళండి. అదృష్టం బాగుంటే కనీసం ఆయన్ని మీరు సజీవంగా చూస్తారు. నా అదృష్టం భగవంతుడి మీదే వదిలేస్తాను - ఆ భగవంతుని అద్భుత లీలకోసం ప్రార్థిస్తాను. యు అండ్ చిల్డ్రన్ గో"

స్నేహ ఒక్కసారి భర్త ముఖంలోకి చూసింది. అతనిలో - ఆ పాపను రక్షించాలి అనే కోరిక, తండ్రిని సజీవంగా చూడగలను అన్న ఆశా రెండూ కన్పించాయి ఆమెకు.

"జిమ్ - ఒకటే భయంగా ఉంది. ఈ మానసిక పరిస్థితిలో ఇంత క్లిష్టమైన సర్జరీ చేయడానికి ప్రయత్నించడం - ఒక రకమైన పొగరుమోతుతనమే! ఒకవేళ నా పొరబాటు వల్ల ఏదైనా అశుభం జరిగితే జీవితాంతం ఆ విషాదాన్ని మర్చిపోలేను. దేవుడు చల్లగా చూస్తే - నా తండ్రినీ సజీవంగా చూడగలను. ఆయన మృత్యువాత నుంచి బయటపడితే - కొన్ని రోజులు బ్రతుకవచ్చు - సంవత్సరాలు బ్రతకవచ్చు".

"కమ్ - లెట్ అజ్ గో అండ్ సీ ఆలిస్"

ఆనంద్, జిమ్ తిన్నగా హాస్పిటల్‌కి చేరుకున్నారు. ICU బయట కూర్చుంది డాక్టర్ డెబ్బీ. మనిషి మనిషిలా లేదు. పదిలంకణాలు చేసినట్టుంది ఆమె మొహం.

ఆనంద్‌ని చూడగానే లేచి కళ్ళనీళ్ళు తుడుచుకుంది. ఆమె పెదవులపై ఒక చిన్న చిరునవ్వు కన్పించింది.




"డాక్టర్ ఆనంద్ - మిమ్మల్ని చూడగానే వంద ఏనుగుల బలం వచ్చింది నాకు. మై ఆలిస్ ఈజ్ ఇన్ సేఫ్ హేండ్స్"

"ష్యూర్ డెబ్బీ - ఆలిస్‌ని మాకు వదిలిపెట్టు. గో అండ్ టేక్ రెస్ట్' అంటూ ICU లోకి వెళ్ళాడు. తక్కిన డాక్టర్లతో కలిసి అన్ని రిపోర్ట్‌లూ చూశాడు. "కౌంట్ డౌన్ డాక్స్ - రేపు ప్రొద్దున్న 9 గంటలకి సర్జరీకి ప్రిపేర్ చేయండి".

ఇంటికి చేరుకున్నాడు - మొదట చేసిన పని శేఖర్‌కి ఫోన్ చేయడం.

"శేఖర్ - స్నేహ, పిల్లలూ ఫ్లయిట్‌లో ఉన్నారు. రిసీవ్ దెమ్. ఎలా ఉంది డాడీ కండిషన్".

"ఏమీ దిగజారలేదు"

"ప్లాన్ ప్రకారం ఎల్లుండి బయలుదేరి వస్తున్నాను. వీలయితే ముందు ఫ్లయిట్‌లో వస్తాను. కానీ వీలు కాకపోవచ్చు. పోస్ట్ ఆపరేటివ్‌కేర్. 24 గంటలు నేనుంటేనే మంచిది. మార్నింగ్ సర్జరీ"

"ఆల్ ది బెస్ట్ - ఇన్ ఎవ్విరిథింగ్ ఫ్రెండ్" ఫోన్ పెట్టేసాడు శేఖర్.

మళ్లీ రాత్రి రెండుసార్లు ఫోన్ చేసాడు.

శేఖర్ జవాబు - "పరిస్థితి దిగజారలేదు".

* * *

ఆపరేషన్ థియేటర్ నుంచి బయటకు వచ్చాడు ఆనంద్. ఆతృతగా అతని కళ్లల్లోకి చూసింది డెబ్బీ - ఆమె కళ్లలో నీళ్లు.

ఈసారి అవి ముత్యాల్లా మెరిసిపోతున్నాయి - ఆ తేడా తెలియని ఆనంద్ - ఆమె వైపు వెళ్ళాడు. రెండు భుజాల మీదా చేతులు వేసాడు. పక్కనే ఉన్నాడు డాక్టర్ జిమ్.

"నో టియర్స్ డెబ్బీ - ఆలీస్ ఈజ్ ఫైన్"

ఆపరేషన్ ఫెర్‌ఫెక్ట్‌గా జరిగింది. ఏమీ కాంప్లికేషన్స్ లేవు.

"నో డాక్ - ఇవి టియర్స్ కాదు... టియర్స్ ఆఫ్ జాయ్ - నువ్వు నా ఆలిస్‌ని బ్రతికించావు".

"నేను కాదు. మీరు దేవుడికి చేసిన పూజలు - ఆయన నాకు ఇచ్చిన ఈ చేతులు. ఐ విల్ గో అండ్ చేంజ్" డాక్టర్ ఆనంద్ తన రూమ్‌కి వెళ్ళిపోయాడు.

ఆ రోజు రాత్రి అంతా ICU లోనే గడిపాడు డాక్టర్ ఆనంద్. శేఖర్ ఫోన్ చేసాడు. స్నేహ, పిల్లలూ క్షేమంగా చేరారని. స్నేహ ఫోన్ చేసింది. తండ్రి చాలా సంతోషించారని. శేఖర్ అన్నాడు. ఆయన హాస్పిటల్‌లో చేరిన రెండురోజుల్లో ఆయన ముఖం మీద సంతోషం కన్పించింది అని. అది తనకు ఒక ఆశాకిరణంలాగా కన్పిస్తోందని.

ఆనంద్ స్నేహకు చెప్పాడు. ఆలిస్ సర్జరీ నూటికి నూరుపాళ్ళూ సక్సెస్ అని.

పొద్దున్నే ఇంటికి వెళ్ళి బట్టలు మార్చుకుని, ఎయిర్‌పోర్ట్‌కి వెడుతూ ఆలిస్‌ని చూడడానికి హాస్పిటల్‌కు వెళ్ళాడు. ఆలిస్‌ని పరీక్షించాడు.

"డెబ్బీ, జిమ్ - ఆలీస్ ఈజ్ ఫైన్ - వండర్‌ఫుల్ రికవరీ. గో అండ్ సెలిబ్రేట్" ఆనందంగా చెప్పాడు ఆనంద్ వాళ్ళిద్దరికీ.

"డాక్" మెల్లిగా అంది డెబ్బీ... పక్కనే నిలుచున్నాడు జిమ్.

"ఏమిటి" అన్నట్టుగా చూసాడు ఆనంద్.

జిమ్ ఇపుడే చెప్పాడు - "మీ ఫాదర్‌కి సీరియస్‌గా ఉందని, అందుకనే స్నేహ, పిల్లలూ ఇండియా వెళ్ళారని, ఆలీస్ సర్జరీ కోసం నువ్వు ఆగిపోయావని... నాతో ఈ విషయం చెప్పవద్దు అని చెప్పావనీ... నీ సహాయం మేం మర్చిపోలేం. ఇట్ ఈజ్ ఎ రియల్ సాక్రిఫైస్. నీకు చేతులెత్తి నమస్కారం చేయాలి. మా పిల్ల ప్రాణం కాపాడావు".

"డెబ్బీ... ఇది నా జీవితంలో అతి కఠోరమైన, భయంకరమైన అనూహ్యమైన సంఘటన. ఒక ప్రక్క తండ్రి చావు బ్రతుకుల మధ్యలో ఊగిసలాడుతున్నాడు. అన్ని పరీక్షలు, రిపోర్ట్‌లూ ఆయన హృదయం మరికొన్ని గంటలు మాత్రమే స్పందించవచ్చని, ఎప్పుడైనా ఆగిపోవచ్చని చెబుతున్నాయి. దేవుడి అనుగ్రహం ఉంటే నేను ఆయన్ని సజీవంగా కొన్ని క్షణాలు చూడగలిగే అవకాశం ఉంది. అయితే దానికి భగవంతుని చమత్కారం కావాలి - వైద్యుల చేతుల్లోంచి ఆయన పరిస్థితి ఎప్పుడో జారిపోయింది. దేవుడే కాపాడాలి ఆయనను. మానవ ప్రయత్నం పూర్తిగా జరుగుతోంది. ఇటు పక్క తల్లి ముఖాన్ని కూడా సరిగా చూడని పసికందు - సర్జరీ జరగకపోతే ఆమె హృదయస్పందన, శ్వాస ఆగిపోవడం తప్పదు. నేను తీసుకున్న నిర్ణయంతో భగవంతుడు ఏకీభవిస్తాడు అని నా నమ్మకం".

కారువైపు నడిచాడు ఆనంద్. అతని వైపే చూస్తూ నిలచుండిపోయారు డెబ్బీ, జిమ్.

* * *

ఫ్లయిట్‌లో అంతా తండ్రిని గురించే ఆలోచనలు. మానసికంగా, శారీరకంగా అలసిపోయాడు. ఆలిస్ సర్జరీ విజయవంతమైనందుకు సంతోషం ఒక పక్క, తండ్రి ఆరోగ్యం ఆందోళన కలిగిస్తోంది మరో పక్క - కునుకు లేదు ఆనంద్‌కి. ఎయిర్‌పోర్ట్ నుంచి తిన్నగా హాస్పిటల్‌కి చేరుకున్నాడు ఆనంద్. ముఖం మీద లేని ధైర్యాన్ని తెచ్చి పెట్టుకున్నాడు. చిరునవ్వు నటిస్తూ తండ్రి గదిలోకి వెళ్ళాడు. అందరూ అక్కడే ఉన్నారు. స్నేహ ఆయనే పక్కనే కూర్చుం

ది. పిల్లలు, రాజా అంకుల్, శేఖర్, తక్కిన డాక్టర్స్.

"హాయ్ డాడీ. నేను వచ్చేసాను. ఆల్ విల్ బి ఫైన్" లేని ధైర్యంతో అరిచాడు ఆనంద్.

నిద్రలో నుంచి లేచినట్టు కళ్లు తెరిచారు రమణారావు. ఆయన కళ్ళు దీపాల్లా మెరుస్తున్నాయి ఆనందంతో. లేచి కూర్చుని కొడుకుని కౌగలించుకుందామన్నట్టుగా ఆయన కళ్లతోనే సైగ చేసారు. ఆయన పక్కన కూర్చోమన్నట్టుగా. స్నేహతో పాటు ఆనంద్ ఆయన పక్కనే కూర్చున్నాడు.

డాడ్ – నాలుగు రోజుల పసికందు హృదయంపై విజయవంతంగా శస్త్ర చికిత్స చేసాం – ఏదేదో చెబుతున్నాడు ఆనందంగా. ఆనంద్ వైపు చూస్తున్నాయి ఆయన కళ్లు.

డాక్టర్ రాజారావుకి ఆశ్చర్యం వేసింది. ఏమిటీ... ఆ మెరుస్తున్న కళ్లు... ఎంతో మంది, వందల మందిని చివరి ఘడియల్లో ఆయన చూసారు. అటువంటి ప్రశాంతమైన కళ్లు చూడలేదు.

"డాడీ. భగవంతుడు ఒక పసికందు ప్రాణం కాపాడే అవకాశం నాకు ఇచ్చాడు. ఆ అవకాశాన్ని నేను జారవిడుచుకోలేదు. ఇంకా ఏదో చెబుతున్నాడు ఆనంద్.

రమణారావు కొడుకు ఆనంద్ చేతిని అందుకుని తన హృదయం మీద పెట్టుకున్నాడు. ఆయన కళ్లల్లో ఏదో తృప్తి. ఏదో సాధించానన్న ఆనందం, సంతోషం. పెదవులపై చిరునవ్వు. కళ్లు మెల్లగా మూసుకుంటున్నాయి. మగత నిద్ర వస్తున్నట్టుగా. మరి మెలకువ లేని శాశ్వత నిద్ర అది. కళ్లు పూర్తిగా మూసుకుపోయాయి. ఆయన చేతులు ఆనంద్ చేతులను వదిలేసాయి. పెదవుల మీద చిరునవ్వు అలాగే ఉండిపోయింది. డాక్టర్లు ఆఖరి నిమిష ప్రయత్నాలు... ఆనంద్‌కి తెలుసు అంతా అయిపోయింది అని.

"యూ కాంట్ డూ దిస్ టుమి డాడ్ – యూ కాంట్ లీవ్ మి ఎలోన్" గట్టిగా అరిచి, కుప్పగా కూలిపోయాడు తండ్రి హృదయం మీద ఆనంద్.

అతని రెండు భుజాల మీదా నాలుగు చేతులు వాలాయి – అవి స్నేహ – రాజా అంకుల్వి. నీవు ఏకాకివి కావు – మేం నీ కూడా ఉన్నాం' అన్నట్టుగా.

"మీ నాన్నకి నువ్వు ప్రపంచ వైద్యరంగంలో సంపాదించిన గౌరవం, నువ్వు సాధించిన ఘన విజయాలు ఎంత ఆనందం ఇచ్చాయంటే – ఆ ముసలి హృదయం తట్టుకోలేకపోయింది...

నువ్వు మీ నాన్న ఆత్మ శాంతికి చేయవలసిన, సాధించవలసినవి ఇంకా ఎన్నో ఉన్నాయి – ఇది నీకు ఒక పరీక్ష – ఒక ఛాలెంజ్. లివ్ అప్ టు హిస్ ఎక్స్‌పెక్టేషన్స్" ధైర్యం చెప్పారు రాజా అంకుల్.

డాక్టర్ ఆనంద్ ఒక్క క్షణం ఆలోచించాడు. తండ్రి రిపోర్ట్‌లు, టెస్ట్‌లూ అన్నీ చెబుతున్నాయి. ఆయన జీవితం ఇక కొద్ది గంటలు కంటే ఎక్కువ లేదని. అయితే ఆయన 72 గంటలుపైగా బ్రతికారు. తనను, తన భార్యను – అదే కూతురులాగ ప్రేమించిన కోడల్ని, మనమల్నీ అందర్నీ చూసారు. దీవించారు. ఇది ఎలా సాధ్యమయింది?

"తండ్రి మరణశయ్య మీద ఉన్నా – తను శాసించిన విధంగా చిన్న పసికందుకు ప్రాణదానం చేసాడ"ని తన మీద భగవంతుడు కనికరించి – తన తండ్రిని సజీవంగా చూడడానికి వరం ఇచ్చాడా?" ●

# 18 గ్రెనెడియర్స్

“డియర్ జలజా!

ఆశీస్సులు.

ఎలా ఉన్నావ్? అంజలి బాగా అల్లరి చేస్తోందా? చెయ్యనియ్. చిన్నప్పుడు బాగా అల్లరి చేసినవాళ్లే పెద్దయ్యాక మేధావులవుతారు.

అమ్మా, నాన్న కులాసాగా ఉన్నారని తలుస్తాను.

నేనొక గమ్యం తెలియని ప్రాంతానికి వెళ్తున్నాను. అది చాలా ప్రమాదకరమైన ప్రాంతం కావొచ్చు. నేను మళ్లీ ఉత్తరం రాయడం ఆలస్యం కావొచ్చు. నువ్వేమీ ఆందోళన చెందవద్దు. సైనికులకు ప్రమాదాలు జీవితంలో ఒక భాగం. మేము ఎప్పుడూ చావుకి భయపడం. ఎందుకంటే చావు పిరికివాళ్లని రోజూ చంపుతుంది. ధైర్యం గలవారిని ఒక్కసారే చంపగలుగుతుంది. పుట్టిన వారందరూ మరణించవలసిందే కదా!



మనుషులు ఎలా బ్రతికారనే దానికన్నా, ఎలా మరణించారనేది ఎంతో ముఖ్యం.

నా దృష్టిలో మాతృభూమి రక్షణలో మరణించడం చాలా గొప్ప మరణం. ఇలా రాస్తున్నానని నువ్వేమీ బెంగపడకు. నువ్వు వీరపత్నివి కదా!

సమయం అవుతోంది. నేను నా సహచరులతో బాటు యుద్ధభూమికి వెళ్లాలి... ఇంత కన్నా రాయటానికి సమయం లేదు.

ఉంటాను...

ప్రేమతో,

విశ్వం"

ఉత్తరాన్ని మరొకసారి చదువుకుని, మడిచి కవరులో ఉంచాడు లెఫ్టినెంట్ కల్నల్ విశ్వనాథన్. గడియారం చూసుకున్నాడు. సాయంత్రం నాలుగు గంటలవుతోంది. తేదీ జూన్ 2 చూపిస్తోంది.

వైర్లెస్ మోగింది. కమేండర్ గొంతు వినిపించింది.

"సర్..." జవాబిచ్చాడు.

"విశ్వం... నువ్వు రెడీఏనా?"

"రెడీ సార్..."

"హెలికాప్టర్లు రెడీగా ఉన్నాయి. నీ టీమ్‌తో బయలుదేరు..."

"అలాగే సర్..." వెంటనే గుడారంలోంచి బయటకు వచ్చి, తన సహచరుల్ని పిలిచాడు. అందరూ సిద్ధం కాగానే ట్రక్కులో హెలీపాడ్ వద్దకు బయలుదేరారు. 18 – గ్రెనేడియర్స్‌లో ఒక శక్తివంతమైన దళానికి విశ్వనాథన్ లీడర్.

హెలికాప్టర్స్ పైలట్లు అప్పటికే ఇంజన్లు స్టార్ట్ చేసారు.

## సిపాయి కథలు

పైన తిరుగుతున్న పెద్ద ఫ్యాన్లు విసుర్తున్న గాలి తరంగాలు పరిసరాల్లో దుమ్ముని రేపుతున్నాయి. అతికష్టం మీద హెలికాప్టర్లలోకి ఎక్కి కూర్చున్నారందరూ.

'క్లియరెన్స్' లభించగానే హెలికాప్టర్లు గాల్లోకి లేచాయి.

"టోలోలింగ్' పర్వతశిఖరం మీద శత్రువులతో హోరాహోరీగా పోరాడుతూ కన్నుమూసిన ముగ్గురు వీరజవాన్ల మృతదేహాలను 'బేస్'కి తీసుకురావడం కర్తవ్యంగా విశ్వనాథం జట్టు బయల్దేరింది.

అక్కడ పరిస్థితి ఏమీ బాగాలేదు.

చచ్చేవారు చస్తున్నా, కొత్తగా మళ్లీ శత్రువులు అక్కడకు చేరుకుంటున్నారు. యుద్ధరంగం నుంచి మృతదేహాలను వెనక్కి తీసుకురావడం చాలాప్రమాదకరంగా తయారయింది. మృతదేహాలను తొలగించే సమయంలో కాల్పులు జరపడం యుద్ధనీతికి వ్యతిరేకం.

'నీతి' అంటే నమ్మకం లేని శత్రువులు కేవలం భారతసైనికుల్ని మట్టుబెట్టటమే లక్ష్యంగా కాల్పులు సాగిస్తున్నారు.

విశ్వనాథన్‌తన సహచరులతో 'టోలోలింగ్' స్థావరంవైపు శత్రువుల కళ్లబడకుండా పాకుతూ కొద్దికొద్దిగా పురోగమించసాగాడు. శిఖరంపై నుంచి నిర్విరామంగా గుళ్లవర్షం కురుస్తూనే ఉంది. ఆ కాల్పులకి చిమ్మచీకట్లు చీలిపోతున్నాయి. వెలుతురు ముద్దల్లాగా తూటాలు మీదకి వచ్చిపడుతున్నాయి.

కాటూరు రవీంద్రత్రివిక్రమ్

లెఫ్టినెంట్ కల్నల్ విశ్వనాధన్‌కి ఐక్యరాజ్య సమితి శాంతి సైన్యాలలో రువాండా, అంగోలా దేశాలలోని యుద్ధాలలో పాల్గొన్న గతానుభవం ఉంది. అక్కడి యుద్ధరంగాలకు, ఇక్కడికీ పోలికే లేదు. అవి నేలయుద్ధాలు.

ఇవి హిమశిఖరాలమీద శత్రువుతో బాటు ప్రకృతితో కూడా యుద్ధం చేయాల్సిన పరిస్థితులు. ఈదురుగాలులు, విపరీతంగా కురిసే మంచు, మృత్యు దేవతను తమ భుజాల మీద మోసుకొస్తాయి. గాలిమోతలు మృత్యుదేవత వికటాట్టహాసాల్లా ఉంటాయి. ఇక తూటాలు సాక్షాత్తూ మృత్యుదేవతకోరలే!

విశ్వనాధన్‌కి చిన్నప్పట్నుంచీ ఆదేశాలను అక్షరాలా పాటించడం అలవాటు. అతనంటే స్కూలు టీచర్లకి ఎంతో ఇష్టం. ఏనాడూ 'హోమ్ వర్క్' వాయిదా వేయలేదు. క్లాస్ టీచర్ సుశీలా రామదాస్‌కి విశ్వనాధన్ అంటే ప్రత్యేక అభిమానం. అతను మంచి మార్కులతో ర్యాంకులో ప్యాసయినప్పుడల్లా "నా శిష్యుడు" అంటూ గర్వంగా చెబుతుండేది. స్వీట్లు, చిన్న చిన్న బహుమతులూ ఇచ్చి ప్రోత్సహించేది.

"విశ్వం! పెద్దయ్యాక నువ్వేం చేయాలనుకుంటున్నావ్?" అనడిగితే, నిఠారుగా నిలబడి "నేను మిలట్రీ ఆఫీసరునవుతా" ననేవాడు. ఆ మాట మళ్లీమళ్లీ చెప్పించుకుని వినేది టీచర్ సుశీలారామదాస్.

అన్న ప్రకారమే మిలట్రీ ఆఫీసరు అయినాక, యూనిఫారమ్‌లో ఆమె వద్దకు వెళ్లి, పాదాభివందనం చేసాడు విశ్వనాధన్.

ఆమె కళ్లవెంట ఆనందభాష్పాలు రాలాయి. ఆమెలోని మాతృహృదయం పులకించింది. "యశస్వీభవ" తలమీద చెయ్యి ఉంచి ఆశీర్వదించింది.

*సిపాయిలు దేశమాతకి ముద్దు పాపాయిలు. ప్రాణాలను పణంగా పెట్టి, మన సరిహద్దుల్ని సదా రక్షిస్తూంటారు. వారి వీరగాథలు యువతకి ఆదర్శం, స్ఫూర్తిదాయకం కావాలి.*

*ఈ కథలు వాస్తవ సంఘటనల నేపధ్యంతో రచించబడ్డాయి. రచయిత శ్రీ కాటూరు రవీంద్ర త్రివిక్రమ్ 1964 నుంచి 1980 వరకు వైమానిక దళంలో పనిచేసిన కాలంలో స్వయంగా రెండు యుద్ధాలలో పాల్గొన్నారు. మిలట్రీ ఆస్పత్రిలో చికిత్సపొందుతున్న అనేక మంది యుద్ధవీరుల విజయగాథల గురించి వివరాలు సేకరించారు. యుద్ధరంగం వేదికగా, దేశభక్తి ఊపిరిగా, త్రివిధ దళాల యుద్ధవీరులు సజీవ పాత్రలుగా వెలువడుతున్న ఈ ప్రత్యేక కథలు 'కథాకేళి' పాఠకులకు ప్రత్యేకం.*

తండ్రి రామకృష్ణన్ కొడుకుని చూసి గర్వంతో పొంగిపోయాడు. తల్లి సరేసరి.

జలజ దగ్గర బంధువుల పిల్ల. కావాలని అతడ్ని వివాహం చేసుకుంది. వాళ్ల దాంపత్యానికి దైవమిచ్చిన కానుక చిన్నారి అంజలి. చురుకుదనానికి మారుపేరు.

విశ్వనాధన్‌కి సినిమారీలులా గతం మనసులో మెదిలింది.

మంచుకి కళ్లజోడు మీద తేమ జేరి మసగ్గా ఉంది.

రుమాలకోసం జేబులో వెతికాడు. భార్యకు రాసిన ఉత్తరం చేతికి తగిలింది. నవ్వుకున్నాడు. హడావిడిలో ఉత్తరం పోస్ట్ చేయడం మర్చిపోయాడు. బేస్‌కి తిరిగి వెళ్లాక పోస్ట్ చేయాలి.

కళ్లజోడు శుభ్రం చేసుకుని, సహచరులతో బాటు ముందుకు కదిలాడు. మొదటి బంకరు స్వాధీనం చేసుకోవడం కష్టమైంది. అక్కడ తన సహచరుల్లో కొందర్ని కాపలాగా ఉంచి, రెం


విశ్వనాథన్, జలజ - పెళ్లి ఫోటో

డవ బంకర్ వైపు వెళ్లాడు. శత్రువుల తూటాలకు నలుగురు సహచరులు నేలకొరిగారు. మనసులోనే వారికి నివాళులర్పించి ముందుకు కొనసాగాడు. కొద్ది గంటల సమరం తరువాత రెండో బంకర్‌కూడా విశ్వనాథన్ వశమైంది. అక్కడ కూడా కొందరు సహచరుల్ని ఉంచి, మూడవ బంకర్ దిశగా మిగిలిన సహచరులతో సాగిపోయాడు.

నిర్విరామంగా పరస్పరం తూటాల వర్షం కురిపిస్తూనే ఉన్నారు.

శత్రువుల్లో ఒక్కొక్కరూ నేలకూలుతున్నారు.

విశ్వనాథన్ ఉత్సాహంగా లేచి నిలబడి, సూటిగా శత్రువులకి గురిపెట్టి తుపాకి కాల్చసాగాడు. మరో ఇద్దరు శత్రువులు నేలకూలారు.

అంతలో నాలుగుతూటాలు అతని కటి ప్రదేశాన్ని, తొడల్నీ తాకాయి. విశ్వనాథన్ ముందుకి తూలిపోయాడు. తూట్లుపడిన శరీరభాగాల్లోంచి రక్తం వెచ్చగా కారిపోతోంది.

సహచరులు ఆందోళనగా దగ్గరికి వచ్చారు.

"ముందు బంకర్‌ని పట్టుకోండి..." బలవంతాన తనుకూడా శత్రువులకు గురిపెట్టి కాల్పులు సాగించాడు విశ్వనాథన్.

బంకర్‌లోంచి తుపాకీ కాల్పులు ఆగిపోయాయి.

విశ్వనాథన్ మనసు సంతోషంతో పొంగిపోయింది. "జైహింద్... జైభారత్" అంటూ తూలుకుంటూనే బంకర్‌లోకి వెళ్లి స్వాధీనం చేసుకున్నాడు. సహచరులు జయధ్వానాలు చేసారు.

"సాబ్... మీరు ప్రమాదస్థితిలో ఉన్నారు. మనం 'ద్రాస్' సెక్టార్‌వైపు వెళదాం. అక్కడ మెడికల్ హెల్ప్ దొరుకుతుంది. హెలికాప్టర్లు సిద్ధంగా ఉంటాయి..."

"ఫర్వాలేదు! సోదరులారా... ఎట్టి పరిస్థితుల్లోనూ ఈ బంకర్లు చేజారిపోనివ్వకండి..." విశ్వనాథన్ ఆయాసపడుతున్నాడు.

అతని సహచరులు ఇంకేమీ వినకుండా చేతులమీద మోస్తూ వేగంగా 'ద్రాస్' సెక్టార్‌వైపు పరుగులు తీసారు.

* * *

జూన్ 3వ తేది - 'కోచి' నగరం మధ్యాహ్నం ఎండలో సోలిపోతోంది.

విశ్వనాథన్ తండ్రి రామకృష్ణన్ రేడియో వింటున్నాడు. యుద్ధరంగ వార్తలు శ్రద్ధగా ఆలకిస్తున్నాడు. కార్గిల్ యుద్ధం ప్రారంభం నుంచీ ఆయన నిత్యకార్యక్రమం - వార్తా పత్రికలు చదవడం, రేడియో వార్తలు వినడం. కొడుకు సమాచారం ఏమీ తెలియక ఆయన ఆందోళన పడుతున్నాడు.

అప్పుడప్పుడూ తన ఆలోచనలు భార్యతో, కోడలు జలజ, మనవరాలు అంజలితో పంచు

కుంటూంటాడు.

అంజలి మాటల పుట్ట.

తండ్రి అంటే ఆ పిల్లకు పంచప్రాణాలు.

విశ్వనాథన్ వచ్చినప్పుడు అతని గురించి అన్ని వివరాలూ అడిగి తెలుసుకుని, అవన్నీ గుర్తుపెట్టుకుంటుంది. అవన్నీ తాతగారితో చర్చిస్తూ ఉంటుంది.

విశ్వనాథన్ రేడియో కట్టేసాడు. వార్తలు అయిపోయాయి. ఏవో పాటలు ప్రసారమవుతున్నాయి. వినాలనిపించలేదు. ఆయన మనస్సు ఎందుకో ఆందోళనగా ఉంది. అశాంతిగా అటూఇటూ పచార్లు చేస్తున్నాడు. సోఫాలో కూర్చున్న అంజలి బుగ్గలకి చేతులు ఆన్చుకుని తాతనే చూస్తోంది.

అంతలో ఫోన్ మోగింది.

"హలో... నేను రామకృష్ణన్‌ని... అవును... విశ్వనాథన్ తండ్రినే... వాట్? ఎప్పుడు? ఎక్కడ?" ఆయన ఆందోళనగా అరుస్తూంటే భార్య, కోడలూ గబగబా వచ్చారు. అంజలి కూడా చప్పున తాతగారి దగ్గరకొచ్చింది.

రామకృష్ణన్ చేతిలోంచి రిసీవర్ జారిపోయింది.

ఆయన్ని కుదుపుతూ "ఏమైంది? మన విశ్వం ఎలా ఉన్నాడు" అనడిగింది భార్య. జలజ ఊపిరి బిగబట్టుకుని ఆయనకేసే చూస్తోంది.

"లేదు... మన విశ్వం మనకిలేదు" అంటూ తను విన్న వార్త గురించి వాళ్లకి చెప్పాడు రుద్ధ కంఠంతో రామకృష్ణన్. నిలబడలేక ఆయన కుర్చీలో కూలబడ్డాడు. ఆ ఇంట్లో శోకదేవత కొలువుదీరింది.

జూన్ 2న విశ్వనాథన్ రాసిన చివరిలేఖ భార్యకు ఆయన మృతదేహంతో బాటు చేరింది.

రాష్ట్రప్రభుత్వం 5 లక్షల సహాయం ప్రకటించింది. ఒక స్మారకచిహ్నం కూడా నెలకొల్పుతామని ప్రకటించింది.

'జబల్‌పూర్'లోని సైనిక పురావస్తు ప్రదర్శనశాలలో ఇప్పుడు విశ్వనాథన్ యూనిఫారమ్ ప్రదర్శనలో ఉంది.

సందర్శకులు ఆయన కీర్తిశరీరానికి జోహార్లర్పిస్తూంటారు.

('ఇండియాటుడే' సౌజన్యంతో)

## ఇంజక్షన్!

దుండు ముక్కలా ఉన్న భీమేశ్వరరావు జ్వరంగా ఉందని డాక్టర్ దగ్గరికి వెళ్ళాడు... డాక్టర్ ఓ వంద రూపాయలు ఫీజు తీసుకుని ఓ ఇంజక్షన్ పొడిచాడు... అంతే, అతని జ్వరం సంగతి దేవుడెరుగు. చెయ్యి, కాలు పడిపోయాయి. భీమేశ్వరరావు కోర్టులో కేసు వేశాడు.

'నువ్వు ఇచ్చిన ఇంజక్షన్ వల్లనే అతనికి పక్షవాతం వచ్చింది' అన్నాడు భీమేశ్వరరావు తరపు ప్లీడర్.

'సారీ సార్! నేను ఇంజక్షన్ ఇవ్వడం సైకలాజికల్‌గా రోగి తృప్తి కోసమే. అందులో డిస్టిల్డ్ వాటర్ తప్ప మరే మందూ కలప లేదు!' అన్నాడు డాక్టర్.



ముఖచిత్ర కథనం...

# క్విట్ ఇండియా

భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్ర ఉద్యమం దాదాపు శతాబ్దకాలం పాటు వివిధ రూపాల్లో, విభిన్న పద్ధతుల్లో, వివిధ కోణాల్లో పరాయి ప్రభువుల పాలనపట్ల ధిక్కారాన్ని, ఛీత్కారాన్నీ ప్రదర్శిస్తూ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకై తరం వెంబడి తరం అలుపెరుగని పోరాటం ప్రకటించిన నేపథ్యంలో అఖండ భారతదేశాన్ని దశదిశలా ఉద్యమాలతో రగిలించింది.

'స్వేచ్ఛ'కున్న ప్రాధాన్యతని గుర్తించిన ఆనాటి మేధావివర్గం ప్రజల్ని ఉత్తేజితుల్ని చేసి, బ్రిటిష్‌సామ్రాజ్యకబంధ హస్తాల నుంచి స్వేచ్ఛా స్వాతంత్ర్య భారత సాధనకై తన ప్రాణాల్ని పణంగా పెట్టింది. తమ ప్రాణాల్ని పణంగా పెట్టి, మనకి స్వేచ్ఛా వాయువుల్ని ఊదిన ఎందరోమహానుభావుల్ని ఈ స్వాతంత్ర్యదినోత్సవ వేళ మనం మనస్ఫూర్తిగా, ఆత్మసాక్షిగా స్మరించుకొందాం.

ఒక్కరు కాదు - ఇద్దరు కాదు... వందలు - వేలు... ఎందరో నిస్వార్థచింతనాపరులు స్వాతంత్ర్య సాధనలో సమిధలై అసువులు బాసారు. ఇదేదో కొద్ది రోజుల్లో జరిగింది కాదనే విషయం మనందరికీ తెలిసిందే. ఒక తరం అంతర్మథనం వెనుక మరో తరం తమ గుండెల్ని దివిటీల్లా వెలిగించి, దేశం కోసం ప్రాణాల్ని తృణప్రాయంగా ఎంచి పోరాడిన వైనం మన స్వాతంత్ర్యోద్యమ సమరం...

'స్వరాజ్యం నా జన్మ హక్కు' అనే బాల గంగాధర్ తిలక్ నినాదం తెల్లవారి గుండెల్లో గుబులు పుట్టించింది. రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యాన్ని గడగడలాడించింది. లాల్, బాల్,




పాల్ ఆధ్వర్యంలో ఉద్యమం బలోపేతం కాగా, చలించని ఆత్మస్థయిర్యంతో 'విప్లవం వర్ధిల్లాలి' అని నినదిస్తూ సాయుధపోరాటం ద్వారా భగత్ సింగ్, నేతాజి, అల్లూరి, సుఖదేవ్, రాజగురు, ఎం.ఎన్. రాయ్, చంద్రశేఖర్ ఆజాద్, ఇంకా ఎందరో మహనీయుల ఆధ్వర్యంలో దేశమంతటా రగులుకొన్న విదేశీవస్తు దహనాలు, సమ్మెలు, హర్తాళ్‌లు... మరోప్రక్క గాంధీజీ ఆధ్వర్యంలో అహింసామార్గంలో సత్యాగ్రహాలు... నాడు ప్రజానీకమంతా ఏకమై ఉద్యమబాట నడవడంతో శక్తివంతమైన ప్రజా ఉద్యమం రూపుదాల్చింది.

1919లో జలియన్‌వాలాబాగ్ సంఘటన అనంతరం సహాయ నిరాకరణ (1920-21), ఉప్పు సత్యాగ్రహం (1930), శాసనోల్లంఘన, క్విట్ ఇండియా (1942) వంటి పలు ఉద్యమాలతో దేశం దద్దరిల్లగా చివరికి తెల్లదొరలు తోక ముడిచారు. భారతప్రజలు ఉద్యమాల ఊతకర్రతో తెల్లరాబందుల పాలనను తరిమి

కొట్టారు.

స్వాతంత్ర్య సంగ్రామంలో మనకు తెలిసిన మహనీయులే కాక చరిత్రకందని ఎందరో మహానుభావులు అమరులయ్యారు. కొందరు జైలు పాలయ్యారు. వారి బలిదానం, ఆత్మత్యాగాల ఫలితమే నేడు మనం అనుభవిస్తున్న స్వేచ్ఛా భారతం... ప్రజలే ప్రభువులవుతున్న ప్రజాస్వామ్యం.

గాంధీజీ నూతన భారత నవసమాజాన్ని ఆశించి – అందరికీ విద్య, గ్రామీణ అభివృద్ధి, రైతు అభ్యుదయం, అంటరానితనం అనేది లేని సమసమాజ భారతం, మద్యపాన నిషేధం వంటి పలు అంశాలపై దృష్టి సారించారు. అప్పుడే ఏర్పడుతున్న మధ్య తరగతి మేధావుల ఆలోచన, కార్యాచరణ జవహర్‌లాల్ నెహ్రూ నేతృత్వంలో నవభారత నిర్మాణానికి నాంది పలికింది.

అయితే కాలం గడిచేకొద్దీ నయా ధనవంతుల, త్యాగనిరత కొరవడిన కొందరు రాజకీయ నాయకుల చేతుల్లో ప్రభుత్వ ఆలోచనా విధానాలు మారిపోయాయి, మారిపోతున్నాయి. స్వార్థం, ఆశ్రిత పక్షపాతం, వంశపారంపర్య వాదం, కులవాదం వంటివి ధనిక, పేద వర్గాల మధ్య అంతరాలను పెంచుతూ నాటి మహానుభావులు కలలు గన్న 'స్వతంత్ర్య భారతావని' స్ఫూర్తిని ఛిద్రం చేస్తున్నాయి. ఎప్పుడో స్వాతంత్ర్యం రాకముందు 1906లో బ్రిటిష్ వారి 'విభజించి పాలించు' సూత్రాన్ని ఒక శతాబ్దం తరువాత కూడా అనుసరిస్తూ కుతంత్ర రాజకీయ శక్తులు ప్రజలలో కులమతాల చిచ్చురేపి, సమసమాజాన్ని ముక్కలు చేస్తూ తాము పబ్బం గడుపుకొంటున్నాయి.

లక్షలూ, కోట్లూ ఖర్చుపెట్టి గద్దెలెక్కుతున్న కొందరు రాజకీయనాయకులు అవినీతి అధికారులను భుజాన వేసుకొని, ప్రజాసంక్షేమం కోసం ఖర్చు చేయవలసిన లక్షల కోట్ల రూపాయలను భోంచేస్తున్నారు. ఏ పథకంలో సులభంగా డబ్బు దొరుకుతుందో ఆ మార్గాలను అనుసరించి దోచుకోవడం కోసం దోపిడీని సైతం చట్టబద్ధం చేస్తున్న సంఘటనలు ఇప్పుడు కళ్లకు కట్టినట్లు కన్పిస్తున్నాయి. భూకబ్జాలు, భూమాఫియాలూ నేడు ప్రతిచోటా సర్వసాధారణమైపోయాయి. సామాన్యుడికి విద్య, వైద్యం అనేవి అందని మావిపండు అవుతున్నాయి. సంపూర్ణ మద్యపాన నిషేధం సంగతి ఇక సరేసరి...

సామాన్యులు... అంటే దిగువ, మధ్యతరగతి ప్రజలు ఇప్పుడు నల్ల దొరల పరతంత్ర పాలనలో బ్రతుకు బండి సాగిస్తున్నారు. ఏ దేశ భవిష్యత్ అయినా మధ్యతరగతి మేధావుల ఆలోచనా సరళిపై ఆధారపడి ఉంటుందనేది నగ్న సత్యం. మన పాలక ధనిక వర్గాలు అద్దంలో చందమామని చూపిస్తూ సామాన్య మానవుల జీవితాలపై స్వారీ చేస్తూ నిత్యావసర, అత్యావసరాలపై ప్రత్యక్ష, పరోక్ష పన్నులను వడ్డిస్తూ ప్రజల నడ్డి విరుస్తున్నాయి. దేశ స్వాతంత్ర్య సౌభాగ్యాలను వారు నిస్సిగ్గుగా అనుభవిస్తున్నారు.

అవినీతి, ఆశ్రితపక్షపాతం, వంశపారంపర్యవాదం, లంచగొండితనం, స్వార్థపరశక్తులపై 'క్విట్ ఇండియా' ఉద్యమం చేపట్టవలసిన సమయం ఇది. ఈ ఉద్యమంలో మనం విజయం సాధించగలిగితేనే ప్రజలందరికీ స్వేచ్ఛ, సమాన అవకాశాలు, ఆర్థిక స్వాతంత్ర్యం లభిస్తాయి. అప్పుడే నిజమైన స్వరాజ్యం సిద్ధిస్తుంది. దీనికోసం కృషి చేసే నేతలకు అండగా నిలుద్దాం!... నిజమైన స్వతంత్ర్య భారతావనిని సాధిద్దాం!!

**- ఉదయ్**

# నేను బానిసను కాను



ఫాను వేగంగానే తిరుగుతూంది. కృష్ణమూర్తి కలం చాలా చిరాగ్గా, మెల్లగా కదులుతూంది.

వెచ్చటిగాలి ఫాను రెక్కల మధ్య చిక్కుకుని అక్కడే, ఆ కుర్చీల చుట్టూ ప్రదక్షిణలు కొడుతూంది.

బయట ఉన్న 'నో వేకెన్సీ' బోర్డుకి భయపడి, గాలి సైతం చెట్టుకొమ్మల నుంచి ఇటు ఆఫీసులోని జీవాల్ని పలకరించేటందుకు వచ్చే సాహసం చెయ్యడం లేదు.

## పాతబంగారం

వ్యసనాలకు బానిస అయిన వ్యక్తుల్ని మార్చడం అంత తేలికైన విషయం కాదని మనందరికీ తెలుసు. కానీ ఒక స్త్రీ సునాయాసంగా వ్యసనపరుడ్ని మళ్లీ మామూలు మనిషిగా ఎలా మార్చగలిగిందో ఈ కథ చెబుతుంది.

*1955 లో రచనా వ్యాసంగానికి శ్రీకారంచుట్టిన శ్రీ కాటూరు రవీంద్రత్రివిక్రమ్ వందల సంఖ్యలో వివిధ సాహిత్య ప్రక్రియల్లో రచనలు చేసారు. 1974లో 'ఆంధ్రప్రభ' సచిత్ర వారపత్రికలో ప్రచురితమైన ఈ కథ ఆయన విశిష్ట రచనల్లో ఒకటి. అలనాటి పాఠకుల్ని విశేషంగా అలరించిన ఈ కథ ఇప్పటి తరం పాఠకుల్ని కూడా ఆకట్టుకుంటుందని మా విశ్వాసం.*

రెండు సంవత్సరాల క్రితం కొన్న వట్టివేళ్ళ తడికెలు నీళ్ళకి జావకారి 'వట్టి తడికెలుగా' వేళ్ళాడుతున్నాయి. సువాసన మాట ఎలాఉన్నా, పాతబడిపోయిన వాసన ముక్కుపుటాలకు చాలా ఇబ్బంది కలిగిస్తుంది.

కొంతమంది ఆ వాసనకి అలవాటు పడిపోయారు. పడనివాళ్ళలో మొదటివాడు కృష్ణమూర్తి. అతని ముక్కు చాలా నైశిత్యం గలది. దానికి అద్భుతమయిన ఘ్రాణశక్తి ఉంది. వాసనని బట్టి రుచులు ఊహించుకోగల భోగట్టా మెదడుకు అందించే నేర్పు ఉంది.

"ఏమిటోయ్, సుబ్బన్నా! ఈ మినపట్టు మధ్య ఉల్లిపాయలు వేగినట్లు లేవే" అనేస్తాడు, ప్యూన్ పొట్లం విప్పగానే.

లేదా - "ఈ ఇడ్లీ ప్రొద్దుటిది! వేడి చేసి పంపాడు అయ్యరు" అంటాడు.

సుబ్బన్న ఆశ్చర్యంతో తలమునకలైపోతాడు.

"ఏమయ్యా, అయ్యరూ! ఇడ్లీ నిలవదట గంద - మా హెడ్‌గుమాస్తాగారన్నారు" అన్నాడోమాటు, నిజం తెలుసుకుందామని.

"హోటలన్నాక అవన్నీ మామూలే, సుబ్బన్నా" అని గారపళ్ళు వెళ్ళబెట్టి నవ్వాక, సుబ్బన్న ముక్కు మీద వేలేసుకున్నాడు.

"కృష్ణమూర్తిగారిది మా పెద్ద బుర్ర" అని ఆశ్చర్యం వెళ్ళబోసుకున్నాడు ఇతర ప్యూన్ల ముందు.

"ఒట్టి తిండిపోతు పంతులు! ఆయనకి తెలీకపోతే నీకేటి తెలుస్తది చద్దన్నం తినేవోడికి" అని కొట్టిపారేశారు వాళ్ళు.

ఎన్నన్నా, కృష్ణమూర్తి మీద సుబ్బన్నకు గౌరవం పైస తగ్గలేదు. అతనికేంకావాలో, ఎప్పుడు కావాలో సుబ్బన్నకి తెలిసినంత బాగా కట్టుకున్న పెళ్ళానిక్కూడా తెలియదేమో!

కృష్ణమూర్తికి ఒక్క దుర్గుణం ఉంది. చార్మినారు లేకుండా అతని పెదవుల్ని చూసినవాళ్ళు దాదాపు లేరనే చెప్పాలి. ఆరిపోతున్న సిగరెట్టుకే కొత్తది ముట్టించేస్తాడు.

ఈ ఒక్క అలవాటుని మాత్రం సుబ్బన్నతో పాటు చాలామంది అంతరంగంలోనే గర్హించారు. ఎవరు చెబుతారు మొహం మీద గుద్దినట్లు?

**కాటూరు రవీంద్రత్రివిక్రమ్**

కట్టుకున్న ఆడది కనుక కళ్యాణి కాళ్ళు, గడ్డం పట్టుకుని బతిమా

లింది. నిర్లక్ష్యంగా ఓ నవ్వు నవ్వి ఊరుకున్నాడు కృష్ణమూర్తి.

మళ్ళీ ఆ మాట ఎత్తలేదు ఆ ఇల్లాలు.

కానీ ఎర్రటి ఆ పెదవులు కమిలిపోయి నల్ల బడిపోయినప్పుడు, సిగరెట్టు పట్టుకునే వేళ్ళ కొసలు పొగబారినట్లుండటం గమనించినప్పు డల్లా మింగలేని, కక్కలేని బాధతో గిలగిల్లాడి పోతూ ఉంటుంది.

వారపత్రికలు తిరగేస్తుంటే ఎక్కడన్నా సిగ రెట్టు వల్ల జరిగే అనర్థాలు గురించి కనిపిస్తే చాలు, సీరియల్ కంటే ఆసక్తిగా కనీసం రెండు మార్లయినా చదువుతుంది.

ఆ రాత్రి ఆమె నిద్ర నిండా భయంకర స్వప్నాలు!

భర్త అస్థిపంజరంలా అయిపోయి మంచా న్నంటి పెట్టుకుని ఉంటాడు. "ఖళ్ళు, ఖళ్ళు" మని గది గోడలు కంపించేలా, కప్పు కూలి పోయేలా దగ్గుతుంటాడు. చివర్న పుడిసెడు నెత్తురు వమనం చేసుకుంటాడు. ప్రాణాలు కళ్ళల్లో ఉంటాయి. డాక్టరు వచ్చి పోతుంటాడు. ఓ రోజు మరీ ఎక్కువగా దగ్గుతాడు. నెత్తురు కళ్ళు చెదరగొడుతుంది. పిల్లలు అది చూసి భయంతో తనను కావలించుకుని ఏడుస్తుంటా రు. డాక్టరు వచ్చి పరీక్షిస్తుంటారు. తీతువుపిట్ట హృదయవిదారకంగా గుండెల్ని చీలుస్తూ వికృ తంగా అరుస్తుంటుంది. డాక్టరు జాలిగా తన కేసి చూస్తు "అయామ్ సారీ..." అంటాడు. తను గొంతు చించుకుని గొల్లుమంటుంది.

అప్పటిదాకా ప్రశాంతంగా నిద్రపోతున్న కృష్ణమూర్తి అదిరిపడి లేచి, "ఏమిటేమిటి?" అంటాడు లైటు వేస్తూ.

కళ్యాణి సిగ్గుతో ముడుచుకుపోతుంది. ఏమంటుంది? ఏమని చెప్పగలదు!

"ఏదో పీడకల" అంటుంది, ఓ గ్లాసెడు నీళ్ళు గడగడ తాగి అటు తిరిగి పడుకుంటూ.

ఇలా రెండుమార్లు జరిగాక కృష్ణమూర్తి విసుక్కోవడం మొదలెట్టాడు.

"అతిగా తినబోకు. అజీర్తి వల్ల కూడా పిచ్చి కలలు అనేకం వస్తాయి". ఆ మాట అంటూ సిగరెట్టు ముట్టించుకునేవాడు. నిద్ర ముంచు కుని వచ్చేదాకా అలా పెదవుల మధ్య సిగరెట్టు తప్పదు!

ఇది మరీ సహించరానిదయింది ఆమెకి.

ఏమైతేనేం కృష్ణమూర్తి అలవాటు మార లేదు, కళ్యాణికి పీడకలలు తప్పలేదు.

ఓ మాటు కాన్సరు వల్లా, మరో మాటు గుండెజబ్బువల్లా వ్యాసాల్లో డాక్టరు చెప్పిన రోగాలన్నింటితోనూ తీసుకుని చస్తూ, బతు కుతూ ఉండడం మామూలయిపోయింది, ఆమె కలల్లో కృష్ణమూర్తికి.

కళ్యాణి మనస్సు ఎంత పిరిగ్గా తయా రయిందంటే భర్తకు వేడి చేసి దగ్గు వచ్చినా ఉలిక్కిపడేది. దగ్గినప్పుడల్లా సుత్తితో తలమీద మోదినట్లు, కత్తులతో చెవుల్లో పొడుస్తున్నట్లు ఏమిటేమిటో రకరకాలుగా అనిపించేది.

"వెళ్ళి డాక్టరుకోమాటు చూపిద్దురూ" అని పోరు పెట్టేది.

"నేనంత త్వరలో టపాకట్టన్లే భయపడకు" అనేవాడు కృష్ణమూర్తి నిర్లక్ష్యంగా.

అతని నిర్లక్ష్యం ఆమెని మరింత భయ పెట్టేది.

పిల్లలు ఎదుగుతున్నప్పుడయినా భర్తలో పరివర్తన కలుగుతుందేమోననుకుని మోస

పోయింది.

"పిల్లల్ని చూసయినా మీరు మారకపోతే ఎలా? మొన్న మీరు పారేసిన ఎంగిలిపీక నోట్లో పెట్టుకున్నాడు వాసు. చెవులు మెలేసాను వెధవని..." అది కట్టుకథే. అతన్ని భయపెట్టాలని చెప్పింది.

ఆశించిన కదలిక లేదతనిలో.

ఫైలు తిరగేస్తూ, "పిల్లలు కదూ? వాళ్ళకేమీ తెలియదు. పైన నువ్వున్నావుగా. జాగ్రత్తగా చూస్తుండు. ఇల్లు శుభ్రంగా ఉంచుతుంటే సరి".

ఉక్రోషం వచ్చి అవతలికి వెళ్ళిపోయింది.

"ఈ జన్మకు ఆయన మారరు..." అదీ ఆమెకు అర్ధమయిన నిజం.

ఓ మాటు వాసు నిజంగానే ఎంగిలిపీక నోట్లో పెట్టుకునేసరికి కసితీరా బాదేసింది. ఆ రాత్రి వాడికి తీవ్రంగా జ్వరం వచ్చింది.

కళ్ళల్లో వత్తులు వేసుకుని గుబులు గుబులుగా వాణ్ణి కనిపెట్టుక్కూర్చుంది. కొండమీద వాడి కరుణ కోసం కన్నీటి తర్పణాలు అర్పించింది. ఆ రోజు తెల్లవారడం బాగా గుర్తు.

వాడు మళ్ళీ నవ్వాడు.

అంతే!

మళ్ళీ వాడిమీద చెయ్యి చేసుకోలేదు.

శివాజీని మహావీరుడిగా, సజ్జనుడిగా మార్చడానికి పుత్లీబాయి ఎన్ని బాధలు పడిందో, ఎన్ని కథలు చెప్పిందో జ్ఞాపకం చేసుకుని వాడి పెంపకం మీద అంత శ్రద్ధ చూపింది.

అటు తరువాత ఇద్దరు ఆడపిల్లలు పుట్టారు.

కృష్ణమూర్తి మారలేదు!

* * *

"గురువుగారూ! ఈ అమ్మాయి మన కొత్త స్టెనో. మిస్ వీణ..." రామారావుని, అతని పక్కనున్న మేనక లాంటి అమ్మాయినీ చూసి ఉలిక్కిపడ్డాడు కృష్ణమూర్తి.

"నమస్కారమండీ" చేతులు జోడించింది వీణ.

ఆమె గొంతు పేరుకు తగ్గట్టుగానే ఉందనిపించింది కృష్ణమూర్తికి.

"నమస్కారం. వెల్‌కమ్ టు యూ" అన్నాడు వెయ్యి కాండిల్ బల్బులా మొహం పెట్టి.

"థాంక్యూ సోమచ్. నన్ను బాస్‌కి పరిచయం చేస్తారా?"

"ష్యూర్. ఫాలో మీ!" ప్యాంటు ఎగలాక్కుని ముందుకి నడిచాడు. వీణ అనుసరించింది.

నోటితో 'కమ్ సెప్టెంబర్' మ్యూజిక్ కొడుతూ సీట్లోకి వెళ్ళాడు రామారావు.

గుమాస్తాలందరూ ముసిముసిగా నవ్వారు.

మరో పదినిమిషాల్లో ఇద్దరూ తిరిగొచ్చారు. కృష్ణమూర్తికి సమీపంలోనే స్టెనో సీటు. అది చూపించాడు. థాంక్స్ చెప్పి కూర్చుంది.

పూర్వం మగ స్టెనో ఉండేవాడు.

హఠాత్తుగా అతని భార్య చనిపోవడం వల్ల రిజైన్ చేసి వెళ్ళిపోయాడు. అప్పట్నుంచీ ఖాళీగానే ఉంది. ఇటీవలి సెలక్షన్‌లో వీణ వచ్చింది.

ఆ ఆఫీసుకి ఆడగాలి సోకటం అదే ప్రథమం.

అందరిలో కుతూహలం వెర్రితలలు వేస్తూంది. పనున్నా లేకపోయినా కల్పించుకుని మరీ కృష్ణమూర్తి దగ్గర కొస్తుండడం సాగించారు. ఏ మాత్రం అవకాశం ఉన్నా వీణతో రెండు మాటలు మాట్లాడటమో, అధమం ఓ




ఫోజు కొట్టటమో చేస్తుండడం మామూలయింది.

పూర్వం రెండు రోజులక్కూడా గడ్డం గీసుకోవడానికి బద్ధకించే వాళ్ళిప్పుడు శుభ్రంగా తయారై వస్తున్నారు. కృష్ణమూర్తి ఆఫీసువేళలో పనామా, ఇంటి వద్ద చార్మినార్ అలవాటు చేసుకున్నాడు. డబ్బులు తక్కువగా ఉంటే పనామా పాకెట్‌లోనే చార్మినారు ఉంచుకుని తాగేవాడు.

వీటిల్లో కొన్ని మార్పులు గుర్తించిన ఆఫీసరు – "మన ఆఫీసు చాలా ఇంప్రూవ్ అయినట్లు కనిపిస్తూందీమధ్య! ఏమిటి విశేషం?" అన్నాడు.

"ఏముంది సార్, బాధ్యతలు అర్థం చేసుకుంటున్నారు మనవాళ్ళు..." అన్నాడు కృష్ణమూర్తి.

"అద్సరే – స్టెనో సీటు నా గదిలోకి మార్పిస్తే ఎలా ఉంటుందా అని ఆలోచిస్తున్నాను" అన్నాడు, కుర్చీలో వెనక్కు వాలి పెన్సిల్‌తో ఆడుకుంటూ.

ఆయనకి నలభైఅయిదేళ్ళకు తక్కువుండవు!

"ఓరి నీ కరువు తగలడా!" అని మనసులో తిట్టుకుని పైకి – "దాన్దేముంది సార్, బాగానే ఉంటుంది. కానీ ఈ స్టీల్ కప్‌బోర్డులవీ తియ్యాలి. ఇవన్నీ సీక్రెట్ ఫైల్స్ కదా మరి..." నసిగాడు.

"ఆల్‌రైట్! ఇలాగే ఉండనీ..."

"అమ్మయ్య" అనుకుంటూ బయటపడ్డాడు. అతనికిప్పుడు బోలెడు సంతోషంగా ఉంది. తనకి ముప్ఫై అయిదేళ్ళు. ముగ్గురు బిడ్డల తండ్రయినా, మనసులో రసికత్వం, రంగులంటే మోజు చావలేదు. అయితే పెద్ద మనుషుల్లో జమ కనుక, పెద్ద గుమాస్తా కూడా కనుక పైకి అవేమీ తెలియనివ్వడు.

రామారావు కుర్ర గుమాస్తా, ఇంకా పెళ్ళి కానివాడు కనుక అల్లరి చిల్లరగా ఉన్నా ఎవరూ పట్టించుకోరు. ఏమీ అనరుకూడా.

వీణ చాలా చలాకీగా పని చేసుకుపోయేది.

ఆ పిల్లకో నేర్పు ఉంది.

చనువు సంపాదించి, ముక్కు పట్టుకుని ఆడించడం!

ఒక్కోసారి ఆమె విసుర్లకీ, ఛలోక్తులకీ చిత్తయిపోతుండేవాళ్ళు గుమాస్తాలు. మనుష్యుల్లో జూదస్వభావాన్ని ఆసరాగా తీసుకుని వాళ్ళని బాగా రెచ్చగొట్టేది. బెర్నార్డ్ షా, బైరన్... వీళ్ళంతా చూడని ఆడది కావాలి వీణ! లేకపోతే ఆవిడ విచిత్ర వ్యక్తిత్వానికి వాళ్ళో అద్భుతమైన జీవితసత్యాన్నో, నిర్వచనాన్నో ముడివేసి ప్రపంచానికి చాటి ఉండేవాళ్ళు.

ఆఫీసు వాళ్ళెప్పుడన్నా కలిసికట్టుగా కొత్త సినిమాకి వెళ్ళడం జరిగేది. అది కూడా వీణ ప్రోద్బలమే.

"రామారావుగారు కొత్త సినిమాకి టికెట్లు తీసుకురాలేరని పందెం!" మాటల మధ్య అందంగా ఈ మాట అతికించేది. అక్కడ ప్రారంభం!

పందెం, పై పందెం.

చివరకి రామారావు నానా గడ్డి కరిచి టికెట్లు తెచ్చి పందెం గెలిచేవాడు!

"మీరు నిజంగా ఎడ్వెంచరస్..." అనేది ప్రశంసగా.

రామారావు చొక్కా చిరిగిపోగల ప్రమాద స్థాయిలో ఛాతీ పెరిగేది.

ఇలా ప్రతి ఒక్కరూ ఏదో రీతిగా ఆమె ప్రశంసలు పొందినవాళ్ళే, ఒక్క కృష్ణమూర్తి తప్ప!

'నాకూ అలాంటి ఛాన్సు తగిలితే బావుండు'నని వంద సార్లయినా అనుకునుంటాడు. అది రానే వచ్చింది. రావడం కూడా మెరుపులా వచ్చి, పిడుగులా అతన్ని ఢీకొంది.

"కృష్ణమూర్తిగారు దేన్నయినా వదిలిపెడతారేమోగానీ, సిగరెట్టు మాత్రం వదలరు! ఆయన దానికి బానిస..."

ఆఫీసువాళ్ళంతా ఈ దెబ్బతో కృష్ణమూర్తి ఓడిపోక తప్పదన్నారు. కృష్ణమూర్తి మొహం ఎర్రబడింది, తెల్లబడింది, నల్లబడింది...

ఈ మూడు క్షణాల్లో ఓ నిర్ణయానికొచ్చి "నేను బానిసను కాను... కావాలంటే వదిలెయ్యగలను..." అనేశాడు బింకంగా.

పందెం, పైపందెం.

కృష్ణమూర్తి పాకెట్టులోని సిగరెట్లు తీసి, తాగే అలవాటు ఉన్న వాళ్ళకి పంచేసాడు.

ప్రపంచాద్భుతాలకి మరోటి జత చేయడానికి కొందరు సిద్ధపడితే "ఆ రేపీపాటికి మామూలు. అసలు మనం కనుమరుగుకాగానే ప్రారంభించేస్తాడు. అనకూడదు కానీ, అతను పెళ్ళాన్నయినా వదులుతాడు గానీ సిగరెట్టు వదల్లేడు" అనేసారు కొందరు.

కృష్ణమూర్తికి చెవుడు లేదు కనుక ఇందులో కొన్ని వినిపించి పట్టుదలను మరీ పెంచాయి.

కానీ -

అలవాటుపడ్డ ప్రాణం నిలవనివ్వడం లేదే! నాలుక తెగ లాగేస్తూంది. పెదవుల్లో దురద. పైగా తనని ఛాలెంజ్ చేస్తున్నట్లు దూరంగా తనిచ్చిన సిగరెట్లు విలాసంగా తాగుతున్న గుమాస్తాలు!

అతనికి ఒళ్ళు భగ్గుమంది.

వాళ్ళందర్నీ ఊకుమ్మడిగా చావగొడదామన్నంత కోపం వచ్చింది. మిస్ వీణ అందమయిన జడ తెగ్గోయాలని కూడా అనిపించింది.

బలవంతాన నిగ్రహించుకున్నాడు.

ఆఫీసు అయిపోయింది.

ఇంటికి వెళ్ళడానికి లేచాడు.

దార్లోనే అందుకుంది తలనొప్పి. అలవాటు చొప్పున కిళ్ళీకొట్టు దగ్గర ఆగి, పర్సు తీసి సిగరెట్లు కొనబోతూ ఆగిపోయాడు. అంతరంగ వేదిక మీద నిలబడి "బానిస, బానిస" అని మిస్ వీణ హేళనగా నవ్వుతున్నట్లనిపించింది.

తను చాటుగా తాగితే ఎవరికి తెలుస్తుంది?! ఈ బాధ తను తట్టుకోలేడు.

మహా మహా విశ్వామిత్రుడే నిగ్రహం కోల్పోయాడు. తను మానవుడు. మామూలు మనిషి. తనెందుకిలా బాధపడాలి?

"ఏం కావాలి సార్? చార్మినారా, పనామానా?" ఎరిగున్న పరిచయంతో కొట్టువాడడిగాడు.

ఉలిక్కిపడ్డాడు. "ఏమీ వద్దు, ఏమీ వద్దు" గొణుక్కుంటూ ముందుకు వెళ్ళాడు. అగ్గిపెట్టె చొక్కా జేబులో ఉంది ఒంటరిగా! వంటికి గుచ్చుకుంటూ తన మూగగోడు వెల్లడిస్తూంది.

ఏదో కోల్పోయినట్లు, సుస్తీ పడినట్లు ఇంటికి చేరుకున్న భర్తని చూసి కంగారుగా, "ఏమిటండీ, అలా ఉన్నారేమిటి?" అంది కళ్యాణి.

"ఎలా ఉన్నాను? ముందు ఓ కప్పు కాఫీ ఇవ్వు..." అంటూ అలసటగా కూలబడ్డాడు కుర్చీలో.

ఆ మర్నాడు గానీ ఆమెకు భర్తలోని మార్పు అర్థంకాలా! నిరంతరం వెలిగే సిగరెట్టు అతని పెదవుల మధ్య ఇప్పుడు లేదు!

"ఏమండీ! మీరు సిగరెట్టు మానేసారా?" అంది తెల్లబోతూ, నమ్మశక్యం కానట్లు చూస్తూ.

"ఏం? మానెయ్యలేనా?" భ్రుకుటి బిగించి

> 'నీ కాబోయే భర్త భవిష్యత్ గురించి తెలుసుకోవాలనుకొంటున్నావన్న మాట' అన్నాడు జ్యోతిష్కుడు.
>
> 'అబ్బే... భవిష్యత్ గురించి తెలుసుకొనేదేముంది? అది నా చేతుల్లోనే ఉంటుంది కదా! అతని గత చరిత్ర గురించి చెప్పండి చాలు' అందా యువతి.

అడిగాడు.

నవ్వింది. "మీరా? ఇంకా నయం! అందుకా అలా ఉన్నారు? కొత్త అలవాటు ఎంత కష్టమో, పాత అలవాటు మానడం అంత కష్టం..."

అతనికి అవమానమనిపించింది. "చాల్లే ఊరుకో. నేనంత నిగ్రహం లేనివాణ్ణి కాను" చరాలున వెళ్ళిపోయాడు బయటికి.

ఓ వారం తరువాత బజార్లో అడిగారతన్ని "ఏమిటి? ఏదోలా ఉన్నారు నీరసంగా. ఏదన్నా నిరాహారదీక్షలో ఉన్నారా?" అని.

నవ్వేసి "అలాంటిదే"నని తప్పించుకున్నాడు.

మిస్ వీణ అతని నిగ్రహాన్ని ప్రశంసించి. ఓటమి అంగీకరించింది. ఆ రోజు పార్టీ, సినిమా. "మళ్ళీ సిగరెట్టు ముట్టుకోనని" వాగ్దానం తీసుకుని అతనికో పెన్ బహూకరించింది వీణ. అతనికి ఇంద్ర పదవి దొరికినంత ఆనందం కలిగింది. ఆ ఆనందంతో వళ్ళు తేలిపోతున్నట్లు, కళ్ళు మూతబడినట్లు అనిపించింది.

ఆస్పత్రిలో అతనికి తెలివొచ్చాక, అవసరమయిన పరీక్షలు ముగించిన డాక్టరు – "మీరు ఛెయిన్ స్మోకర్ అనుకుంటాను. 'లంగ్ కాన్సర్' రెండవ దశలో ఉంది. సిగరెట్లు తక్షణం మానేస్తే గానీ లాభం లేదు. ఇట్ ఈజ్ ప్రికాషన్!" అంటూ బయటికెళ్ళిపోయాడు. ●

# ఎర్రకోటపై చెదరని గుర్తులు

మన దేశ చరిత్రలో ఎర్రకోట కెంతో ప్రాధాన్యత ఉంది. ఎందరో రాజులు, చక్రవర్తులూ ఇక్కడ్నుంచే పాలించారు. ఇప్పటికీ మనదేశ ప్రధాని స్వాతంత్ర్యదినోత్సవ సందర్భంగా దేశ ప్రజలను ఉద్దేశించి ప్రసంగించేది ఈ ఎర్రకోట నుంచే. ఇదొక శక్తిస్థలి. ఈ ఎర్రకోటనెవరు నిర్మించారు, ఎవరెవరు పాలించారు అనేది చరిత్ర పాఠాల పాఠకులకు సుపరిచితమే కాబట్టి, ఆ అంశాలు ఇక్కడ ప్రస్తావించడం లేదు. కానీ ఈ ఎర్రకోటపై మనం ఎంతో పుణ్యప్రదంగా, పూజ్యనీయంగా భావించే వేద ప్రభావం ఎంతో ఉందంటే నమ్మాల్సిందే. ఆ అంశాలేమిటో సచిత్రంగా మీరే చూడండి. ఢిల్లీలోని ఎర్రకోట గురించి ఈ ఫొటోలు, విశేషాలూ ఆశ్చర్యాన్ని కలిగించక మానవు. అణువణువునా హిందూమత ప్రభావం కనిపిస్తూ ఉంటుంది.



ఎర్రకోట

ఆధునిక ఆర్కియాలజిస్టులు ఎర్రకోటను షాజహాన్ నిర్మించాడంటారు. అదీ క్రీ.శ. 1639-1648 సంవత్సరాల మధ్య (చిత్రం 1). అయితే చిత్రం 2 లో ఆక్స్‌ఫర్డ్‌లో Bodleian లైబ్రరీలో దాచి ఉన్న పెయింటింగ్ చూడండి. దాని ప్రకారం పెర్షియా రాయబారి 1628 లో షాజహాన్‌ని కలిసిన దృశ్యం అంటూ వ్రాసుంది. అంటే ఈ కోట షాజహాన్ కన్నా ముందునుంచే ఉంది. ఎందుకంటే మొదటి


THE RE[illegible]

[illegible]

[illegible] HAS [illegible]

[illegible] RESPECT [illegible]

[illegible] THE EASTERN RIVER, [illegible]

[illegible] BUILDING [illegible]

THE MAQQAR-[illegible]

MAHAL, KHAS-MAHAL [illegible]

DIWAN-I-KHAS MOT[illegible] AND [illegible]

THE TWO FAMOUS ARCHIT[illegible] USTAD HAMID

AND USTAD AHMAD WERE [illegible] SO[illegible]IATED WITH

ITS CONSTRUCTION WH[illegible] TOOK NINE YEARS

A [illegible] 1639-48 FOR COMPLE[illegible]ON.

చిత్రం: 1

ఫలకం ఆవిష్కరించింది ఆధునికులే గదా! (ఈ చిత్రాన్ని గతంలో అంటే 1971లో ఇల్లస్ట్రేటెడ్ వీక్లి ఆఫ్ ఇండియా పత్రికలో ప్రచురించారు) అంతేకాదు. ముస్లిం రాజుల / చక్రవర్తుల కాలంలో హిందూచరిత్రను వక్రీకరించడం జరిగిందనే వాదనకు ఇది బలం చేకూరుస్తోంది కూడా.

ఎర్రకోటలో రాజు ఉండే ప్రదేశాన్నే ఖాస్


SHAHJAHAN receives the Persian Ambassador in the Diwan-i-Aam, Red Fort Delhi (Mughal, c 1675 MS Ouseley, Curators of the Bodleian Library Oxford) Delhi once again became the Imperial seat when the capital was transferred from Calcutta

చిత్రం: 2

మహల్ అంటారు. ఈ మహల్‌లోని రాజముద్ర లో ఒక జత కత్తులు పైకి దూసినట్లు చూపుతు న్నాయి. అలాగే పవిత్ర హిందూకలశం, ఒక పద్మం, త్రాసు - ఇవన్నీ దిగ్భ్రాంతిని కలిగిస్తు న్నాయి. ఆ రాజముద్ర రాజా అనంగోల్‌దం టారు. చుట్టూ ఉన్న చుక్కల గుర్తు - ఈ కోట సూర్యవంశీయులదనే భావనకు వంతపాడు తున్నట్టే ఉంది (చిత్రం 3). ఈ రాజమహల్‌ని పూర్తిగా, జాగ్రత్తగా పరిశీలిస్తే ఇది ముస్లిం రాజులు కట్టించినది కాదని, రాజకోట సాక్షా త్తూ హిందూ రాజులదేనని స్పష్టమవుతుందం టున్నారు విశ్లేషకులు.



చిత్రం: 3

ఈ ఖాస్ మహల్‌లోనవున్న పాలరాతి తెర

డా॥ సాయి అయితిక



చిత్రం: 4

ఇవన్నీ ఒకప్పుడు హిందూ సంప్రదాయకమైన ప్రదేశాలే కావచ్చు. ఈ జాలీ పైభాగంలో ఉన్న రాచరికపు ముద్ర ఈ ఎర్రకోట షాజహాన్ కన్నా ముందే కట్టి ఉండవచ్చనే ఊహకు వూతాన్నిస్తోంది. చిత్రం 4 చూడండి మీకే తెలుస్తుంది.

– సాక్షాత్తూ రాజుగారి స్వంత దర్బారులో ఉండే ఈ తెర – హిందూమతానికి ప్రతీకగా ఉందంటే మనకు ఆశ్చర్యాన్ని కలిగించక మానదు. ఎందుకంటే ఇలాంటి తెరలు లేదా జాలీలు రామాయణ కాలంలో ఉన్న రాజభవనాలలో ఉండేవని వర్ణించడం జరిగింది. విశ్లేషకుల అంచనాల ప్రకారం ఇలాంటి జాలీలు అహ్మదాబాద్‌లోని కొన్ని మసీదుల్లోనూ ఉన్నాయి.

ఓంకారం హిందువులకెంతో పవిత్రమైనది, శక్తివంతమైనది, పూజ్యనీయమైనదీ అని వేరేగా చెప్పనక్కరలేదు. ఈ ఎర్రకోట షాజహాన్ కట్టించిందే అయితే ఆర్చీల మీద మిట్టమధ్యాహ్నపు సూర్యుని బొమ్మ, ఓంకారమూ ఎందుకుంటాయి? ఈ కోట సూర్యవంశీయులైన రాజులెవరో కట్టించి ఉంటారు. అంతే... (చిత్రాలు 5,6 చూడండి.)

ఎర్రకోటకు ఉన్న వివిధ ద్వారాలకు వివిధ



చిత్రం: 5



చిత్రం: 6



చిత్రం: 7

రకాలుగా పేర్లు వాడుకలో ఉన్నాయి. వాటిలో ఢిల్లీగేట్ అనే ద్వారం ఒకటుంది. ఇక్కడ నిలువెత్తు ఏనుగుల బొమ్మలున్నాయి (చిత్రం 7). ఈ ఆధారం కూడా ఎర్రకోటను హిందూ మతానికి చెందిన సూర్యవంశీయుడైన రాజా అనంగోల్ (1060 A.D.) కట్టించాడనే దానిని బలపరుస్తోంది. అంటే షాజహాన్ ఈ కోటను నిర్మించినట్లు చెబుతున్న దానికి 600 సంవత్సరముల ముందే ఈ కోట నిర్మించబడి ఉండాలి. ఉత్తరోత్తరా ఈ కోటను షాజహాన్ మరమ్మత్తులతో వాడుకొని ఉండాలి. ఎందుకంటే గజ ముఖం అనేది హిందువులకెంతో ప్రీతికరమైంది. వినాయకుని రూపుకావచ్చు లేదా ఏనుగు ముఖమే అచ్చంగా కావచ్చు... గృహాలకు, భవనాల తలుపులకూ అలంకరణగా ఉంచుకోవడం పరిపాటి. అది సంపదలను తెస్తుందని వారి నమ్మకం. మరి ఎర్రకోట అచ్చంగా అదీ ఒక ముస్లిం రాజు కట్టిస్తే, ఇలా అలంకరించుకొంటాడా? (చిత్రం 8). నిలువెత్తు ఏనుగుల విగ్రహాలు, తలుపులపై ఏనుగు రూపులూ ఇవన్నీ ఎర్రకోట ఎంతో పురాతనమైనదనే వాదనకి బలాన్నిస్తున్నాయి.

ఎర్రకోటలోని ఖాస్‌మహల్ తలుపుకున్న ఏనుగు గుర్తు, తదితర అంశాలను జాగ్రత్తగా పరిశీలిస్తే, అవి హిందూ ముద్రలేనన్న విషయం (చిత్రం 9) మనకు తేటతెల్లం అవుతుంది. అక్కడే ఉన్న నఖ్ఖార్ ఖానా (సంగీత భవనం)



చిత్రం: 8



చిత్రం: 9



చిత్రం: 10

గేటు వద్ద ఉన్న నిలువెత్తు ఏనుగు బొమ్మలను నాటి ముస్లిం రాజులు ధ్వంసం చేసారు. ఈ ధ్వంసమైన రాతిముక్కలు ఇప్పటికీ ఖాస్ మహల్‌లోనే బేస్‌మెంట్‌లో చూడవచ్చు.

ఎర్రకోటలోనే ఒక మసీదు కూడా ఉంది. దీన్నంతా మోతీ మసీదంటూంటారు. దీనిని



మోతి మసీదు

షాజహాన్ పుత్రుడైన ఔరంగజేబు నిర్మించాదని అక్కడి ఫలకం చెబుతోంది. కానీ అది నిరాధారం. ఎందుకంటే దీని ప్రవేశ ద్వారం ఒక హిందూ దేవాలయ ద్వారనిర్మాణాన్ని పోలి ఉంటుంది. రెండు డోమ్‌ల మధ్య ఉన్న ఆర్చి అరటి చెట్లున్న విధంగా ఉంటుంది. ఇది కేవలం హిందూ దేవాలయాల్లో మాత్రమే ఉంటుంది. ఈ ఆర్చికి రెండువైపులా పళ్ళుఉన్న పళ్లెం ఉంది. అసలు మోతి అంటే ముత్యం. భవనాలకు ఇలా ముత్యాల పేరున, రత్నాల పేరునా పేర్లు పెట్టేది కేవలం హిందూ సాంప్రదాయం. ఈ మసీదు గోడలు, ప్రక్కనే ఉన్న ప్యాసేజి – ఇవన్నీ ఒక గుడిని మార్చి మసీదుగా చలామణి చేసారా? అనే సందేహాన్ని కలుగ జేస్తున్నాయి.

మోతీమసీదు ప్రవేశద్వారానికి పైభాగంలో


చిత్రం: 11

అరటిపండ్ల గుత్తులు, ఆర్చి క్రింది భాగంలో అరటిపండ్ల గుత్తులూ - ఇవన్నీ హిందువులు వాడే గుర్తులే (చిత్రం 10,11).

ఎర్ర కోటలో ఉండే రంగమహల్ నదీతీరం లో ఉంది. దీని గోడలపై ఉన్న డిజైన్ ఈ ఎర్రకోట షాజహాన్ కన్నా ముందే నిర్మించ బడిందని సూచిస్తోందంటున్నారు విశ్లేషకులు. అసలు రంగమహల్ అనే పేరు హిందూపేరు. ముస్లింలు ఆ పేరు పెట్టరు కదా! అని వారు అంటున్నారు. ఇవన్నీ చూస్తూంటే ఏది సత్యం? ఏదసత్యం? ఓ మహర్షీ! అనుకోవాలంటారా? ఆగండాగండి. మీరు బిత్తరపోయే అంశం మరోటి చెప్పి ఈ కథ ముగిస్తాను.

ఢిల్లీలో హుమయూన్ సమాధి ఉంది తెలుసు కదా! అది నిజానికి ఒక హిందూ దేవాల


చిత్రం: 12


చిత్రం: 13

యం. ఈ విషయం నేనన్నది కాదు... సాక్షాత్తూ ఆంగ్లేయులే నిర్ధారించారు. ఈ సమాధిలో రెండు పాదాలు కనిపిస్తాయి (చిత్రం 13). వీటిని విష్ణు పాదాలంటారట. అసలు హుమయూన్‌ని ఢిల్లీలో సమాధి చేయనేలేదంటారు. కొన్ని ఆధారాల ప్రకారం హుమయూన్‌ని ఆగ్రా లో సమాధి చేయడం జరిగిందని నమ్ముతున్నారు. మరో కథ ప్రకారం హుమయూన్‌ని సిర్‌హింద్‌లో సమాధి చేయడం జరిగింది. ఇవన్నీ వింటే మన గత చరిత్రనంతా ఎవరో తిరగరాయాల్సిందేననిపించట్లేదూ? తప్పుల తడకలను తొలగించి, యధార్థ గాథలను వెలికి తీస్తే మరెన్నో నిజాలు వెలికివస్తాయి. అపుడు మన పురాణ, చారిత్రాత్మక గాథలన్నీ నిజాలేనని అందరూ తప్పక నమ్మాల్సిందే. ఈసారి ఢిల్లీ వెళ్ళినపుడు ఎర్రకోట విషయాన్ని మీ కళ్ళతో మీరే చూసి నిర్ధారించుకోండి. ●

## పుస్తక సమీక్ష

## సత్తికొండ (నవల)

రచన: ఐతా చంద్రయ్య




వెల: రు. 60/-
ప్రతులకు: ఐతా చంద్రయ్య
4-4-12, శేర్‌పురా
సిద్ధిపేట - 502 103

ఐతా చంద్రయ్య సామాజిక స్పృహ ఉన్న రచయిత. ఊహలు, కల్పనలకు అట్టే ప్రాధన్యమివ్వక, తాను తెలుసు కున్నది, అనుభవాల ద్వారా ఆర్జించిన విషయ పరిజ్ఞానాన్ని అవసరమైన మేరకు ఈ నవలలో వినియోగించుకున్నారు. సందర్భాన్ని బట్టి చక్కని ఉపమానాలతో రచనలో రుచి పెంచారు.

ఏ రచనకైనా 'చదివించే లక్షణం' ఉండాలి. అప్పుడే పాఠ కుడు రచయిత మనస్సుని చదువుతాడు. చంద్రయ్యగారి శైలిలో చదివించే లక్షణం పుష్కలంగా ఉంది. అటుపైన కథావస్తువు మంచిది. శిల్పం చక్కగా మలుచుకున్నారు. ఇన్ని సలక్షణాలు ఉన్నప్పుడు 'సత్తికొండ' మంచినవల కాకుండా ఎలా ఉం టుంది? తప్పకుండా చదవాల్సిన మంచి నవల.

ముగింపు సాదాసీదాగా అనిపిస్తుంది. అలా కాకుండా కొత్తదనం చూపి ఉంటే మరింత బావుండేది. కానీ ఇదేమీ లోపంకాదు.

ఈ నవల 'చతుర' మాసపత్రిక నుంచి పునర్ముద్రణ.

---

## రాసలీల (మహాకావ్యము)

డాక్టర్ ఆకొండి విశ్వనాథం




వెల: రు. 126/-
ప్రతులకు:
విశాలాంధ్ర అన్ని బ్రాంచీలలో

డాక్టర్ ఆకొండి విశ్వనాథంగారు సంప్రదాయ సాహిత్యాన్ని సమగ్రంగా ఆపోశన పట్టిన అపర సరస్వతీ అవతారం. దర్శనా చార్యులు. వీరి కుటుంబం సాహిత్య కుటుంబం. అనువంశికంగా వీరికి సరస్వతీ కటాక్షం లభించినట్లు తెలుస్తోంది. వీరి అవిశ్రాంత సాహిత్యకృషిలో ఎన్నెన్నో గౌరవాలు, సన్మానాలు, బిరుదులు పొందారు.

ఇవన్నీ అట్లా ఉంచితే - 'రాసలీల మహాకావ్యము' ఒక అద్భుత గ్రంధమని చెప్పవచ్చు. వేదాలు, త్రిమూర్తులు, సమస్త దేవతలు సదా స్మరించేది, తద్వారా తరింపజేసేదీ రాధాపరదేవత నా మామృతమే. రాధాదేవి గోలోకంపైనగల భావలోక నివాసిని. ఆమె ను ఆహ్లాదినీ శక్తి అని వేదాలు వర్ణిస్తాయి. సర్వలోక ప్రభువయిన శ్రీకృష్ణుడి ఆరాధ్య దేవత రాధ. "కృష్ణేన ఆరాధ్యయేతి రాధ" - శ్రీకృష్ణపరమాత్మ చేత ఆరాధించబడుతున్నది గనుక రాధగా పిలువబడుతున్నదంటారు. రసజగత్తుకు మూలాధిదేవత రాధ. ఆమె చరిత్ర ఆత్మానందకారకమైనది. మోక్షం కన్న గొప్పది రసానంద జగతి. అందులోకి రాధ అనుమతి, అనుగ్రహం లేకుండా త్రిమూర్తు లకు సైతం ప్రవేశం దుర్లభం.

రాధా పరతత్వం మీద చక్కని మధుర గ్రంధాలు రాసిన వారిలో అగ్రగణ్యులుగా శ్రీరాధికాప్రసాద్

మహరాజ్‌ని చెబుతారు. వారు నూరేళ్లపైబడి జీవించి, తమ శిష్యులకు రాధ రస జగత్తును పరిచయం చేసారు. ప్రత్యక్షంగా శ్రీరాధాదేవితో ఆత్మానుసంధానం చేయగలిగిన మహర్షి ఆయన. వారు ప్రస్తుతం లేరు. కానీ వారి అనుగ్రహం పొందగలిగిన శిష్యులు ఆ పంథాలో కొనసాగుతూ రసానందాన్ని పొందు తున్నారు.

డాక్టర్ ఆకొండి విశ్వనాథంగారు 'రాసలీల' పేరుతో రచించిన ఈ మహాకావ్యము ఆస్తికులను, పాఠకులనూ రస జగత్తుకు పరిచయం చేసి, ఆత్మానందంలో ఓలలాడిస్తుంది. రసజగత్తు గురించి ఎంతచెప్పినా తక్కువే. ఇలాంటి మంచికావ్యాన్ని తెలుగువారికందించిన రచయిత ధన్యులు. ఇది అవశ్యం పఠించవలసిన కావ్యము. భాష అందరికీ అర్థమయ్యేలా, రసరమ్యంగా ఉంది కాబట్టి ఎవరయినా చదవొచ్చు.

## బాలకవితారసాలం

(పద్య కవితా సంకలనం)



వెల: **రు. 15/-**
ప్రతులకు: తోకల రాజేశం
అవడం (పోస్టు), నెన్నెల మండలం
వయా భీమారం - 504 204, ఆదిలాబాద్ జిల్లా

"వెలుగు పంచడమంటే - పెంచడమే" శ్రీ జక్కెపల్లి నాగేశ్వరరావు గారి శిష్యులు, అభిమానులు - (అందరూ బాలలే) చక్కని కవిత్వాన్ని పరిమళింపజేసారు. తెలుగు సాహిత్యానికి ఖ్యాతి, ప్రఖ్యాతి తెచ్చింది పద్యమే! ఈ ప్రక్రియను ప్రోత్సహించి, వందల సంఖ్యలో పద్యాలు తమ శిష్యుల చేత రాయించడమేగాక, అందులోంచి కొన్ని ఆణిముత్యాలు అచ్చురూపంలో రావడానికి ఆశీస్సులిచ్చిన సాహిత్యగురువు శ్రీ జక్కెపల్లి నాగేశ్వర రావుగారు, ప్రచురణకు సహకరించిన వదాన్యులు బహుధాప్రశంసనీయులు. ఇలాంటివి మరెన్నో రావాలి. ఈ పుస్తకం ఔత్సాహిక బాలకవులకు ఆదర్శం కావాలి. బాలకవులు తప్పక చదవాలి.

## తెలుగు బాల శతకము

రచన: **తోకల రాజేశం**

ఇది ఒక కవి రాసిన ఉదయరాగరంజిత కవితా సుమగుచ్ఛం. పుట్టగానే పరిమళించే కవితా సుమం ఈ బాలకవి. తెలుగు బాలమకుటం కూడా ఎంతో అనువుగా ఉంది. ఆటవెలదితో అలవోకగా ఆణిముత్యాల వంటి పద్యాలు వ్రాసిన ఈ బాలకవిని పెద్దలు దొడ్డమనసుతో ఆశీర్వదించారు. ఈ సుకవికి పాఠకుల ఆశీర్వాదాలకు పూర్తి అర్హత ఉంది. అందరూ చదివి, ఆశీర్వదించాల్సిన అందమైన పుస్తకం.



వెల: **రు. 15/-**
ప్రతులకు:
సముద్రాల
వేణు గోపాలాచార్య
9-5-221, రాంనగర్, ప్రగతి నగర్
కరీంనగర్ - 505 001

## సుధావర్షి
(డా॥ టి. శ్రీరంగస్వామి అభినందన)



సాహితీవనంలో కొందరు కమనీయ కవులు. కొందరు కల్పవృక్షాలు. కొందరు పారిజాత తరువులు. ఆ కోవకు చెందిన మనీషి 'నవభారత సాహిత్యరత్న' బిరుదాంకితులు శ్రీ టి. రంగస్వామిగారు. ఎందరో సాహితీమూర్తుల అభినందనలు, శుభాకాంక్షలు, మరెన్నో సన్మానాలు, సాహితీ పురస్కారాలు అందుకున్న అదృష్టశాలి. సరస్వతీ ప్రియపుత్రులు. వివిధ సాహితీ ప్రక్రియల్ని వశం చేసుకున్న బహుముఖ ప్రజ్ఞాశాలి.

ఆనవాయితీని పక్కకు పెట్టి వీరి అభినందన సంచికను ఒక చక్కని గ్రంథంలా ప్రచురించిన తీరు ఎంతో బావుంది. ముఖచిత్రం, అంతర్‌చిత్రాలు, అభినందనవ్యాసాలు, కొద్దిపాటి అడ్వర్టయిజ్‌మెంట్స్... అవి కూడా పాఠకులకు ఇబ్బంది లేకుండా అఖరున చేర్చడం వెరసి వెరైటీగా, ఆకర్షణీయంగా ఉంది.

వ్యాసకర్తలు శ్రీరంగస్వామి గారి మీద సుధా వర్షాన్నే కురిపించారు. ఆ సుధను ఆస్వాదించి ఆనందించడం పాఠకుల వంతు.

**కాటూరి**

వెల: **రు. 80/-**
ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ అన్ని బ్రాంచీలు

---

## దృశ్యకావ్యం గొబ్బిపూలు
రచన: **డా॥ యల్.కె. సుధాకర్**



వెల: **రు. 50/-**
ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ అన్ని బ్రాంచీలు

చిత్రకారుడే రచయిత అయితే అతని రచనల నిండా దృశ్యం ప్రధానంగా ఉంటుంది. అదే చిత్రకారుడు, రచయిత, కవీ ఒకరే అయితే మరింత సౌందర్యం రచనల్లో నిండి ఉంటుంది. ఈ 'గొబ్బి పూలు" రచయిత కవి కూడా కావడంతో, ప్రతి కథా ఒక పద్యకావ్యం చదువు తున్న అనుభూతి కలగక మానదు.

ఒక అందమైన బాపు బొమ్మ వివాహానంతరం భర్తతో నూతన సంసార జీవితం ప్రారంభించిన తొలి రోజున ఆమెకు ప్రీతి పాత్రమైన 'గొబ్బిపూలు' పొట్లం ఇచ్చి ఆమె భర్త, ఆమె కళ్ళల్లో విరిసిన ఆనందపు వెలుగులతో నిండిన, విరిసిన పూలను చూపడం, పాఠకుని హృదయంలో కూడా మధురానుభూతుల పుష్పాలను వికసింపచేస్తుంది. ఈ సంపుటిలోని తొలికథ 'గొబ్బిపూలు'.

'ఆంధ్రభూమి' వారపత్రిక కథల పోటీలో ప్రథమ బహుమతి పొందిన 'కృష్ణుని బొమ్మ' కథలో తన దగ్గర ఉన్న కృష్ణుని బొమ్మలు ఎంతకిస్తావ్ అని అడిగితే కిట్టయ్య "అమ్మకి పదిహేనురోజులకు సరిపడా మందుల ఖరీదుకి" అంటాడు. కానీ దారిలో ఒక పిచ్చిది కనిపిస్తే దానికి తిండి పెట్టి, మందులు కొంటాడు. "ఎవరన్నారు డబ్బుకీ, ప్రేమకీ సంబంధం లేదని" అంటాడు రచయిత. ఆర్ద్రత నిండిన కథ... ఇలాంటి కథలు నిండిన పద్దెనిమిది పుష్పాల పూలదండ ఈ 'గొబ్బిపూలు'.

ఈ పుస్తకానికి ప్రపంచ ప్రఖ్యాత చిత్రకారుడు 'బాపు' సర్వంగ సుందరంగా బొమ్మను ప్రసాదించడమే కాకుండా రచయితపై ఆశీస్సుగా 'అక్షతలు' జల్లడం అపూర్వం.

**కె.బి. కృష్ణ**

KRS A1OIM 119

మీరు ఫొటోగ్రఫీ మరియు సైనేజ్ రంగానికి చెందినవారైతే ఈ ప్రదర్శన మీ కోసమే!

60cc Engine
Camera car
on display






Sign Show 2006



People's Plaza
Necklace Road
Hyderabad
1st, 2nd & 3rd
September
2006




THE PREMIER SOUTH INDIAN EXHIBITIONS FOR PHOTO, VIDEO, P.O.P. & SIGNAGE



Co-Sponsored by



Large format DIGITAL Imaging Pvt. Ltd.
Ph: 040-5536 4444

Supported by



Photographic Association Andhra Pradesh

Media Co-ordinator

SOLUS MEDIA
Ph. 040-23230750




NAMDHARI INDIA MART
THE EVENT MANAGERS

Organiser :
VILLART
EXPOSITIONS

Tel: 040 - 2332 2572, 5563 2332, Mobile: 98851 00010
Rim: 040 - 3295 9995, 93999 54448, 93999 54449
e-mail: villartexpo@yahoo.com / villart@villart.in
www.villart.in

BC



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KRSA101M119 |
| పుస్తకం పేరు | కథాకేళి |
| తారీఖు | 23 February 2025 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 101 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | No |
| లేని పేజీలు | 12 |
| తయారు చేసినది | Vedavathi |
| పేజీలు విడదీసినది | Vedavathi |
| స్కాన్ చేసినది | Sharmila |
| పరీక్ష చేసినది | hema |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | GOOD |